శ్రీ బాలాంత్రపు వేంకటరావు గారిచే రచింపబడిన

# స్త్రీల వ్రత కథలు

## నోముల కథలు



కాళహస్తి పబ్లికేషన్స్, రాజమహేంద్రవరము

శ్రీ రాజరాజేశ్వర్యై నమః



# స్త్రీల వ్రత కథలు

1, 2, 3 భాగములు

## (నోముల కథలు)


గ్రంథ కర్త :

'కవిరాజహంస'

శ్రీ బాలాంత్రపు వేంకటరావు





ప్రకాశకులు :

**కాళహస్తి పబ్లికేషన్స్**

కాళహస్తి పార్వతీశం & సన్

కె.వి.ఆర్.స్వామిరోడ్, రాజమహేంద్రవరము.




వెల : 25-00

# గమనిక

శ్రీ బాలాంతరపు వేంకటరావుగారిచే రచియింపబడిన యీ స్త్రీల వ్రతకథలు (నోములకథలు) 1914 సంవత్సరమున రివైజ్డు కాపీరైట్ ఆక్టు ప్రకారం శ్రీ బాలాంత్రపు వేంకటరావుగారు సంపూర్ణ కాపీరైటు కలిగియున్నట్లు తూర్పుగోదావరి జిల్లాకోర్టు ఫయిల్ అసలు నెం. 2/19-7 రున డిక్రీని పొందియున్నారు. వారివద్ద ది. 16-1-1946 న మేము శాశ్వత కాపీరైటు హక్కులను పొంది యున్నాము గాన యింతటి నుండి మా అనుమతి లేనిదే గ్రంథ మంతయు గాని అందులోని భాగములుగాని పదజాలమును మార్చిగాని ఎవ్వరును ముద్రింపకూడదని యిందు మూలముగా తెలియజేయడమైనది. దీని నతిక్రమించి నడుచువారిపై కాపీరైటు ఆక్టు ప్రకారము చర్య జరిపి మాకు కలుగు యావత్తు నష్టములు రాబట్టుకోవడమగును.

రాజమండ్రి<br>1-5-1946

ఇట్లు<br>**కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్**

---

1882-1982 నేటికి సరిగ్గా నూరేండ్లు నిండినది కాళహస్తి పబ్లికేషన్స్ సంస్థ ప్రావిర్భవించి, యీ వంద సంవత్సరాలలో స్త్రీ, బాల, ప్రయోజనులకు పురాణ, ఇతిహాసాలు రామాయణ, భారత, భాగవతమువంటి వందలాది గ్రంథాలు ప్రచురించి ఆంధ్రుల ఆదరాభిమానము పొందియున్నాము.

సుమారు 75 సంవత్సరాల క్రితం పిఠాపురం సంస్థాన జంట కవులు శ్రీ వేంకటపార్వతీశ్వరులలో ఒకరైన, శ్రీ బాలంత్రపు వేంకటరావుగారిచే రచింపబడి మూడు భాగాలుగా ముద్రించ బడిన యీ " స్త్రీల వ్రతకథలు" కాలక్రమేణ మా ప్రచురణలో ఒకే పుస్తకముగా ముద్రించి ఆంధ్ర స్త్రీల కందించినాము. లోగడవలెనే మా యీ గ్రంథాన్ని ఆదరించ కోరుచున్నాము.



ఇట్లు<br>**కాళహస్తి పార్వతీశం అండ్ సన్**



# విషయసూచిక

## ప్రథమ భాగము



## ద్వితీయ భాగము

## తృతీయ భాగము



బాలాంత్రపు వేంకటరావు వారి

ప్రాచీన

# స్త్రీల వ్రతకథలు

## ప్రథమ భాగము

### 1. మోచేటి పద్మము (మూగనోము)

ఆశ్వయుజ బహుళ అమావాస్య మొదలుకొని కార్తీక శుద్ధ పూర్ణిమ వరకును మూడుపూటలు భోజనముచేసి సాయంకాల సమయమున కంఠ స్నానముచేసి శుచియై తొలియేట తులసివద్ద నాలుగు పద్మములు పెట్టుకొని నాలుగు వత్తుల దీపము పెట్టుకొని మాట్లాడకుండ నలుగురు ముత్తయిదువులకు బొట్టుపెట్టి తరువాత నాలుగు నక్షత్రములను లెక్కపెట్టవలయును. రెండవయేట యెనిమిది పద్మములు పెట్టి యెనిమిది వత్తులదీపము వెలిగించి యెనమండుగురు ముత్తయిదువులకు బొట్టుపెట్టి యెనిమిది నక్షత్రములు లెక్కపెట్టవలయును. మూడవయేట పండ్రెండు పద్మములకు పండ్రెండు వత్తుల దీపమునును పెట్టి పండ్రెండుగురు ముత్తయిదువులకు బొట్టుపెట్టి పండ్రెండు నక్షత్రములు లెక్క పెట్టవలయును.

**దీనికి ఉద్యాపనము :-** తొలియేట నాలుగేసి అట్లు నలుగురు ముత్తయిదువులకు వాయనమిచ్చి దక్షిణతాంబూలము, నల్లపూసలు, లక్కజోడు ఇయ్యవలెను. నోము నోచుకున్న వారలకు రెండు చేతుల మీద రెండు అట్లున్ను, రెండు డబ్బులున్నూ, రెండుకాళ్లమీద రెండు అట్లున్నను, రెండు డబ్బులున్నూవుంచి, అన్నగారు తలుపు వెనుకనుండి "తిని కుడిచే కాలానకు రాకే పెడసరగండ" అంటే "ఇప్పుడు రానా? మాపునరానా ఏం? అని అడుగవలయును. అప్పుడు నోముపట్టిన కన్య, "యిప్పుడే రమ్ము" అనవలయును. అన్న వచ్చి పుస్తకముతో నాలుగు దెబ్బలుకొట్టి నాలుగుఅట్లు, నాలుగు డబ్బులు తీసికొనవలయును. ఈ ప్రకారము రెండవయేట యెనిమిది వాయనములును, మూడవయేట పండ్రెండు వాయనములును ముత్తయిదువుల కియ్యవలెను.

ఈ నోము పాట :-

మోచేటి పద్మంబు పట్టేటివేళ - మొగ్గల తామర్లు పూసేటి వేళ
కాకరపువ్వుల్లు పూసేటివేళ - కడవలతో నుదకమ్ము తెచ్చేటివేళ
అనసాపువ్వుల్లు పూసేటివేళ - అటికెలతో నుదకమ్ము తెచ్చేటివేళ
గుమ్మడిపువ్వుల్లు పూసేటివేళ - గుండెగలతో నుదకమ్ము తెచ్చేటివేళ
బీరపువ్వుల్లు చాలపూసేటివేళ - బిందెలతో నుదకమ్ము తేచ్చేటివేళ
సంధివేళ దీపమ్ము పెట్టేటివేళ - చాకలి మడతలు తెచ్చేటివేళ
ఆవూలూ గోవులూ వచ్చేటివేళ - ఆంబోతుల్లు రంకెలు వేసేటివేళ
అన్నలూ అందనా లెక్కేటివేళ - తమ్ములూ తాంబూలం వేసేటివేళ
మరుదుళ్లు మరిజూద మాడేటివేళ - కూతుళ్లు గుండిగలు దించేటివేళ
బావలూ పల్లకి లెక్కేటివేళ - మరదలూ మరిజూద మాడేటివేళ
కోడళ్ళు కొట్టుపసుపు కొట్టేటివేళ చెల్లెలు చేమంతులు ముడిచేటివేళ

ముద్దు మొగ ముద్దానిబోలు, తన మొఖము తామర పద్మాన్నిబోలు, పద్మము పెట్టిన చానకు పదివేళ యేండ్లు అయిదవతనమును, ముగ్గుపెట్టిన చానకు మూదువేల యేళ్ళు అయిదవతనమును, ఈ పాట పాడుచు తులసమ్మకు ప్రదక్షిణలు చేసి అక్షంతలు వేసికొనవలయును.

## 2. పదారు కుడుముల తద్దెకథ

ఒక రాజుకూతురు పూర్వజన్మమున పదారుకుడుముల తద్దినోము పట్టి యది యుల్లంఘనము చేసినందున ఆమెకు దారిద్ర్యమును, వైధవ్యమును సంభవించెను. ఆ దారిద్ర్యబాధకామె యనుభవింపజాలక ప్రాణములు విడువనెంచి యొకనాడొక యడవిత్రోవను బట్టి పోవుచుండెను. అప్పుడు భూపరిపాలనకై పార్వతీ పరమేశ్వరులా దారిని వచ్చుచు నాయింతిని జూచి "నీవెవరవు? ఇట్లేల నొంటరిగా నీకారడవిలో భయములేక పోవుచున్నావ"ని యడుగగా-"నా జోలి మీకేలె?" అని యామె ప్రత్యుత్తర మిచ్చెను. ఇట్లనుటకు పార్వతీ పరమేశ్వరులు చిరునవ్వు నవ్వుకొని "ఎందుచేత నీవిట్లున్నదానవ"ని యడుగగా-"కుడువకూడు, కట్టబట్ట, దారిద్ర్యముచేత బాధపడలేక యీ యడవులబట్టి పోవుచున్నా"ని ఆమె చెప్పెను. అప్పుడు పార్వతీదేవి-"నీవు పదియారు కుడుములబెట్టి నోముపట్టి యుల్లంఘనము చేసినావు కనుక, యిట్టి బీదతనము నిన్ను బాధించుచున్నద"ని చెప్పెను. అది విని ఆ రాజకుమార్తె "అమ్మా! యాలోటు నేనెట్లు పూర్తిచేసుకొనగలుగుదును? దయచేసి చెప్పవలయున"ని ప్రార్థించెను. అందుకు పార్వతీదేవి యామెతో "నీవిప్పుడు తిరుగనింటికిపోయి భాద్రపదశుద్ధ తదియనాడు నోముపట్టికథ చెప్పుకొని యక్షింతలువేసుకొని యానోము నుద్యాపనచేయు" మన, పార్వతీ పరమేశ్వరులకు భక్తితో నమస్కారముచేసి వారివద్ద సెలవుతీసుకొని, యింటికిపోయి తలంటి నీళ్ళుపోసుకొని బిళ్లకుడుములు వండుకొని,

చల్ల తెచ్చుకొనుటకై పొరుగింటి కేగెను. ఆ సమయముననొక కుక్కవచ్చి యోరగిల వేసిన తలుపుతోచుకుని యా కుడుములను తినిపోయెను. అప్పుడా రాజకుమార్తెవచ్చి కుడుములు తినిపోవుచున్న యాకుక్కను చూచి, యది కుడుములతినుటగ్రహించి నిండుమనస్సుతో నాకుక్కకే తాను తెచ్చిన చల్ల మూడుముంతలు పోసెను. అప్పుడు గౌరీదేవి యామెకు ప్రత్యక్షమై "యుత్తమకాంతా! దీనికై నీవు విచారించవద్దు నీకైశ్వర్యము నిచ్చుచున్నాను" అని అంతర్ధానము నొందెను. నాటి నుండి యా రాచకూతురు సిరిసంపదలుగలదై యేటేటపదియారుబిళ్ల కుడుములు నైవేద్యముచేసి పదియారుబిళ్లకుడుముల వాయనమును, దక్షిణ తాంబూలములతో నొక ముత్తయిదువకు వాయనమిచ్చి యుద్యాపచేయుచు, భూలోకలమున నధికైశ్వర్యముల ననుభవించెను.

**దీనికి ఉద్యాపనము :-** పదియారు చేటలను, చేటయొక్కంటికి పదియారేసి బిళ్లకుడుములు, పదియారు డబ్బులును, దక్షిణము, నల్లపూసలు, లక్కబోడు పెట్టి ఉద్యాపనము చేసుకొనవలయును. కథలోపమైన వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినా ఫలము తప్పదు.

## 3. ఉండ్రాళ్ళ తద్దె కథ

పూర్వకాలమున నొక రాజున కిద్దరు భార్యలుండిరి. ఒకనాడారాజు భార్యలును నాపట్టణ స్త్రీలును ఉండ్రాళ్ళదద్దెనోము నోచుకొని చుండిరి. రాజుగారుంచుకొనిన భోగమది రాజుగారు దాని యింటికి వచ్చుసరికి ముసుగువేసుకొని యొకచోట పండుకొని యుండెను. అది చూచి యారాజు-"నీ వెందువలన నిట్లున్నదానవ"ని యడిగెను. "రేపు ఉండ్రాళ్లతద్దె, నేను నోము నోచుకొనవలయును. కాబట్టి నాకన్ని వస్తువులును గావలెన"ని యా వేశ్య చెప్పెను. "నీకేమి వస్తు సామాగ్రి గావలెనో చెప్పుము. ఇదియెంత? నా చేతిలోపని" అని ఆ రాజు పలుకగా వేశ్య-"చేట, గీట, పీట,పీట, కూరగీర, పప్పు-గిప్పు, బియ్యము-గియ్యము, పుల్ల-గిల్ల, నెయ్యి- గియ్యి, ఆకు-గీకు, చెక్క-గిక్క డబ్బు-గిబ్బు, పసుపు-గిసుపు, కుంకుమ-గింకుమ, బెల్లం-గిల్లం కావలెను. నేను నోము-గీము నోచుకొనవలెను. పట్టించుకొని రావలెన"ని చెప్పెను. రాజును "ఆ వస్తుసామాగ్రిని తెప్పించెదన"ని అందుకై వెడలి కొందరు సేవకులను దీసుకొని యాపట్టణ మెల్లచోట్ల తిరిగి వర్తకులు మొదలైనవారి నా వస్తువుల నడిగెను. ఆ వర్తకులు- "మావద్ద నన్నియు నున్నవిగాని 'గీ' అన్న వస్తువులు మాత్రము లేవ"ని చెప్పిరి. రాజును తిరిగి తిరిగి మూడుజాములకు వేశ్యకాంత ఇంటికి వచ్చెను. అప్పటికా వేశ్య కుండలన్నియు కడిగి నీరు యొక కుండలోపోసి యుంచెను. రాజుగారు రాగానే-"యా వస్తువులన్నియు తీసుకొని వచ్చితిరా?" యని యా వేశ్యా స్త్రీ యడుగగా అతడు 'అన్నియు దొరికినవిగాని 'గీ' యను వస్తువుమాత్రము దొరకలేద'ని చెప్పెను. పోనిండు నోము అయిందని' చెప్పి

యీ కుండలో నుంచిన నీళ్లు తీసుకొనివచ్చి యా రాజు మొగముమీద పోసెను. అతడందుకు కోపగించుకొనక–'యా వస్తువులిక నేను తెప్పించలేను, నీ యిష్టము వచ్చినట్టు నోము నోచుకొమ్మ'ని చెప్పెను. అప్పటికి ప్రొద్దు గ్రుంకు సమయమయ్యెను. అప్పుడు ఉండ్రాళ్లు వండుకొని ముత్తయిదువును తీసుకొనివచ్చి అయిదు ఉండ్రాళ్లు నైవేద్యముపెట్టి అయిదు ఉండ్రాళ్లు వాయనము, దక్షిణతాంబూలము ముత్తయిదువ కిచ్చి యావేశ్యకాంత యధావిధిగ నోము నోచుకొనెను. ఈ ప్రకారము అయిదేండ్లు నోము నోచుకొని అయిదుగురు ముత్తయిదువులకు తలయంటి నీళ్ళుపోసి గోరింటా కిచ్చి అయిదు రవికెల గుడ్డలను, అయిదు దబ్బులును, తాంబూలములనిచ్చి యా నోము నుద్యాపనము చేసుకొనియెను. కథలోపమైనా వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినా ఫలము తప్పదు.

## 4. అట్లతద్ది కథ

రాచవారి అక్కెమ్మ, వెలమువారి అక్కెమ్మ, బ్రాహ్మణవారి అక్కెమ్మ, కోమటివారి అక్కెమ్మ, కాపువారి అక్కెమ్మ వీరైదుగురు తద్దినోము నోచుకుందామని ఉపవాసముం డిరి. మూడు జాములు దాటిన తరువాత సుకుమారి అయిన రాచవారి అక్కెమ్మ మొగము తిరిగిపడిపోయెను. అంతట అన్నలువచ్చి "యేమమ్మా! ఇట్లుపడి పోయినద"ని తల్లిని అడుగగా– నాయనా తద్దినోము నోచుకుందామని యుపవాస ముండి చంద్రుడు వచ్చినదాక నుండలేక పడిపోయినదని చెప్పెను. అప్పుడొక యన్నగారు చింతచెట్లెక్కి అద్దముకట్టి అరికకుప్పకు ఆ అద్దమునకు తిన్నగా చిచ్చుపెట్టి చెల్లెలినిలేపి "అమ్మాయీ అదిగో! చంద్రుడు వచ్చినాడు. ఆ చింతచెట్టు వైపునకు చూడుమని భ్రమింపజేసి నోము నోచుకొమ్మని చెల్లెలితో చెప్పెను. ఆమె నిజముగా చంద్రుడు వచ్చినాడనుకొని సంతోషించి నోము నోచుకొని అన్నము తినెను. అంత నామెకు పదియేండ్లు వచ్చిన తరువాత పెండ్లిచేయుటకు ప్రయత్నించగా ముసలి మొగుడు వచ్చెను. ఆమె వానిని జూచి "నాకు పెండ్లి అక్కరలేదు. అయ్యో తద్దినోము నోచుకుంటే పడుచుమొగుడు వచ్చునని సాయంత్రము దాకా నుండి నోము నోచుకొని అన్నము తింటిని. నాకీ ముసలిమగడేల దాపరించెనని విచారించు చుండెను. అంతట తల్లిదండ్రులువచ్చి "అమ్మా ! మనది రాచకులం పెండ్లియాడకుండుట తప్పు"ని అనేక విధముల చెప్పినను, వినక యొక రాత్రివేళ అడవివెంబడి పోవు చుండెను. అటు కొంతదూరముపోయి యొకకొలను దరినున్న మఱ్ఱిక్రింద నిష్ఠతో తపస్సుచేయ మొదలుపెట్టెను. ఇలా కొంతకాలము తపస్సు చేయుచుండ భూపరిపాల నకై యాపొంత నరుగుచున్న పార్వతీ పరమేశ్వరులామెను చూచి–"ఓ చిన్నదానా! ఎందుచేత నీవిలా తపస్సు చేయుచుంటివ"ని యడిగిరి. అందుకామె–"మీరేమి అర్చెడివారా తీర్చెడివారా మీకెందుకు?" అని యుత్తరమిచ్చెను. అర్చెడివారమును, తీర్చెడివారమును మేమే. చెప్పవలయున"నని మరల వారడగిరి. అంత నామెలేచి

వారికి నమస్కరించి "నేను తద్దినోము నోచుకొనుచున్నాను, నాతో నోచుకొనిన వారివలెగాక నాకు ముసలిమగడు వచ్చినాడు. నేనేమి పాపము చేసితినో"యని యామె దీనయై పలికెను. "నీవు ఉపవాసమునుండి మూడుఝాములు తిరిగిన తరువాత మొగముతిరిగిపోగా నీయన్నవచ్చి చింతచెట్టుకొమ్మకు అద్దముకట్టి క్రింద చిచ్చుపెట్టి ఆ అద్దములో కనబడుచున్న మంటను చంద్రుడని భ్రమింపచేయగా నీవునిజముగా చంద్రుడు వచ్చినాడని నోము నోచుకొని భోజనము చేసినావు. ఆ ఆ కారణముచేత నీకు ముసలిమగడు వచ్చినాడు" అనివారు చెప్పి-"ఇప్పుడైన నింటిపోయి దీపాలవేళదాకా నుండి నోము నోచుకొన్న యెడల పడుచుమగడు వచ్చున"ని చెప్పిరి. అప్పుడాపిల్ల ఇంటికివచ్చి రాత్రిదాకా నుపవాసముచేసి యధావిధిగ నోము నోచుకొనియెను. అంతనామెకు పడుచు మొగుడు వచ్చెను. అప్పుడు ఆ వూరివారందరును, "ఏమి నోము నోచితివమ్మా ! ఏమి వ్రతము పట్టినావమ్మా! నీకు పడచు మగడు దొరకుటకు?" అని యడిగిరి. అందుకామె "అట్లతద్దె దీపాల వేళదాకా నుండి నోము నోచుకున్నాను. ముసలిమగడు పడుచుమగడు అయినాడు."

**ఉద్యాపనము :-** కలియుగమం దందరును అట్లతద్దె నోముపట్టి, పదేసి అట్లు నైవేద్యముపెట్టి, పదేసి అట్లు వాయనములిచ్చి ఈవిధంగా పదేండ్లు నోచుకొని, ఈ కధచెప్పి అక్షింతలు వేసుకొని, పదేండ్లుయైన తరువాత పదిమంది ముత్తయిదువు లకు పదేసి అట్లు ఒక డబ్బు, నల్లపూసలు, లక్కజోళ్లతో వాయన మీయవలయును. కథలోపమైనా వ్రతలోపము కాకూడదు. భక్తి తప్పినా ఫలము తప్పదు.

## 5. శ్రావణ మంగళవారము కథ

ఒక బ్రాహ్మణుడు సంతానములేక చింతిల్లుచు తపస్సు చేయదొడగెను. ఆ సమయమున పార్వతీ పరమేశ్వరులు భూమిపాలింప వచ్చి యా బ్రాహ్మణునిగాంచి- "ఓ బ్రాహ్మణుడా ! ఎందువలన నీవీ తపస్సు చేయుచుంటివి?" అని యడిగిరి. అందుల కాతండు 'మీరేమి అర్చేవారా, తీర్చేవారా! మీకెందుకు? మీ త్రోవను బొండ"ని చెప్పెను అంతవారు ఆర్చేవారము మేమే. తీర్చేవారము మేమే. కారణమేమో చెప్పు' మనిరి. 'సంతానహీనుడనై యిట్లు తపస్సు చేయదొడగితిని. నాకీ కోరికదీర్చి నన్ను రక్షింపవలయునని దీనుండై యా బ్రాహ్మణుడు వారల వేడుకొనెను. వారు 'ఆయువులేని మగవాడు కావలెనా? అయిదవతనములేని ఆడుదికావలెనా? యని యడిగిరి. అప్పుడా బ్రాహ్మణుడు ఇంటికిపోయి నాభార్యనడిగి వచ్చెదన'ని చెప్పెను. వారు అట్లానే కానిమ్మనిరి. బ్రాహ్మణుడు ఇంటికిపోయి భార్యనుచూచి, ఆయువు మాలిన మగవాడు కావలయునా? అయిదవతనములేని ఆడుది కావలయునా!' యని అడిగెను. పుట్టి చచ్చినను పుత్రుడేమేలు. పుత్రనియిమ్మ"ని యా సాధ్వి యుత్తర మిచ్చెను. అంత నా బ్రాహ్మణుండతివేగమున దానుతపస్సు చేయు చోటికిబోయి 'పుట్టిచచ్చినను పుత్రుడేమేలు. కాబట్టి పుత్రునేకోరమని నాభార్య వేడుకొనెన'ని చెప్పెను.

అంతవారు–'ఊరి వెలుపల నొక మామిడి చెట్టున్నది. దానినొక పండు కోసికొనిపోయి నీభార్యకిమ్మని వారంతర్ధానము నొందిరి అప్పుడు బ్రాహ్మణుడొక ముంతమామిడి చెట్టుదగ్గరకు పోయి చాలపండ్లు కోసికొని వడిలో వేసుకొని యింటికివచ్చి చూచుకొనేసరికి నావడిలో నొక్కపండు మాత్రమేయుండెను. అతడాపండును 'తిను'మని భార్యకిచ్చెను. ఆ పండు నామె భక్షించి గర్భముదాల్చి, యంత తొమ్మిది నెలలు నిండిన వెనుక నొక కొడుకును గనియెను. ఆ శిశువు పుట్టిపుట్టక పూర్వమే యమభటులువచ్చి 'వానిని మాకిమ్మ'ని తల్లి నడిగిరి. ఆమెయు నాయనలారా! ఈ శిశువునకు పురుడుబోసి నామా!' యని దీనవదనయై పలికెను. అంత నా యమ భటులు వెళ్ళిపోయి పురుడు పుణ్యములైన తరువాత వచ్చి ఎప్పటియట్ల 'పిల్లవాని నీయమ'ని అడిగిరి. అందులకామె 'ఈ కన్నకొడుకు బారసాలను చూచినామా? ఆటపాటలు చూచినామా?' అని పలికెను. అంతట వారేగి తిరిగి బారసాల అయిన పిమ్మట వచ్చిరి. వారినిచూచి 'పుట్టు, వెంద్రుకలు చూచినామా? నడుగు చూచినామా నాయనలారా! అని బ్రతిమాలెను. వారును యప్పటియట్లు మరలిపోయిరి. అంత గొన్నాళ్ళకా పిల్లవానికి తల్లిదండ్రు ఉపనయన మహోత్సవము గావించిరి. తరువాత ఒకనాడు తల్లి కొడుకునకు తలంటుచు నేడ్చెను. ఆమె కంటినీళ్ళా పిల్లవానిపై పడుటచేత దెలిసికొని–'ఏమి? అమ్మా ఇట్లు దుఃఖించుచున్నాన'ని యడుగగా ఆమె నాయనా! నీవు పుట్టినది మొదలుకొని యమభటులు నీకొరకు వచ్చుచున్నారు' నీ వడుగయినదాకా జరుపుకొని వచ్చినాము. ఇకనెట్లు జరుపవచ్చునాయని యేడ్చుచున్నా నని యేడ్చుచున్నానని చెప్పెను. అంత నాపిల్లవాడు ధైర్యమవలంబించి అమ్మా? నాకువచ్చిన భయములేదు. మా మామను జతయిచ్చి నన్ను కాశీకి బంపుమని చెప్పెను. అందుకామె సమ్మతించి మేనమామకు కబురంపి కొడుకున కాతని జత యిచ్చి పంపుచు నేమియు బలుకలేక కన్నులనీరు బెట్టసాగెను. అమ్మా! ఎందుల కేడ్చెదవు. నేను తులసిమొక్క నొకదాని నింటవేసి వెళ్లెదను. దాని బాగోగులంబట్టి నా స్థితిగతులు నీకు తెలియుచుండును. అది చచ్చినయెడల నేను నట్లే యగుదునని తెలిసికొనుము' అని చెప్పి చాలినంత ధనము పుచ్చుకొని కాశీకి ప్రయాణమై పోవు చుండెను. వారికి త్రోవలో నొక పూలతోట గనబడగా ఆ రోజున నచ్చుట బసదిగిరి. అంత నాపట్టణపు రాకుమార్తెయును, పురోహితుని కూతురును, శెట్టికూతురును, సైనదారు కూతురును కలిసి పూవులు కోసికొనుటకు వనమునకు వచ్చిరి. వారు పువ్వులను కోసికొని తిరిగి వెళ్ళుచు మాటపట్టింపులచే పోట్లాడి–"నీవు ముండవు అంటే నీవు ముండవు" అని తిట్టుకొనిరి. ఆ తిట్లకు రాచవారిపిల్ల కోపగించుకొని "నాకీరాత్రి పెండ్లి మాఅమ్మగారు శ్రావణమంగళవారం నోము నోచుకొని నాకు వాయనమిచ్చును. నన్ను ముండా అని తిట్టకంటి' అని పువ్వులు పారపోసెను. చూచువారికి ఆశ్చర్యముగ నా పువ్వు లేకొమ్మవి ఆకొమ్మకు అంటుకొనెను. ఆ చిత్రము నాబ్రాహ్మణ కుమారుడుచూచి యాశ్చర్యపడి 'ఆహా! ఈ చిన్నది యెంతసత్యవాదియో!' అని పొగడుకొని– 'యీమె నాకు భార్యయైనయెడల

బాగుండును గదా!' యని మనస్సులో ననుకొనెను. ఆ సంగతులను ప్రక్కనున్న మేనమామ గ్రహించి, 'అబ్బాయీ! మనము కాశీకి వెళ్లుచున్నాము. మనమట్టి తలంపులను తలపెట్టరాదు' అని పలికెను. ఇంతలో ప్రొద్దు గ్రుంకు సమయముకాగా నాపిల్లలువారి వారి యిండ్లకేగిరి. రాజకుమార్తెను పెండ్లికుమార్తెనుజేసి ముహూర్తము సమీపించుచున్నందున పెండ్లికుమారుని రాకకై రాజు మొదలైనవారెదురు చూచు చుండిరి. ఇంతలో పెండ్లికుమారునకు మూర్ఛవచ్చి పడిపోయినాడు. 'ఇప్పుడు పెండ్లికి రావీలులేద'ని యొక జాబురాజుగారికి అందెను. ముహూర్తము సమీపించుటచే 'ఆహా! వేళమిగిలి పోవును ఎరువు పెండ్లికొడుకు ఎవరు దొరుకునాయ'ని యాతడు పట్టణమందరిని అడిగెను. ఎరువు పెండ్లికొడుకున కెవ్వరును వప్పుకోరైరి. నగ యెరువుండును, బట్ట యెరువుండునుగానీ పెండ్లికొడుకు ఎరువేమిటి?' అని నవ్వసాగిరి. అంత నాతండూరంతయు తిరిగి బ్రాహ్మణకుమారుడున్న తోటలోనికివచ్చి యిక్కడయెవరో మనుష్యులున్నారని వారిదగ్గరకేగి వారినిలేపెను. వారు ఉలికిపడి లేచిరి. రాజా పిల్లవాని మేనమామనుచూచి, 'అయ్యా ఈ పిల్లవానికొకసారి ఎరువిచ్చెదరా? యని యడిగెను. 'అయ్యా! ఎరువేమిటి? మేము తెల్లవారుఝామున లేచి కాశీకి పోవనున్నాము. కావున వీలులేదని చెప్పెను. రాజుగారు ముహూర్తము దాటిపోవుచున్నదని, కాదు కూడదని బలవంతముచేసి మేనమామను ఒప్పించి యాపిల్లవానిని తన యింటికి దీసికొనిపోయెను. అట్లు తీసుకొనివెళ్ళి మంగళస్నానా దుల నాచరింపజేసి యాపిల్లతో గూడపెండ్లి అరుగుపైకి దీసికొనిపోయి సంతోషముతో వివాహకార్యము జరిగించెను. తరువాత నా పిల్లవానికి బంగారుగిన్నెలో ఫలహారము లుంచగా నాతండవి తినుచుండ వ్రేలియుంగరముజారి యాగిన్నెలో పడిపోయెను. ఆ యుంగరము నాచిన్నది పదిలముగ దీసికొని తనవ్రేలిని బెట్టుకొని యా రాత్రి నిద్రించుచుండగా కలలో పార్వతీదేవి యామెకు కనిపించి 'నీపెనిమిటికి సర్పగండ మున్నది కాచుకొమ్మ'ని యానతిచ్చెను. అందులకా రాజకుమార్తె అమ్మా! ఏమిచేస్తే అదితప్పునో సెలవియ్యవలయున'ని ప్రార్థించెను. నీ తల్లి శ్రావణమంగళవారము నోముపట్టిన కుండను పాముురాగానే పట్టుము. అందులో నదిపడున'ని చెప్పెను. ఆ రాత్రి భర్త నిద్రించుచుండగా బుస్సుమని బుసకొట్టుచు పాము వచ్చుచుండెను. అది కనిపెట్టి యాచిన్నది భయపడక పైనున్న కుండకై చేయిచాచెను. అది అందక పోయెను. 'ఓహో! కార్యము తప్పవచ్చుచున్నదే!' యని చెప్పి భర్తతొడపై కెక్కి యాకుండ నందుకొని చప్పున పాముదిక్కునకు ఒగ్గెను. ఆ పామువచ్చి యాకుండలోపడగా ఆ చిన్నది యొక రవికె గుడ్డచే నా కుండకు వాసినకట్టి యొకచోట దాచిపెట్టి నిద్రపోయెను. అంత తెల్లవారుజాముకూడా పిల్లవాని మేనమామవచ్చి యాతని లేపుకొని తీసుకొని వెళ్ళెను. అంత తెల్లవారెను. మరల పెండ్లి ప్రయత్నములుచేసి పెండ్లికొడుకును దీసుకొనిరాగా- 'నాకాతడు భర్తగాడు కాశీవెళ్ళిన యాతడేకాని' యని యామె చెప్పెను. 'దానికేమి యానవాలు? అని యందరు నడిగిరి. అప్పుడా చిన్నది తండ్రినిచూచి 'తండ్రీ! నీవు యేడాది అన్నదానము చేయుము. నేను

తాంబూలదానం చేయుదున'ని చెప్పి ఆ ప్రకారం జరిగించు చుండెను. అంత యేడాది పూర్తికాగానే కాశీకిబోయిన అల్లుడు మామూలు కాశీనుండి తిరిగివచ్చుచు మునపటి పూలతోటలోనేదిగిరి. అక్కడవారు పడుకొనబోతే వారిని జూచినవారు 'అయ్యా! మీరు ఇక్కడయేల పడుకొనెదరు? ఈ పట్టణపు రాజుగా రన్నదానము చేయుచున్నారు, ఆయన కుమార్తె తాంబూలదానము చేయుచున్నది. మీరక్కడికి బోవుదని తెల్పిరి. ఆ ప్రకారము వారు వెళ్ళి భోజనమొనర్చి తాంబూలనిమిత్తమై యా చిన్నదియున్న చోటికిబోయిరి. బ్రాహ్మణకుమారుని మేనమామకును వానికిని తాంబూలమిచ్చి ఇదిగో నాపతి యని యా చిన్నది వానిచేయి పట్టుకొనెను. నీపెనిమిటి యగుటకేమి యాధారమున్నద'ని యందరు నడిగిరి. అప్పుడు భర్తవంక దిరిగి-మీరు పెండ్లినాడు భోజనమొనర్చువేళ, బంగారుగిన్నెలో మీవ్రేలి యుంగరము జారిపండింది. అది యిదిగో!' యని యాతని వ్రేలినుంచెను. అది సరిగా సరిపోయెను. తరువాత పెండ్లినాడు పార్వతీదేవి వచ్చి నీభర్తకు సర్పగండ మున్నదని చెప్పెను. దానికి 'నేనేమి చేయవలెన'ని అడిగినాను, 'మీయమ్మ శ్రావణమంగళవారము నోము నోచుకున్నది, ఆ కుండ నొగ్గవలసినదని చెప్పి యంతర్థాన మొందగా నేనాకుండను వగ్గుటకు పాము వచ్చినప్పుడు ప్రయత్నించినాను, అందినదికాదు. అప్పుడు నా పెనిమిటి తొడలపై కాలువైచి అందుకున్నాను. అదిగో చూడండి ఆ పసుపు పారాణి కాలు తొడమీదనున్నది' అని చూపించెను. పరీక్షించిచూడగా ఆ యానవాలా తొడలపై కనిపించెను. కుండు పట్టుకొనివచ్చి విప్పచూడగా బంగారు సర్పమైవుండెను. అందుల కందరును ఆమోదించిరి. అప్పుడు అబద్ధము ఇప్పుడు నిజమని ఆకాశమంత పందిరివేసి భూదేవియంత అరుగువేసి గుచ్చిన ముత్యాల తోరణాలుకట్టి గుచ్చని ముత్యాలు తలంబ్రాలుపోసి డెబ్బదియోగముల వారిరువురకు నారాజు పెండ్లిచేసెను. అటు పిమ్మట నా చిన్నది శ్రావణ మంగళవారము నోమునుపట్టి ఆ కాటుక పెట్టుకొని వానితో నత్తవారింటికి వెళ్ళెను. అట్లు వెళ్ళుసరికి అత్తగారును, మామగారును, కుమారుని వియోగ దుఃఖముచేత కండ్లు కాళ్ళులేనివారైయుండిరి. ఊరివారందరు పరుగు పరుగునవచ్చి "సోమయాజులుగారు! సోమిదేవమ్మగారూ! మీ కొడుకు కోడలు వచ్చుచున్నార'ని చెప్పిరి. 'అయ్యో! మాకెక్కడ కోడలు? మా కెక్కడ కొడుకును? నాడే పోయినారు' అని వగచు చుండిరి. అప్పుడు బాజాచప్పుడు చెవులలో ప్రవేశించి వారికి చెవులు వచ్చెను. కోడలువచ్చి అత్తమామలకు నమస్కారముచేయగా వారికి కాళ్లు వచ్చెను. కౌగలించుకొనగా నడమువచ్చినది. కాటుక పెట్టగా కన్నులు వచ్చెను. 'ఏమి నోము పట్టినావు? ఏమివ్రతము పట్టినావు? అని అందరు అడిగిరి. 'నేను శ్రావణ మంగళవారము నోము పట్టినాన'ని వారికి జవాబు చెప్పెను. ఆమె నోచిన నోము కలియుగములో నందరు నోచి యామెవలెనే సౌభాగ్యవంతులై భూలోకమున ప్రసిద్ధిగాంచిరి. కథ లోపమైనా వ్రతలోపము కారాదు. భక్తి తప్పినా ఫలము తప్పదు.

**ఉద్యాపనము :–** తొలియేట ఐదుగురు ముత్తయిదువులకు మలియేట పది మంది ముత్తయిదువులకు, మూడవయేట పదిహేను మంది ముత్తయిదువులకు, నాలుగవయేట యిరువదిమంది ముత్తయిదువులకు, అయిదవయేట ఇరువది అయిదు ముత్తయిదువులకు వాయనములు ఇచ్చుకొని అయిదువేళ్లు అయిన తరువాత పెండ్లినాడు పెండ్లికూతురునకు మట్టెలు, మంగళసూత్రములు క్రొత్తకుండలో ముప్పది మూడు జోడుల అరిసెలుపెట్టి క్రొత్తరవికలగుడ్డచే వాసెనగట్టి పెండ్లికూతురు నకు అందియ్యవలయును.

## 6. వరలక్ష్మి వ్రతకథ

సకల మహర్షులుగాంచి సూతుండిట్లనియె మునీశ్వరులారా ! స్త్రీలకు సకల సౌభాగ్యముల నొసంగునట్టి వ్రతరాజమును పార్వతీ దేవికి పరమేశ్వరుడు చెప్పి యున్నాడు. దానిని చెప్పెద వినుండు. కైలాసమున మణిగణ ఖచితమగు సింహాసన మున గూర్చుండియున్న పరమేశ్వరునిగాంచి పార్వతీదేవి నమస్కరించి 'దేవా! లోక ములో స్త్రీలు ఏ వ్రతమాచరించిన సకల సౌభాగ్యములును, పుత్రపౌత్రాదులం గలిగి సుఖంబుగ నుందురో, యా వ్రతంబు చెప్పవలెననిన పరమేశ్వరుండు సంతసంబున నిట్లనియె ఓ మనోహరిణీ! స్త్రీలకు అట్టి సౌభాగ్యాది సంపత్తి గలుగుజేసెడు వ్రతము వరలక్ష్మి వ్రతం బనునది కలదు. ఆ వ్రతమును శ్రావణమాస శుక్లపక్ష పూర్ణిమకు ముందువచ్చు శుక్రవారమునాడు జేయవలయు ననిన పార్వతీదేవి యిట్లనియె ఓ లోకవంద్యా! నీవానతిచ్చిన వరలక్ష్మి వ్రతంబు నెట్లు చేయవలయును? ఆ వ్రతంబు నకు విధియేమి? ఏ దేవతను పూజింపవలయును? పూర్వమెవరిచే యావ్రత మాచరింపబడియె? వివరంబుగ తెలుపవలయు'ననిన పార్వతికి పరమేశ్వరుడు చెప్పుచున్నాడు. 'ఓ గౌరీ! వరలక్ష్మి వ్రతము సవిస్తరముగ చెప్పెద వినుము. మగధ దేశంబున కుండినంబను నొక పట్టణంబు గలదు. ఆ పట్టణము బంగారు గోడల చేతను, బంగారు యిండ్లతోడను ప్రకాశించుచుండెను. అట్టి పట్టణమున చారుమతి యను నొక బ్రాహ్మణసాధ్వి కలదు. ఆ మానినీ మణి భర్తను దేవునితో సమానునిగా దలంచి ప్రతిదినము నుదయమున మేలుకొని స్నానముచేసి పూవులచే భర్తపాదంబులు పూజించుచు పిదప నత్తమామలకు వివిధోపచారంబులొనర్చి యింటి పనులు చక్కజేసుకొని గయ్యాళికాక మితముగాను ప్రియముగాను భాషింపు చుండెను. ఇట్లుండ ఆ పతివ్రతయందు మహాలక్ష్మికి అనుగ్రహము కలిగియొకనాడు స్వప్నమున కనపడి ఓ చారుమతీ! నేను వరలక్ష్మి దేవిని, నీయందు నాకు దయవచ్చి ప్రత్యక్షమైతిని, శ్రావణశుక్లపూర్ణిమకు ముందుగావచ్చెడు శుక్రవారంనాడు నన్ను పూజించిన నీ కోరికలు నెరవేర్చుదన'ని యానతిచ్చిన, చారుమతి స్వప్నములోనే వరలక్ష్మి దేవికి ప్రదక్షిణ నమస్కారముచేసి–

శ్లో॥ నమస్తే సర్వలోకానాం జననై పుణ్యమూర్తియే
శరణ్యే త్రిజగద్వంద్యే విష్ణువక్షస్థలాస్తయే

అని యనేక విధంబులుగ స్తుతించి 'ఓ తల్లీ! నీ కటాక్షంబు కలిగెనేని మనుజులు ధన్యులుగను, విద్వాంసులుగను, సకల సంపన్నులుగను నయ్యెదరు. నేను పూర్వజన్మమున చేసిన సుకృత విశేషమున నీపాద దర్శనము నాకు లభించెను' అనిస్తుతించిన మహాలక్ష్మి సంతోషము జెంది చారుమతి కనేక వరంబులొసంగి యంతర్ధానమొందెను. చారుమతి వెంటనే నిదుర మేల్కొని గృహము నాలుగు తట్టులను కలయంజూచి వరలక్ష్మి దేవిని గానక "ఓహో! నేను కలగంటిననీ యా స్వప్న వృత్తాంతమును భర్త మొదలగు వారితో జెప్పవారు, ' ఈ స్వప్నము మిగుల నుత్తమమైనది. శ్రావణమాసంబు వచ్చినతోడనే వరలక్ష్మి వ్రతమును తప్పక జేయవలెన'ని చెప్పిరి. తరువాత చారుమతియు స్వప్నంబువిన్న స్త్రీలును 'శ్రావణమాస మెప్పుడు వచ్చునని యెదురు చూచుచుండిరి. ఇట్లుండ వారి భాగ్యమున శ్రావణ పూర్ణిమకు ముందుగా వచ్చెడి శుక్రవారము వచ్చెను. అంత చారుమతి మొదలగు స్త్రీలందరును "ఈ దినమేగదా వరలక్ష్మి దేవి చెప్పిన దినంబ"ని స్నానాదుల నాచరించి చీని చీనాంబరములు అలంకరించి చారుమతి గృహమున నొకచోట గోమయంబుచే నలికి మంటప మేర్పరచి యందాసనమువైచి దానిపై క్రొత్తబియ్యముపోసి మఱ్ఱి చిగుళ్ళు మొదలగు పంచపల్లవములచే కలశంబు నేర్పరచి, యందు వరలక్ష్మీదేవి ఆవానముచేసి వారందరును మిగుల భక్తియుక్తులై సాయంకాలమున

శ్లో॥ పద్మాసనే పద్మకరే సర్వలోకైక పూజితే
నారాయణ ప్రియేదేవీ సుప్రీతాభవ సర్వదా

అను శ్లోకముచే ధ్యానావాహనాది షోడశోపచార పూజలుచేసి తొమ్మిది సూత్రంబులుగల తోరణంబును దక్షిణహస్తంబునకు గట్టుకొని వరలక్ష్మీదేవికి భక్ష్య భోజ్యంబులచే నైవేద్యమొనర్చి ప్రదక్షిణంబు చేసిరి. యిట్లు ప్రదక్షిణము చేయగనే యా స్త్రీల గాళ్ళయందు ఘల్లుఘల్లుమను నొక శబ్దము కలిగెను. అంత కాళ్ళను జూచుకొనిన గజ్జెలు మొదలగు నాభరణంబులు కనపడెను. వారందరు- 'ఓహో! వరలక్ష్మీదేవి దయవలన కలిగినవని పరమానందంబు నొంది మరి ఒక ప్రదక్షిణము చేయగా హస్తంబుల దగద్ధగాయ మ్రానంబుగా వెలుగుచు రత్నమణి కంకణములు మొదలగు నాభరణంబులు కనపడెను. ఇంతయేల! మూడవ ప్రదక్షిణంబు గావించిన తోడనే యా స్త్రీలందరు సర్వభూషణాలంకృతులైరి. వారి గృహంబులు సువర్ణమయం బులై రథ గజ తురగాది వాహనంబులతో నిండి యుండెను. అంత నా స్త్రీలందోడ్కొని పోవుటకు వారివారి ఇండ్ల నుండి గుఱ్ఱములు, ఏనుగులు, రథములు నా వరలక్ష్మి పూజచేయు స్థలమునకు వచ్చి నిలిచియుండెను. తరువాత చారుమతి మొదలగు స్త్రీలు తమకు కల్పోక్త ప్రకారంబుగ పూజచేయించిన బ్రాహ్మణుని పూజించి పండ్రెండు కుడుములు వాయనదానమిచ్చి దక్షిణ తాంబూలము లొసంగి నమస్కరించి యా

బ్రాహ్మణునిచే నాశీర్వాదము నొంది వరలక్ష్మీ దేవికి నైవేద్యము గావించిన భక్ష్యాదులను బందుమిత్ర బృందముల భుజించి తమతమ వాహనములనెక్కి తమ తమ గృహము లకు జనుచు, నొకరితో నొకరు ఓహో! చారుమతీదేవి భాగ్యమేమని చెప్ప నొప్పును వరలక్ష్మీదేవి తనంతట తానే స్వప్నములో దర్శనమిచ్చెను. ఆ చారుమతీదేవి వలననే కదా మనకిట్టి భాగ్యము గలిగె! అవి చారుమతీదేవి మిక్కిలి కొనియాడిరి. తరువాత చారుమతీదేవి మొదలగు కాంతలెల్లరును నీ వ్రతంబును ప్రతిసంవత్సర మును జేయుచు, పుత్రపౌత్రాభివృద్ధిగలిగి ధన కనక వస్తు వాహన సమృద్ధింగాంచి సుఖంబుగ నుండిరి. కావున ఓ పార్వతీ! ఈ యుత్తమ వ్రతమును బ్రాహ్మణులు మొదలగు నాలుగు జాతులువారును జేయవచ్చును. అట్లు చేసిన సర్వసౌభాగ్యంబు గలిగి సుఖింతురు. ఈ కథ వినువారలకును చదువువారలకును వరలక్ష్మీ ప్రసాదమువలన సకలకార్యసిద్ధి కలుగునని పార్వతీదేవితో పరమేశ్వరుడు వరలక్ష్మీ వ్రతము జెప్పెను.

## 7. చిట్టిబొట్టు కథ

చిట్టిబొట్టు పెట్టవలె - సిరిగండలయింట పుట్టవలె
యేడుగురన్నలతోడ బుట్టవలె - ఏకచక్రముగా నేలవలె
పదుగురన్నలతోడ బుట్టవలె - పట్టభద్రుని చేపట్టవలె

మాఘపూర్ణిమయందు రథసప్తమినాడు ఈకథచెప్పి అక్షతలు వేసికొని, ఏడాదిదాకా అయిదుగురు ముత్తయిదువులకు ప్రతిదినమున బొట్టుపెట్టుకొనుచు, ఏడాది నిండిన తరువాత ఉద్యాపనము చేసికొనవలయును.

**ఉద్యాపనము :-** అయిదుగురు ముత్తయిదువులకు తలంటి నీళ్ళుపోసి పిండివంటలతో భోజనముపెట్టి బంగారపు బొట్టుచేయించి ఐదుగురు ముత్తయిదువు లకు అయిదుచుట్లు, అయిదు రవికలగుడ్డలు, దక్షిణతాంబూలములిచ్చి నల్లపూసలు, లక్కజోళ్లు యివ్వవలెను. కథలోపమైనా వ్రతలోపము కారాదు, భక్తితప్పినా ఫలము తప్పగు.

## 8. పసుపు గౌరీ కథ

నూరు పసుపునోచిన చానకు నూరువేలేండ్లు అయిదవతనము, కొట్టపసుపు నోచిన చానకు కోటివేలేండ్లు అయిదవతనము. ఈకథచెప్పి అక్షింతలు వేసుకొని యేడాది అయిన తరువాత మానెడు సోలెడు పసుపు వెదురుపెట్టెలోపోసి రవికెలగుడ్డ, దక్షిణతాంబూలము, నల్లపూసలు, లక్కజోడు తోడ ముత్తయిదువునకు వాయనము యివ్వవలెను. పసుపు నరగదీసి గిన్నెలోపెట్టి రవికెలగుడ్డ, దక్షిణతాంబూలము, నల్లపూసలు, లక్కజోడు పెట్టి ముత్తయిదువుకు నివ్వవలెను. కథలోపమైన వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినా ఫలము తప్పదు.

## 9. మొగదోసిళ్ళనోము కథ

ఒక బ్రాహ్మణుని కూతురు మొగదోసిళ్ళ నోముపట్టి యది యుల్లంఘనచేసి చనిపోయెను. ఆమె మరుజన్మమున మరియొక బ్రాహ్మణుని యింట పుట్టెను. అల్పకాలములోనే తల్లి చనిపోవుటచేత నామెకు సవతితల్లి వచ్చెను. ఆమె దరిద్రబాధ కలిగినదై యది సహింపజాలక యొకనాడు దేవాలయములోనికి వెళ్ళి ధ్వజస్థంభము వద్ద కూర్చుండి యెండనక వాననక విచారించుచు పరమేశ్వరుని ప్రార్థించుచుండెను. కొంతకాలమునకు ఆమెయందు దయగలవాడై ఈశ్వరుడు ప్రత్యక్షమై 'ఏమి యో చిన్నదానా! యిట్లు విచారించుచున్నావ'ని యడిగెను. బ్రాహ్మణరూపముచే ప్రత్యక్షమైన యా ఈశ్వరుని నామె సామాన్య మనుజునిగనెంచి 'నాయనా! మీకెందుకు వెళ్లుండని' ప్రత్యుత్తరమిచ్చెను. అది విని భగవంతుడు 'ఓ కాంతా! నీవు తలంచు కార్యము నేను దీర్చువాడను చెప్పుమ'ని యడిగెను. అంత నామె-'నేనొక బ్రాహ్మణుని కుమార్తెను నాకు సవతితల్లి యున్నది. దరిద్రముచేత సవతితల్లిచేత బాధపడలేక యిట్లు విచారించుచున్నన'ని చెప్పెను. అంత నీశ్వరుండు-'ఓ యింతీ! నీవు పూర్వజన్మమున మొగదోసిళ్ళనోముపట్టి యుల్లంఘన జేసినావు కాబట్టి నీకీ దరిద్రబాధ, సవతితల్లిపోరు సంప్రాప్తమైనవి. నీవిప్పుడా నోముపట్టి ప్రతిదినము నొడలికి నీళ్లుపోసుకొని, పసుపు కలిపి యొక పళ్లెములో రోజూమూడు దోసిళ్ళనీళ్ళు లెక్కచూచి పోసికొని, అది అయిన తరువాత మూడు దోసిళ్లు ముత్యములు, మూడుదోసిళ్లు పగడములు, శివుని యాలయములోనికి పట్టుకొనివెళ్ళి శివుని రుద్రపాదములమీద పూజచేసి యథాశక్తి దక్షిణ తాంబూలాదుల నియ్యవలెను'అని చెప్పి యీశ్వరుండంతర్ధానము నొందెను. ఆ బ్రాహ్మణ చిన్నదియు భగవంతుడు చెప్పినరీతి నాచరించి సకలైశ్వర్య సంపన్నురాలై సుఖంబుగ నుండెను. కథలోపమైనా వ్రతలోపము కాకూడదు. భక్తి తప్పినా ఫలము తప్పదు.

## 10. చిత్రగుప్తుని నోము కథ

ఒకరాజుభార్య, ఒక మంత్రిభార్య, బ్రాహ్మణముత్తయిదువులను పెట్టుకొని నోములు వ్రతములు చేయుచుండెడివారు. ఆ వ్రతములలో మరువకుండ మంత్రిభార్య చిత్రగుప్తునినోము నోచెను. రాజుభార్య ఆ వ్రతమును పట్టుట మానివేసెను. కొన్నాళ్ళకు మంత్రిభార్య చచ్చిపోయెను. చిత్రగుప్తుడు ఆమె పాపములు విడిచిపెట్టి 'ఆమె యంతయు పుణ్యమే చేసినద'ని చెప్పి యామెకు పుణ్యలోకప్రాప్తి కలిగించును. పిమ్మట రాజుభార్య చచ్చిపోయి చిత్రగుప్తునియొద్దకు వెళ్లగా ఈమె అంతయు పాపమే చేసినదని చెప్పెను. అందుకామె దుఃఖించుచు నేనును, మంత్రిభార్యయు సమముగా వ్రతములు నోచుకున్నాము. ఆమెకు పుణ్యమువచ్చి నాకు పాపము యెందుకు వచ్చిన ద'ని మీ చిత్రగుప్తునడిగెను. అప్పుడు మంత్రిభార్యవచ్చి నీవు చిత్రగుప్తుని నోము

పట్టలేదు. అందుచేత నీకు నరకము వచ్చినద'ని జెప్పెను. అందుకు రాజుభార్య- 'నేనిప్పుడేమి చేసిన నాకీ నరకబాధ తప్పునో చెప్పవలెన'ని అడిగెను. నీవు చిత్రగుప్తుని నోముపట్టి ఏడాది అక్షింతలు వేసుకొని ఎద్దుత్రొక్కనివడ్లు అయిదు కుంచములు కట్టులేని గంపలోబోసి, అయిదు మూళ్ళపట్టుపంచె, అడ్డెడుతవ్వెడు బియ్యము, ఒక గుమ్మడిపండు యధాశక్తి దక్షిణతాంబూలములు పెట్టి, వెండిఆకుపైడిగంటము నుంచి తోడబుట్టినవానికైనను, గ్రామకరణమున కైనను అందివ్వవలసినద'ని చెప్పెను. కథలోపమైనా వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినా ఫలము తప్పదు.

## 11. విష్ణుక్రాంత కథ

ఒక బ్రాహ్మణుని భార్య తన తోడబుట్టినవారికి పెండ్లి తలపెట్టినప్పుడెల్ల భర్తకు వ్యాధి సంభవించుచుండెను. ఈ యాటంకముచేత అనేక పర్యాయములు సిద్ధమైన పెండ్లికార్యము మానివేయుచువచ్చిరి. కొన్నాళ్ళకు బంధువులందరు ప్రాణము విసిగినవారై ఎన్నాళ్లిలాగున పెండ్లికార్యము మానుదుమ"ని పెండ్లి ముహూర్తము నిశ్చయించిరి. అంత నా బ్రాహ్మణునికి ప్రాణముమీదికి వచ్చెను. అతని భార్య ఆ జబ్బు సరకు సేయక వానిని యింటిలో నుంచి తలుపుగొళ్లెము పెట్టి తోడబుట్టినవాని వివాహమునకు వెళ్లిపోయెను. ఆమె చెరుపుగట్టు వద్దకు వెళ్లుసరికి యచ్చట విష్ణుక్రాంత పువ్వులు విడిచియుండెను. ఆ పువ్వుల నామె కాలదన్నుకొని చక్కాపోవు చుండెను. అంత విష్ణుక్రాంత-"నోచినదివిను కాంత నోచినది నోచినపువ్వులు కాలదన్నుకొని పోవుచున్నది. చెరువులోనున్న చామంతులారా! చూచితిరా?" అని యొక ధ్వని వినపడెను. "ప్రేమగల ప్రాణేశ్వరునకు ప్రాణము మీదకురాగా చాపనిచుట్టి నట్టింటపెట్టి దయగల తమ్ముని పెళ్ళికి వెళ్లుచున్నది. ఊరకొందు విష్ణుక్రాంతా!" అని మరల ప్రత్యుత్తర మిచ్చెను. ఈ మాటలా బ్రాహ్మణుని భార్యవిని యేమి మాట్లాడ కుండ వెళ్లిపోయెను. ఆమె తమ్ముని పెండ్లి అయిన తరువాత తిరిగి యా మార్గమున వచ్చుచుండెను. వెళ్లబోయే సమయమున తానా పువ్వులనెచ్చట చూచెనో యాచోటికి బోయి-"విను విష్ణుక్రాంతా! మీరందరు ఏమి చెప్పుకున్నార"ని యడిగెను. "విన్నప్పుడు మానినావు గనకనా? యిప్పుడు నీకెందుకు వెళ్లుమ"ని విష్ణుక్రాంత చెప్పగా నా బ్రాహ్మణభార్య "ఆ మాటలు చెప్పినగాని వల్లగాదు నేను వెళ్లన"ని చెప్పెను. ఓ బ్రాహ్మణ కాంతా! ప్రేమగల ప్రాణేశ్వరునకు ప్రాణముమీదికిరాగా నట్టింట దయగల తమ్మునిపెండ్లికి వెళ్లవద్దన్నాన"ని చెప్పెను. "నీవెందుచేత నీలాగు చెప్పినావ"ని యడుగగా నా బ్రాహ్మణ స్త్రీకి విష్ణుక్రాంత యిట్లని చెప్పెను- "నీవు ముందు జన్మమున విష్ణుక్రాంత నోముపట్టి ఉల్లంఘనము చేసినావు. అందుచేత నీ తమ్మునికి పెండ్లి తలపెట్టినప్పుడు నీ పెనిమిటికి ప్రాణముమీదకి వచ్చుచుండెను. ఇప్పుడు నీవా నోముపట్టి ఉద్యాపనచేసుకొని అక్షింతలు వేసుకొన్నయెడల నీకు సిరిసంపద, అయిదవ తనము వృద్ధియగున"ని చెప్పెను.

**ఉద్యాపనము :-** ఏడాది అయిన తరువాత పదమూడు జోడుల నేతిగారెలు వాయనము, పదమూడు జోడుల నైవేద్యము పెట్టి విష్ణుక్రాంత పువ్వులతో పూజలు చేసుకొని దక్షిణ తాంబూలము ముత్తయిదువుకు యియ్యవలయును. కథ లోపమైనా వ్రతలోపము కాకూడదు భక్తితప్పినా ఫలము తప్పదు.

## 12. కంద గౌరీ కథ

ఒక బ్రాహ్మణునకొక కుమార్తెగలదు. ఆ చిన్నది అస్తమానూ ఏడ్చుచుండెడిది. ఎన్ని నోములు నోపించినను ఏడ్పుట మానలేదు. తండ్రి కూతురుని అడవిలోకి తీసుకొనివెళ్లి విచారించుచు కూర్చొనియుండగా పార్వతీ పరమేశ్వరులు భూమి పాలించడమునకు వచ్చి–“ ఏమి బ్రాహ్మణుడా! ఇక్కడ కూర్చుండి విచారించుచున్నా వ”ని యడిగిరి. మీకెందుకు? ఆర్చెడివారా! తీర్చెడివారా! వెళ్ళండి” అని యా బ్రాహ్మ ణుడు చెప్పగా–ఆర్చెడివారము, మేమే, తీర్చెడివారము మేమే చెప్పవలసినద”ని తరిగి యా బ్రాహ్మణుని పార్వతీ పరమేశ్వరులడిగిరి. అప్పుడు బ్రాహ్మణుడు ఈ పిల్ల ఊరకే యేడ్చు చుండును. అందుచేత భరింపజాలనివాడనై యిక్కడికి తీసుకొని వచ్చి ఏమియుతోచక విచారించుచున్నాన”ని చెప్పగా పార్వతీ పరమేశ్వరులు– ఈ చిన్నది క్రిందటి జన్మమున కందగౌరీ నోముపట్టి ఉల్లంఘన చేసినది. అందుచేతనే యేడ్పు సంభవించినది. ఇప్పుడైనా ఏడాది కథ చెప్పి అక్షింతలు వేసికొని వీసె యేబులం కందదుంప, వెండిదుంప, బంగాళదుంప వేయించి ముత్తయిదువునకు రవికెలగుడ్డ, దక్షిణతాంబూలము, నల్లపూసలు, లక్కజోడుపెట్టి వాయనమిచ్చిన యెడల నీయేడ్పు కుదురునని చెప్పి వారంతర్ధానము నొందిరి. అప్పుడు బ్రాహ్మణుడు కూతు రును తీసుకొని యింటికివెళ్ళి పార్వతీ పరమేశ్వరులు చెప్పిన ప్రకారము యధావిధిగ కందగౌరీ నోముపట్టించి ఉద్యాపనము చేయించెను. నాటినుండి యా బ్రాహ్మణుని కుమార్తె యేడ్పుట మాని సకల సంపదలతో భూలోకమున సమస్త సౌఖ్యముల ననుభవించెను. కథలోపమైనను వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినను ఫలము తప్పదు.

## 13. ఉప్పు గౌరీ కథ

దాకనిండా ఉప్పుపోసిన దేకినదాక అయిదవతనము క్రొత్త కుండలో మానెడు సోలడు ఉప్పుపోసి రవికెలగుడ్డ వాసినకట్టి దక్షిన తాంబూలములతో ముత్తయిదువకిచ్చి ఉద్యాపనము చేసుకొనవలెను.

## 14. గణేశుని నోము కథ

ఒక బ్రాహ్మణుని భార్య గణేశుని నోముపట్టి ఉల్లంఘనచేసెను. గణేశుడామెకు నోముపట్టుట చేత సిరిసంపదలిచ్చి, ఉల్లంఘనముచేయుట వల్ల మితిలేని శోకము

పెట్టెను. అందుచేత ప్రతిరోజూ కొడుకులకు కూతుండ్రకు వండిపెట్టిన తరువాత ఆమె యొకచోట కూర్చుండి ఏడ్చుచుండెను. ఊరివారందరు కూతలువేయగా వినక అడవిలోకిపోయి అక్కడ ఏడుపు మొదలుపెట్టెను. అట్లు ఏడ్చుచుండగా నొకనాడు పార్వతీపరమేశ్వర్లు భూమిపాలించుటకై వచ్చుచు ఆమెను జూచి "ఏమమ్మా! ఈలాగున నేడ్చుచున్నావ"ని యడిగిరి. అందుకామె- మీరేమి ఆర్చేవారా! తీర్చేవారా! మీ దారిని మీరు వెళ్ళండని చెప్పగా అలాకాదు, ఆర్చేవారము మేమే, తీర్చేవారము మేమే, చెప్పవలసినదని మరల నడిగిరి. మీదయవలన నాకు అన్ని సిరిసంపదలున్నవి, ఏమి కారణముచేతనో ఈలాగు యేడవవలెనని బుద్ధిపుట్టుచుండునని ఆమె చెప్పెను. అప్పుడు పార్వతీ పరమేశ్వరులిట్లనిరి- "ఓ కాంతా! నీవు పారెడు పామును పట్టుకొని పోయి పట్టిమంచము మీద వేయుము. అది నీకొడుకును కరచును. అప్పుడు అయ్యో! నా కొడుకులు పాము కరచినదని యేడ్వమనిరి. ఆమె ఆలాగే యని పామును పట్టుకొని వెళ్ళి పెద్దకొడుకు మంచముమీద పడవేసెను. పెద్దకొడుకు ఇంటికివచ్చి మంచము వైపునకు చూడగా అందు బంగారు గోవతాడు కనబడెను. అతడు తల్లిని పిలిచి అదేమని అడుగగా అయ్యో దానివల్ల యేడ్చుటకు వీలుకలిగినది కాదని యా రాత్రి మరల యేడ్చుచు కూర్చుండెను. ఆ సమయమున తిరిగిపార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమై యింకను యెందుకు యేడ్చుచున్నావని యడిగిరి. మీరు చెప్పినట్లు చేసినాను ఆ పాము నాకొడుకును కరువలేదు. అందుచేత మళ్లీయేడ్చుచున్నానని యామెచెప్పగా, పార్వతీ పరమేశ్వరులు తేలును పట్టుకు వెళ్లి నీకూతురు మెట్టుపెట్టుకునే కుంకుమభరిణిలో వేయుము. అది కుట్టుచు అప్పుడు యేడ్చెదవుగానని చెప్పిరి. అప్పుడామె తేలును పట్టుకొని వెళ్ళి కుంకుభరిణెలో వేయగా మరునాటి యుదయమున నా బరిణెను తీసి బొట్టుపెట్టుకొనుటకు అందులో చేయిబెట్టగా అందులో నాచేర్చుక్క బొట్టు కనబడెను. ఆమెతల్లిని బిలిచి 'ఇందులో నా చేర్చుక్క బొట్టుపడివేసినా వేమ'ని యడిగెను. అయ్యో! యిది కుట్టినది కాదని యా రాత్రి యడవికిబోయి మరల నేడ్చుచున్న యామెకు పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమై యేమి యింకను యేడ్చెదమని యడిగిరి. 'అయ్యో! తేలు నాకూతురును కుట్టలేదు. అందుచేత వచ్చి యేడ్చుచున్నాన'ని చెప్పెను. అప్పుడు పార్వతీ పరమేశ్వరులు-'అమ్మా నీవు పెంచిన పిల్లియున్నది దానిని చంపి వడిలో నుంచుకొని యేడ్చుచుండగా నూరివారందరు వచ్చి-యిదేమమ్మా! అని యడిగిరి. అయ్యో! నా పెంపుడు పిల్లి చచ్చిపోయినదని మరింత యేడవగా ఆమె కంటినీళ్ళుపడి బంగారు పిల్లి అయి వడిలోనుండి క్రిందికి దుమికి పోయెను. అప్పుడు పార్వతి పరమేశ్వరులు వచ్చి ఓ కాంతా! నీవు గణేశుని నోముపట్టి ఉల్లంఘనము చేయుటచేత విచారించు చున్నావు. కాబట్టి ఈ నోముపట్టి యేడాది అక్షింతలు వేసికొని ఉద్యాపనచేసిన యెడల నీయేడ్పు పోవునని చెప్పిరి. ఆ బ్రాహ్మణ స్త్రీ ఆ ప్రకారము నోచుకొని దుఃఖమువిడిచి భూలోకమున చిరకాలము సిరిసంపదలతో సుఖపడెను.

**ఉద్యాపనము :-** సోలెడు గిద్దడు నూనెక్రొత్త మూకుటిలోపోసి వత్తివేసి దీపము పెట్టి స్వయంపాకము, ఒక అణా డబ్బులు దక్షిణతో శివుని ఆలయమున పూజచేసికొని నందిదగ్గర ఆ దీపము పెట్టవలయును. కథలోపమైనా వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినా ఫలము తప్పదు.

## 15. గొడిసె నోము కథ

గొడిసెనోము బట్టిన గొంతీ పట్టణములో వెదకిచూచిన విధవలేదు.

**ఉద్యాపనము :-** యేడాది కథచెప్పి అక్షింతలు వేసికొని ఏడాది చింతపండు తినకుండ నియమము జరిపి సంవత్సరము పూర్తియైన పిమ్మట పదముగ్గురు ముత్తయిదువులకు పదమూడు రవికెలగుడ్డలు దక్షిణ తాంబూలము, పదమూడు మానికెల బియ్యము పులిహోరచేసి పదమూడు మూకుళ్లలోపెట్టి వాయనము లియ్యవలయును. కథలోపమయినను వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినా ఫలము తప్పదు.

## 16. వావిలి లక్ష్మీవారము కథ

ఒక బ్రాహ్మణునకు నలుగురు కుమారులు, నలుగురు కుమార్తెలును కలరు. అతడు కుమార్తెలను పెండ్లి పేరంటములు గావించి యత్తవారింటికి పంపివేసెను. కడసారపు కూతురు మిక్కిలి దరిద్రము కలవారి కొడలౌటచేత తన్ను అన్నలు ఒక్కసారియైన పుట్టినింటికి తీసుకొని వెళ్లకపోవుటచేతను మిక్కిలి దుఃఖించుచుండెను. ఇట్లుండగా నామె పుట్టింట కడసారి తమ్మునకు పెండ్లి తలపెట్టిరి. ఆ వివాహమునకు యీ కడసారపు చిన్నదానినితప్ప తక్కినవారిని తీసికొనివచ్చినాడు. పెండ్లిచేసికొనిరి. ఆ పెండ్లిలో తమ్ముడు పిలువకపోయినను, యా చిన్నదాని కొడుకులు తాతగారింటికి వచ్చి- "తాతా! పందిరివేయమా? చాపలు పరచమా?" అని యడుగగా నతడు తిట్టుచు మీరేమి చేయవద్దు పొమ్మని కసరి కొట్టెను. ఆ బ్రాహ్మణుని పెద్దకోడలు మాత్రము కడసారపు ఆడుబిడ్డ రాకుండుటకు విచారించుచు, ఆమె దరిద్రదేవతను తిట్టుచు, వంటబ్రాహ్మణులు బియ్యము కడుగుచుండగా నేను చాలకాలం క్రిందట వావిలిగౌరీదేవి నోముపట్టినాను, ఉద్యాపన మట్లేయన్నది, అని చెప్పి కడిగిన బియ్యములోనుండి అద్దెడు తవ్వెడు తీసి యొకచేటలోపోసి కడగని బియ్యము యొక అద్దెడు తవ్వెడు గూడపోసి పైనొక పాతచేట మూతబెట్టి వావిలికొమ్మనుబెట్టి యందు రవికెలగుడ్డ దక్షిణ తాంబూలము నుంచి యాచిన్న యాడబిడ్డ యిల్లు తమ యింటి ప్రక్కనే యుండుటచేత వాటిని గోడమీదనుండి ఆమెకు అందించెను. అవి పుచ్చుకొని

యామె యింటిలో పెట్టుసరికి సిరిసంపదవచ్చెను. అటు తర్వాత ఆ చిన్నదానిని పుట్టింట అన్నగారి కుమార్తెకు వివాహముకాగా ఆమెను-'పెండ్లికి రావలసినని వచ్చి పిలిచిరి. ఆమె 'మేము బెండ్లినా దుదయముననే వచ్చెదమని చెప్పెను. ఆ యుదయ మున సవారీమీద ఆమెను తమ యింటికి తీసికొనివచ్చి పీటమీద కూర్చుండబెట్టి పంచభక్ష్య పరమాన్నములును ఆమెకు వడ్డించిరి. అప్పుడామె తన యెదలి వస్తువులను తీసి పీటమీదనుంచి పుస్తెలారా! ఆరగింపుడు, పుస్తెలారా! ఆరగింపుడు, అని చెప్పి పల్లకీ యెక్కి తన యింటికి వెళ్లిపోయెను. అప్పుడూరివారందరు ఏమమ్మా! తిరిగి యింటికి వెళ్లుచున్నావని యడుగగా నా పుట్టింటివారు నన్నుచూచి పిలిచినారా లేదు. నా పాలటి మహాలక్ష్మినిచూచి పిలిచినారు అని చెప్పెను వారందరు- నీకింత భాగ్య మేలాగున వచ్చినదని యడుగగా-నేనేమి నోమును పట్టలేదు. నా పెద్ద వదిన గారు వావిలిగౌరి నోముపట్టి మొన్ననే యుద్యాపనము చేసిగొని యా వాయనము నాకిచ్చినది. నాకావాయన మందుకున్న ఫలమేగాని మరేమియులేదు అని ఆమె చెప్పెను.

**ఉద్యాపనము :-** కథచెప్పి యేడాది అక్షంతలు వేసికొని యేడాది అయిన తరువాత కొత్తచేటలో కడిగిన బియ్యము అడ్డెడు తవ్వెడు కడగని బియ్యము అడ్డెడు తవ్వెడు పోసి వావిలికొమ్మపెట్టి పాతచేట మూతవేసి రవికెలగుడ్డ దక్షిణతాంబూల ముతో గోడమీద నుంచి ముత్తయిదువకు వాయనము అందియ్యవలెను. కథ లోపమయినను వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినను ఫలము తప్పదు.

## 17. మారేడు దళము కథ

ఒక రాజునకు ఒక కుమారుడు గలడు. ఆ కుమారుడు చనిపోగా నాతని తోడునకు పిల్ల నెవ్వరైన నిచ్చెదరా! యిన పట్టణమంతయు నడుగుచు దిరిగిరి. ఎవ్వరును పిల్ల నియ్యరైరి. ఆ పట్టణమున నొక బ్రాహ్మణున కొక కూతురుగలదు. ఆ చిన్నదానికి తల్లిపోవుటచే సపతి తల్లి తటస్థించెను. ఆమె ధనాశచేత ఆ పిల్లనిచ్చి పిల్లయెత్తు ధనంపుచ్చుకొనెను. రాజభటులా చిన్నదాన్ని తీసికొనిపోయి చచ్చిపోయిన రాజశవముతో తీసికొనిపోవుచుండగా నంతట వానవచ్చెను. ఆ వర్షములో నా కాటుకను తీసికొని వెళ్ళలేక సమీపముననున్న యొక పాడు దేవాలయములో దింపి తమ దారిని వారు పోయిరి. అంత సూర్యుడస్తమించి యెల్లెడల చీకటి గ్రమ్మెను. అంతట నా చిన్నది కట్టువిప్పికొని దేవాలయమునకు ప్రదక్షిణ చేయుచు, శివశివ! చిటికిన వ్రేలైన పట్టనీయవైతివి హరహర! అక్షింతలు గింజలైనా వేయ నీయవైతివి. మహాదేవ! మంగళసూత్రమైనా కటనీయవైతివి అనియనుచు మూడు సార్లు ప్రదక్షిణము చేసెను. పార్వతీదేవి ప్రత్యక్షమై నీవెవ్వరవని యడిగెను. 'నేను బ్రాహ్మణకూతురను, నన్నీ చనిపోయినవానితో కట్టిపడవేయగా నా యదృష్టముచేత నీ యాలయమునకు వచ్చినాను, ఇప్పుడు నాయవస్థనుగురించి చెప్పుకొనుచు ప్రదక్షణము చేయుచున్నాన"ని యా బ్రాహ్మణయువతిచెప్పె. అప్పుడు పార్వతీదేవి

"నీవు క్రిందటి జన్మంబున మారేడుదళము నోముపట్టి యుల్లంఘనము చేయుటచేత నీకీ గతివచ్చినద"ని చెప్పి అక్షింతలు నీళ్ళు యిచ్చి "మూడు ప్రదక్షిణములు చేసి యవి యాపిల్లవానిమీద జల్లుమని"ని చెప్పెను. ఆ చిన్నది ఆ ప్రకారము జేయగా రాజకుమారుడు నిద్రపోయి లేచినవానివలె లేచి కూర్చుండెను. తరువాత అన్ని సంగతులు బ్రాహ్మణకుమార్తెవలనవిని కాలక్షేపమునకై యామెను పుస్తకము చదవమని తానర్థము చెప్పసాగెను. అంతట తెల్లవారెను. తిరుగయిప్పటియట్టి రాత్రిగుడివద్ద వీరిని విడిచిపెట్టిన వాండ్రందరు వచ్చి "ఇదేమి చిత్రమ"ని ఆశ్చర్యముతో నడుగగా- "పార్వతీదేవియొక్క వరప్రభావమ"ని యాచిన్నది వారితో చెప్పెను. అందుకు వారందరును సంతోషించి ఇంటికి తీసుకొని వెళ్లి వారిరువురకును మహావైభవముతో వివాహము జరిపించిరి. అప్పుడా బ్రాహ్మణచిన్నది మారేడుదళము నోముపట్టి వెండిదళము, బంగారు దళము చేయించి, చెట్టుదళమొకటితెచ్చి ఆ మూడు దళములు మూడుదోసిళ్ల బియ్యము శివునకు పూజచేసి, చిరకాలము సౌభాగ్య సంపదలతో సుఖమనుభవించుచుండెను. దీనికిదియే యుద్యాపనము కథలోపమైన వ్రతలోపము కాకూడదు భక్తితప్పినను ఫలము తప్పదు.

## 18. సంపద శుక్రవారము నోము కథ

ఒక బ్రాహ్మణునకు ఏడుగురు కుమారుళ్లుకలరు. వాండ్రందరును దరిద్రము చేత బాధపడుచుండిరి. ఒకనాడు ఉదయమున శుక్రవార మహాలక్ష్మి వచ్చి ముందుగా వారి పెరి పెద్దకోడలి యింటికి వెళ్లెను. ఆమె ప్రొద్దున్నే లేచి పిల్లలకు అన్నంపెట్టి తానుకూడా దినుచుండెను. అది సంపద శుక్రవార మహాలక్ష్మి చూచి "ఛీ! వీరింటికేల వచ్చినాన"ని గిరుక్కున తిరిగివెళ్లి రెండవకోడలింటికి వెళ్లగా ఆమె చూడగా పేడచేసుకొనుచుండెను. "ఛీ! ఛీ! దీనింటి కేల వచ్చినాన"ని తిరిగి వెళ్ళి మహాలక్ష్మి మూడవ కోడలి యింటికివెళ్ళ ఆమె పాత గుడ్డలు కుట్టుచు కూర్చుండెను "ఛీ! దీనియింటికేల వచ్చితిన"నని మహాలక్ష్మీ నాలుగవ కోడలి యింటికి వెళ్లగా ఆమె పాచివాకిట గుంటలో వడ్లుపోసుకొని దంపుచుండెను. అదిచూచి మహాలక్ష్మీ" ఛీ! దీనింటికేల వచ్చినాన"ని అయిదవ కోడలి యింటికివెళ్ళగా ఆమె ప్రొద్దున్నే తల దువ్వుకొనుచు కూర్చుండెను. ఆ మహాలక్ష్మి 'ఛీ! దీనింటి కేలవచ్చినాని ఆరవకోడలి యింటికి వెళ్లగా ఆమె పాచివాకిటిలో నలుగురి పిల్లలకు తలంటి తాను తలంటుకొను చుండెను. అది చూచి మహాలక్ష్మీ-'ఛీ! దీనింటి కేలవచ్చినాన'ని ఏడవకోడలి ఇంటికి వెళ్లగా ఆమె నల్లగా అలుగుకొని తెల్లగా ముగ్గుపెట్టుకొని పసుపురాసి బొట్టుపెట్టుకొని కట్టుకున్నబట్ట మగనికియిచ్చి తలుపువెనుక కూర్చుండెను. ఆ మహాలక్ష్మి యిక్కడ యింత చల్లగా నున్నది అని ఆ యింటివద్ద పడుకొనెను. లోపలినుండి ఎవరమ్మా! ఇలారండని ఏడవ కోడలిని పిలువగా 'అమ్మా! నా మగడు యాయవారమునకు వెళ్లినాడు. మాకు కట్టుకొనుటకు ఒకటే బట్ట అందుచేత నాబట్ట ఆయనకిచ్చి నేను

తలుపు వెనుక కూర్చున్నాన'ని చెప్పగా మహాలక్ష్మి అయితే యేమి ఇలారావమ్మా! కట్టుకొనుటకు బట్టనేను యిచ్చెదనని చెప్పెను. అట్లు చెప్పి తన కట్టుబట్టలో సగము చింపి యామెకిచ్చి అమ్మా నాకు సోలడు బియ్యముపెట్టి అన్నము వండిపెట్టు మని చెప్పెను. అందుకా బ్రాహ్మణస్త్రీ 'అయ్యో! ఇంటిలో బియ్యములేవునాపై మిట్టిలావలెననని చెప్పగా 'అలాకాదమ్మా! నీవు కోమటి యింటికివెళ్లి మా యింటికి శుక్రవార మహాలక్ష్మి వచ్చినదని చెప్పుము వారిచ్చెదరని చెప్పెను. ఆ ప్రకారము ఆమె కోమటి యింటికివెళ్ళి అడుగగా వారు పప్పు, ఉప్పు, బెల్లము, బియ్యము, మొదలైనవి యియ్యగా అవిపుచ్చుకొని తెలుకల యింటికివెళ్ళి అదేప్రకారముగా జెప్పగా అతడు నూనె తెలకపిండి యిచ్చెను. అవి ఆమె పుచ్చుకొని కంచరవానింటికి వెళ్లి ' మాయింటికి శుక్రవారపు మహాలక్ష్మి వచ్చినదని చెప్పమన్నదని చెప్పగా గిన్నెలు, బిందెలు మొదలైనవి వాడికిచ్చెను. తరువాత ఆమె సాలివానియింటికి వెళ్ళి అదేప్రకారంగా చెప్పగా వాడు బట్టలనిచ్చెను. ఆమె అవన్నియు పట్టుకొని యింటికివచ్చి ఆవకాయ, పిండివంటలు, నాలుగు కూరలు వండి మహాలక్ష్మికి భోజనముపెట్టెను. ఆ రోజు భర్త కందరును ముష్టిపెట్టిరి. అప్పుడా బ్రాహ్మణుడు ఎడమూట పెడమూట వేసుకొని మోయలేకుండగా నింటికివచ్చెను. ఇంటికి రాగానే భార్య వానికి భోజనము పెట్టెను. భోజనముచేసి బ్రాహ్మణుడు అవి యన్నియు నెలాగున వచ్చినవని భార్యనడిగెను. ఆమె మనపాలిటి శుక్రవార మహాలక్ష్మి వచ్చినది అని అందరిని అడిగిపట్టుకొని వచ్చినానని చెప్పెను. అప్పుడు శుక్రవారపు మహాలక్ష్మి వెళ్ళినదని చెప్పగా అప్పుడే కాదు రాత్రిదాకాయుండి భోజనముచేసి పోదువుగాని అని చెప్పి రాత్రి భోజనముపెట్టిన తరువాత తిరుగవెళ్ళెదనని చెప్పెను. అందుకు బ్రాహ్మణ భార్య ఇప్పుడు చీకటిపడినది రేపటిరోజున వెళ్ళవచ్చునని చెప్పెను. ఆ రాత్రి యందరును సుఖముగా నిద్రించుచుండిరి. కొంతరాత్రివేళ మహాలక్ష్మి లేచి అమ్మా! కడుపునొప్పిగా నున్నది అని చెప్పగా చీకటిగానున్నది, వీధిలోకి వెళ్లవద్దు ఆమూల కూర్చుండుమని బ్రాహ్మణుని భార్య చెప్పెను. అట్లు నాలుగు జాములు నాలుగుసార్లు లేచి మహాలక్ష్మి నాలుగు మూలల కూర్చుని మాయమైపోయెను. తెల్లవారగనే బ్రాహ్మణుడును భార్యయును లేచిరి, బ్రాహ్మణునిభార్య చీపురు చేత పుచ్చుకొని యిల్లు బాగుచేయుటకు తుడువబోగా నట్టింట అన్నిచోట్ల బంగారుకుప్ప లుండెను. అందు కామె ఆశ్చర్యపడి మహాసంతోషముతో నా సంగతి భర్తతో చెప్పి పాలచేత కడిగి, బంగారు కాసులు పళ్లెములో పెట్టుకొని నా పాలిట శుక్రవారపు మహాలక్ష్మి వచ్చినది కనుక యీ భాగ్యము కలిగెనని శుక్రవారపు నోము పట్టుటకు మనస్సులో సంకల్పించుకొనెను. ఆలాగునుకొని నట్టింట నాలుగు మూలలు అలికి ముగ్గుపెట్టి తలదువ్వి బొట్టు పెట్టుకొని పసుపు రాసుకొని పయిమీదనే నీళ్ళుపోసుకొని మహాలక్ష్మిని పెట్టి నోము నోచుకొని కథను చెప్పి అక్షింతలు వేసికొనెను.

**ఉద్యాపనము :-** అయిదేండ్లు ప్రతిశుక్రవారము ఒంటిపూట భోజనముచేసి అయిదుగురు ముత్తయిదువులకు తలంటి నీళ్ళు పోసి అయిదు రవికెలగుడ్డలిచ్చి పిండివంటలతో భోజనముపెట్టి దక్షిణ తాంబూలము నియ్యవలయును. కథలోపమైనా వ్రతలోపము కాకూడదు. భక్తి తప్పినను ఫలము తప్పదు.

## 19. మార్గశిర లక్ష్మీవారము కథ

ఒక బ్రాహ్మణునకొక కూతురుగలదు. ఆమె సవతితల్లి పిల్లను ఎత్తుకొమ్మని చెప్పి కొంచము బెల్లంముక్క పెట్టుచు వచ్చెను. ఆ చిన్నది సవతిపిల్లను దీసికొని వెళ్ళి మట్టితో బొమ్మను చేసుకొని ఈ బొమ్మకు రవంత బెల్లంముక్క నైవేద్యము పెట్టి ఆడుకొనుచుండెను. అట్లుండగా కొన్నాళ్ళకాపిల్లకు బెండ్లిజేసిరి. ఆమె అత్తవారింటికేగు నపుడు తాను చిన్నప్పటినుండి దాచుకొనిన బొమ్మలను సవారీలో బెట్టుకొని వెళ్ళెను. ఆమెకూడా మహాలక్ష్మి పోయెను. అంతటనాపిల్ల పుట్టింటి వారికి దరిద్రము వచ్చెను. ఆమె అత్తవారింటివద్ద సిరిసంపదలతో తులదూగుచు 'పుట్టింటి వారికి దరిద్రము వచ్చెన'ని తెలుసుకొని తోడబుట్టినవానికి కబురంపి ఒక కర్ర దొలిపించి ఆ కర్ర నిండా వరహాలుపోసి తమ్మునకిచ్చెను. అదిపట్టుకొని తమ్ముడు వెళ్ళుచు త్రోవలో కడుపునొప్పివచ్చి ఆ కర్ర చెట్టునకు జారవైచి కొంచెమావలికి వెళ్లెను. అంతట నాత్రోవ వెంబడి కొందరు వెళ్లుచు ఆ కర్రపట్టుకొని చక్కాబోయిరి. అప్పుడా బ్రాహ్మణ చిన్నవాడాకర్ర వెదకి యెందుగానక యింటికి వెళ్ళిపోయెను. తరువాత కొన్నాళ్ళకు తమ్మునివర్తమానము తెలియక మరల నా చిన్నది కబురంపగా నా తమ్ముడు వచ్చెను. అతనిని గాంచి 'నాయనా స్థితి యెలాగున్నద'ని యడుగగా- 'మునుపటి వలెనే యున్నద'ని యాతడు చెప్పెను. అప్పుడామె యొక చెప్పుల జోడు కుట్టించి దాని నిండా వరహాలుపోసి అందులో గడ్డిపెట్టి ఈజోడు పట్టుకువెళ్ళి నాన్నకీయమని తమ్మునకిచ్చెను. అతడా చెప్పుల జోడు పుచ్చుకొని యొక చెరువు గట్టుదగ్గరకు వెళ్లుసరికి వానికి దాహమై యాజోడు నక్కడపెట్టి చెరువులోనికి వెళ్లెను. అప్పుడొక కుక్కవచ్చి అజోడెత్తుకొనిపోయెను. దాహము పుచ్చుకొని పైకివచ్చి మాతడు గట్టునపెట్టిన జోడునుగానక యింటికి వెళ్లెను. కొన్నాళ్ళకు తిరుగ వానిని అక్కగారు కబురంపగా నాతడు యూరికేగెను. యేమి నాయనా! ఏలాగున్నది మీ స్థితియని వానినడిగెను. ఎప్పటిలాగేయున్నదని యాతడు చెప్పెను. అప్పుడామె యొక గుమ్మడి కాయ దొలిపించి దానినిండా వరహాలుపోసి యది పట్టుకొని వెళ్లుమని యాతని కిచ్చెను. ఆ కాయ నతడు పట్టుకొనివచ్చి చెరువుగట్టుమీదబెట్టి కాళ్ళు కడుగుకొను చుండగా నాదారిని పోవుచున్న కోమటియొకడా కాయను పట్టుకొనిపోయెను. ఒడ్డునకువచ్చి కాయను కానక బ్రాహ్మణ బాలుడు తన యింటికిపోయెను. కోమటి తన యింటివద్దకు వెళ్ళి యాకాయను కొట్టగా యందువరహాలు నిండియుండెను. అప్పుడా బ్రాహ్మణచిన్నది తన పుట్టింటివారి సంగతి యెట్టున్నరో తెలిసికుందామని

యచ్చటికి వచ్చెను, వారు మిక్కిలి దరిద్రులై యుండిరి. అప్పుడామె తల్లిని తీసుకొని వెళ్ళి మార్గశిర లక్ష్మివారము నోము నోపించిన నింత యన్నము కలుగునని తలంచినదై యట్లు తల్లిని తీసుకొనివెళ్ళెను. ఇంటికి వెళ్ళిన తరువాత 'అమ్మా! ఈ రోజున మార్గశిర లక్ష్మీవారము కాబట్టి నోట్లోయేమీ వేసుకొనవద్దని చెప్పెను. ఆమె సరే యని చెప్పి పిల్లలకు చద్దియన్నము పెట్టుచు నొక ముద్ద నోటిలో వేసికొనెను. అప్పుడు బ్రాహ్మణచిన్నది తల్లితో అమ్మా! స్నానము చేయుము నోము నోచుకొందమని చెప్పగా తల్లి అయ్యో! పిల్లలకు అన్నము పెట్టుచు మరచిపోయి యొక ముద్ద నోట వేసికొన్నాన'ని చెప్పెను. అప్పుడు చిన్నది ఇక నేవిధముగ చేతను వీండ్రకు భాగ్యము అంటదనుకొ"ని తాను మాత్రము నోచుకొన్నదట అంతట రెండవవారము తల్లినిబిలిచి అమ్మా! ఈవేళ లక్ష్మివారము, నోట యేమీ వేసికొనకని చెప్పెను. అందుకామె అలాగేనని పిల్లలకు తలంటుచు ఆగిన్నెలో నూనె మిగులగా తలకు రాసుకొన్నదట. అంత కూతురు వచ్చి అమ్మా! స్నానము చేయుమని చెప్పగా అయ్యో అమ్మా! పిల్లలకు రాయగా మిగిలిన నూనెయుండ నాతలకు రాసుకొన్నానని చెప్పెను. పోనీలే యిన చెప్పి తాను మాత్రము నోచుకొనెను. అంత మూడవవారము రాగా తల్లిని బిలిచి అమ్మా! ఈవేళ లక్ష్మివారము నోటిలో నేమియు వేసికొనవద్దని చెప్పగా నామె 'యలాగే' యని పిల్లలకు తలదువ్వుచు తనతల దువ్వుకొని కొప్పు పెట్టుకొనెను. ఆవారము కూడా తాను మాత్రమే నోచుకొని యాచిన్నది నాల్గవ వారము రాగా గోయితీసి యందులో తల్లిని కూర్చుండబెట్టి బల్లమూత వేయించెను. పిల్లలందరు అరటిపండ్లు తిని యాతొక్కలు తీసుకొనిపోయి అమ్మా ! యిదిగోనని బల్లసందులోనుండి పడ వేయగా నామె వానిని తిని వేసెను. అంత కూతురువచ్చి స్నానము చేయుమని చెప్పగా 'అయ్యో! అమ్మాయీ అరటిపండు తొక్కలు తిన్నానని చెప్పెను. అయిదవ వారము చెంగు చెంగు ముడివేసుకొని తానెక్కడికిబోయిన నక్కడికితీసికొనిపోవుచు, రెండుజాములైన తరువాత స్నానము చేయించి నోము నోపించెను. అప్పుడు పూర్ణపు కుడుములువండి నైవేద్యము పెట్టుకొనిరి. కూతురు నైవేద్యము పెట్టుచుండగా ఊరుకొని తల్లినైవేద్యము పెట్టుటకు వచ్చేసరికి మహాలక్ష్మీ వెళ్ళి యెడగలిగి నిలుచుండెను. అప్పుడు కూతురుచూచి 'అదేమని' యదుగగా నీ చిన్నతనములో ఆడుకొనెడి సమయమున నీవు బొమ్మలను పెట్టుకొని ఆడుకొనుచుండగా యమ్మ చీపురు పుచ్చుకొని కొట్టినది. అందుచేత నేను వెళ్ళిపోయినానని మహాలక్ష్మీ చెప్పెను. 'అయ్యో! నేరము వచ్చినది' అని ఈవలకివచ్చి అమ్మా! క్షమియించి నైవేద్యం పుచ్చుకొని వాండ్రకు భాగ్యమువచ్చేలాగు చేయవలసినదని కూతురు వేడుకొనగా నీతల్లి చేత నోము పట్టించమని చెప్పి మహాలక్ష్మీ యదృశ్యమయ్యెను. అప్పుడా చిన్నది తల్లిని మార్గశిర లక్ష్మీవారము నోమునోపించి పట్టిన వారము పులగము, రెండవవారము పరమాన్నము, మూడవవారము ముద్దకుడుములు, నాలుగవ వారము చిత్రాలు, కలమాన్నము వండి పుష్యమాసపువారము పూర్ణిమ కుడుములువండి తల్లిచేత నోమునోపించెను.

**ఉద్యాపనము :-** నాలుగు వారములు నోము నోచుకొనికథ చెప్పి అక్షింతలు వేసుకొని ముత్తయిదువులను పెట్టుకొని నేతి పిండివంట వండుకొని నోము నోచు కొనవలయును. కథలోపమైనా వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినను ఫలము తప్పదు.

## 20. శోకములేని సోమవారము కథ

ఒక బ్రాహ్మణునకు నలుగురు కొడుకులు, నొక కుమార్తెయు కలరు. అతడా కుమార్తెకు వివాహము చేయగా ఆమె మగడు దేశాంతరము వెళ్ళెను. అందుకా చిన్నది మిక్కిలి దుఃఖించుచుండెను. అట్లేడువగా ఏడువగా ఆయుసురుతగిలి ఆ బ్రాహ్మణునకు దరిద్రము వచ్చెను. అప్పుడా బ్రాహ్మణుడొక చెరువు తవ్వించినాడు. కాని అందులో గంగపడలేదు. అందుకా బ్రాహ్మణుడు మిక్కిలి విచారించుచు భార్యతో గూడి తపస్సు చేయగా పార్వతీపరమేశ్వరులు ప్రత్యక్షమై ఎందుకు తపస్సు చేయు చున్నారని యడిగిరి. అప్పుడా బ్రాహ్మణుడు నాకొక్క కుమార్తెయున్నది. అది అస్తమానము యేడ్చుచుండును. దాని యుసురుతగిలి మాకు దరిద్రము సంప్రాప్తమైనది. అందుచే చెర్వుత్రవ్వించినాము. అందులో నీళ్ళుపడినవికావు అందుచేత తపస్సు చేయు చున్నామని జెప్పెను. అప్పుడు పార్వతీ పరమేశ్వరులు మీ పెద్దకొడుకును తీసుకొనివచ్చి ఈ తూమున కడ్డముగా వేసినట్లయితే యిందులో నీళ్ళు పడునని జెప్పిరి. బ్రాహ్మణుడు అందుకు వప్పుకొని పెద్దకొడుకును తీసుకొనివచ్చి తూమున కడ్డము వేయగా వెంటనే గంగపడెను. తరువాత పార్వతీ పరమేశ్వరులు నీకూతురు క్రిందటి జన్మమున శోకములేని సోమవారము నోముపట్టి ఉల్లంఘనము చేసినది. ఆకారణముచేత నీయేడుపు వచ్చినది. ఇప్పుడు తిరుగ నోము పట్టించి కథ చెప్పి అక్షితలు వేసి ఏడాది సోమవారము ఒంటిపూట భోజనము పెట్టి ఏడాది అయిన తరువాత ఉద్యాపన చేయించవలసినదని చెప్పి అదృశ్యమైనది. ఆ బ్రాహ్మణుడు కూతురు నా ప్రకారము నోపించి ఉద్యాపన చేయించగా ఆమె మానెను. సంపద గలిగెను.

**ఉద్యాపనము :-** మానెడు సోలడు బియ్యము పులగము వండి అడుగు అట్టు పై అట్టు తీసి రవికెలగుడ్డ వాసెనకట్టి దక్షిణ తాంబూలము బెట్టి ముత్తయిదువకు వాయన మియ్యవలయును. కథలోపమైనను వ్రతలోపము కాకూడదు. భక్తి తప్పినను ఫలము తప్పదు.

## 21. పూర్ణాదివారము నోము కథ

ఒక రాజుకూతురు చిన్ననాటినుండి కడుపు శోకము కలిగినదై అయిదుగురు బిడ్డలను పోగొట్టుకొనెను. తరువాత ఆ దుఃఖము తాను భరించలేక అడవిలోకిపోయి పార్వతీ పరమేశ్వరులను ప్రార్థించు చుండగా పార్వతీ పరమేశ్వరులామెకు ప్రత్యక్షమై

యేమి యిట్లు విచారించుచు కూర్చున్నావని యామెనడిగిరి. అంత నామె 'నాయనా! పుట్టిచావగానున్న బిడ్డలతో పడలే ఈలాగున వచ్చినానని చెప్పగా పార్వతీ పరమే శ్వరులు - 'నీవు క్రిందటి జన్మమున పూర్ణాదివారము నోముపట్టి ఉల్లంఘనము చేసినావు. ఆ కారణమున నీ దుఃఖము సంప్రాప్తమైనది. ఇప్పుడు తిరిగి నీవా నోముపట్టి కథ చెప్పుకొని అక్షంతలు వేసుకొని యుద్యాపనము చేసుకొన్న యెడల నీకీ దుఃఖము బోవునని చెప్పి అంతర్ధానము నొందిరి. ఆ రాజకుమార్తెయు పార్వతీ పరమేశ్వరులు చెప్పిన ప్రకారము నోముపట్టి ఉద్యాపనము చేసుకొని అంతటి నుండి కడుపుశోకము లేనిదయ్యెను.

**ఉద్యాపనము :-** కథ జెప్పి అక్షంతలు వేసికొని ప్రతి ఆదివారము ఒంటిపూట భోజనముచేసి ఒక ముత్తయిదువునకు తలంటి నీళ్ళుపోసి దక్షిణ తాంబూలము యిచ్చి అయిదు మానికల బియ్యము పూర్ణపు ఉండ్రములువండి వాయన మియ్యవలెను. కథలోపమైనను వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినను ఫలము తప్పదు.

## 22. గ్రామ కుంకుమ నోము కథ

ఒక బ్రాహ్మణుని భార్య గ్రామకుంకుమ నోముపట్టి వీసెఏబులం పసుపు వీసెయేబులం కుంకుమ, పండ్లు పట్టుకొని వెళ్ళిగ్రామములో పంచిపెట్టు చుండెను. ఒక వీధిలో పంచిపెట్టేసరికి ఒక కొడుకువచ్చి అమ్మా? నాన్నగారికి జబ్బుగానున్నది రమ్మని చెప్పి పిలిచెను. అందుకామె నాయనా! ఒక్కవీధి అయినదని చెప్పి రెండవ వీధికి పోయెను. అంత రెండవ కుమారుడువచ్చి అమ్మా! నాన్నగారికి చాల జబ్బుగానున్నది రమ్మని జెప్పెను. అప్పుడామె మూడవవీధికి వెడలి పంచిపెట్టసాగెను. అంతట మూడవకుమారుడు వచ్చి అమ్మా ! నాన్నగారిని క్రింద బడవేయుచున్నారు. రమ్మనగా-'ఇక రెండు వీధులున్నవి వచ్చెదనని' చెప్పి ఆమె నాలుగవ వీధికి వెళ్ళెను. నాల్గవ కుమారుడువచ్చి అమ్మా నాన్నగారికి ప్రాణము పోయినదని చెప్పగా- యిక నొక్క వీధి యున్నదని చెప్పి యామె అయిదవ వీధికి వెళ్లి పంచిపెట్టుకొని, యింటికి వచ్చేసరికి భర్త దిగ్గునలేచి కూర్చుండెను. అప్పుడు ఊరందరు ఆశ్చర్యముతో అమ్మా! ఏమినోము పట్టినావు? ఏమి వ్రతము చేసినావని అడిగిరి. గ్రామకుంకుమ నోము పట్టి అది అయిదు వీధులను పంచిబెట్టుకొని వచ్చేసరికి వారు లేచి కూర్చున్నారని చెప్పినది.

**ఉద్యాపనము :-** వీసెయేబులం కుంకుమ, వీసేయేబులం పసుపు పండ్లు ఊరిలో పంచిపెట్టుకోవలెను. కథలోపమైనను వ్రతలోపము కాకూడదు. భక్తి తప్పినను ఫలము తప్పదు.

## 23. వెలగ గౌరీ కథ

వెలగ వెలగ అనరాదు - వేలుపెట్టి చూపరాదు
వెలగ చెట్టుయొక్క నీడకు వెళ్ళరాదు - వెలగపండు తినరాదు.

**ఉద్యాపనము :-** పదమూడు జోడాల ముచ్చికలతోనున్న వెలగకాయలు తెచ్చి దక్షిణ తాంబూలము, నల్లపూసలు, లక్కజోడు పెట్టి పదముగ్గురు ముత్తయిదువులకు యియ్యవలెను. కథలోపమైనను వ్రతలోపముకాకూడదు. భక్తి తప్పినను ఫలము తప్పదు.

## 24. ఆపదలేని ఆదివారము కథ

ఒక బ్రాహ్మణున కొక కుమారుడు కలడు. ఆ చిన్నవాని కాతడు వివాహముచేసి కోడలిని తన యింటికి తీసికొనివచ్చెను. ఆమె ఆపద అనినదేమో తెలియక ప్రతిదినము మామగారింటికి రాగానే-మామా! ఆపదంటే యేమిటి? యని యడుగుచుండేది. ప్రతిదినమిట్లు అడుగుచుండగా విసుగువచ్చి ఆ బ్రాహ్మణుడు దర్భాసనపు త్రాడు పుచ్చుకొని పెద్దమమని కొట్టెను. ఆ పిల్లవాడాదెబ్బకు మూర్ఛపడిపోయెను. ఆ యాపద చూడలేక యాచిన్నవాని తల్లి అడవిలోకి వెళ్ళి విచారించుచుండగా పార్వతీ పరమేశ్వరులు భూమి పాలించుటకు వచ్చి ఆమెను చూచి యేమి ఇట్లున్నావని యడిగిరి. ఆమె నా జోలి మీకెందుకు వెళ్ళమనగా పార్వతీ పరమేశ్వరులు అలాగు కాదు చెప్పవలసినదని యడిగిరి. నాకు ఆపదమనసు అయి ప్రతిదినము మా మామగారిని ఆపదయంటే యేమిటి? యని అడుగగా ఆయనకు కోపమువచ్చి దర్భాసన త్రాటితో నాపెద్దకొడుకును కొట్టినారు. అతడు మూర్ఛపడినారు. ఆయాపద భరింపజాలక యీలాగువచ్చినానని బ్రాహ్మణ స్త్రీ చెప్ప పార్వతీ పరమేశ్వరులు-నీవు క్రిందటి జన్మమున ఆపదలేని ఆదివారము నోముపట్టి ఉట్లంఘున చేసినావు. అందుచేత నీకు ఆపద మనస్సైనది. ఇప్పుడు నోముపట్టి క్రమముగా ఉద్యాపన చేసికొన్న యెడల నీకీ యాపద పోవునని చెప్ప పార్వతీ పరమేశ్వరులు అంతర్ధానము నొందిరి. ఆ బ్రాహ్మణ స్త్రీ యింటికివెళ్ళి యానోముపట్టి క్రమముగా నుద్యాపన చేసికొని ఏవిధమైన ఆపదలులేక సుఖముగా నుండెను.

**ఉద్యాపనము :-** అయిదు మానికెల పాలలో మానెడు సోలడు బియ్యముపోసి పరమాన్నమువండి అడుగు అట్టు పై అట్టు తీసుకొని సూర్యునకు నైవేద్యము పెట్టి ఆ మధ్య పరమాన్నము అయిదుమూళ్ళ పంచి అయిదు డబ్బులు దక్షిణ తాంబూలములతో బ్రాహ్మణులకు వాయన మియ్యవలయును. కథలోపమైనను వ్రతలోపము కాకూడదు. భక్తి తప్పినను ఫలము తప్పదు.

## 25. ముప్పదిమూడు పున్నముల నోము కథ

ఒక బ్రాహ్మణుడు తనకుమార్తెకు వివాహము చేయగా అల్లుడు మూడవనాడు చనిపోయెను. అప్పుడాపిల్ల ఆడుకొనుటకు వెళ్ళి వచ్చుచుండెను. ఒక రాజు భార్య ముప్పదిమూడు పున్నముల నోముపట్టి ముత్తైయిదువ నిమిత్తము వీధిగుమ్మము వద్ద నిలుచుండి ఈ బ్రాహ్మణుని కూతురు ఆదారిని వచ్చుచుండగా చూచి నీవెవరి అమ్మాయవు? అని అడిగెను. ఆ చిన్నది నేను బ్రాహ్మణపిల్లను అని చెప్ప నేను ముప్పదిమూడు పున్నములనోము బట్టినాను వాయన మిచ్చెదను వచ్చెదవా? యని యడిగెను. ఆ చిన్నది ఆలాగే పట్టుకొని వెళ్లెదనియ్యమని యడిగెను. ముప్పదిమూడు ఆకులు, ముప్పది మూడు చెక్కలు, ముప్పది మూడు డబ్బులు, ముప్పదిమూడు నల్లపూసల కోళ్ళు, ముప్పదిమూడు లక్కజోళ్ళు, ముప్పదిమూడు అటు, ముప్పది మూడు కట్లజల్లిడ, ముప్పది మూడుజ్యోతులు, చీర రవికెలగుడ్డ క్రొత్త జల్లిడిలో పెట్టి పాతజల్లిడబోర్లించి రాజుభార్య చిన్నదానికి వాయనమిచ్చెను. ఆ చిన్నది ఆ వాయనమందుకుని జ్యోతులు వెలుగుచుండగా యింటికి బట్టుకొని వెళ్ళెను. ఆ జ్యోతులు వెలుగుచూచి ఆ పిల్ల భర్తలేచి కూర్చుండెను. అప్పుడు అందరు ఏమి నోము పట్టినావని యడిగిరి. ఏమినోము బట్టలేదు రాజుగారిభార్య ముప్పదిమూడు పున్నముల నోము నోచుకొని వాయనమిచ్చిన పట్టుకు వచ్చినానని ఆ చిన్నది చెప్పెను. అప్పుడా చిన్నవాని నిమిత్తము వచ్చిన యమభటులు యమధర్మరాజు వద్దకుపోయి మహారాజా! మీరు తీసుకొనిరమ్మని పంపిన బ్రాహ్మణ చిన్నవాని నిమిత్తము మేము వెళ్ళి తీసుకొని రాబోవు చుండగా అతనిభార్య ఎక్కడనుంచో నోము నోచుకొని వాయనము తెచ్చుకున్నందున వాని ప్రాణములు మాచేత నిలువక తిరిగిబొందిలో ప్రవేశించినవి. మేమాతనిని రమ్మని బలవంతపెట్టినా వచ్చినాడుకాడని మనవి చేసుకొనిరి. అప్పుడు యముడుగ్రుడై ఆ చిన్నవాని ప్రాణములు తీయుటకై వచ్చెను. వచ్చి యా బ్రాహ్మణ చిన్నవాని ప్రాణములు తీసికొని చక్కాబోవుచుండెను. అంత నా చిన్నది వాని వెంబడించెను. కొంతదూరము వెళ్ళి ఏమి అమ్మాయి! వచ్చుచున్నావని యము దడుగగా నాపెనిమిటి ప్రాణముల నిమిత్తము వచ్చుచున్నానని యామె చెప్పెను. అంత నాతడు నీపెనిమిటి ప్రాణముకాక మరియెుకటేదియైనా కోరుమని అనెను. నేను ముప్పదిమూడు అట్లు వాయనము తెచ్చుకొన్నాను. ఆ అట్లకు ఎన్ని బొళ్ళలుండునో అన్నివేల యేండ్లు అయిదవతనమియ్యమని యామె కోరెను. యముడు అలాగే యిచ్చినానని వెళ్ళుచుండెను. ఆ బ్రాహ్మణ చిన్నదియు వాని వెనుకనే వెళ్ళుచుండెను. తిరుగ కొంతదూరమెళ్ళి తిరుగచూచి అమ్మాయి! ఇంకను ఏల వచ్చుచున్నావని యముడడుగగా యామె నాభర్త నిమిత్తము వచ్చుచున్నానని చెప్పెను. అతని ప్రాణములు తప్ప మరేమియైన అడుగమని చెప్పగా- నాకు యేమి అక్కరలేదు. ముప్పదిమూడు నల్లపూసలకోళ్ళు తెచ్చుకున్నాను. ఆ కోళ్లపూసల కెన్ని బెజ్జములున్నవో అన్నివేల యేండ్లు నా కయోదోతనము నీయవలయునని యాచిన్నది యడిగెను. అప్పుడామె భక్తికి సంతసించి యట్లే యిచ్చినాను, పుచ్చుకొమ్మని యతని ప్రాణములు విడిచి చక్కాబోయెను. ఆ చిన్నది యింటికి వచ్చేసరికి పెనిమిటిలేచి కూర్చుండెను. అందరు 'ఇదియేమి మహాత్మ్యమమ్మా! యని యడిగిరి. ఏమీలేదు. నేను ముప్పదిమూడు పున్నముల నోము వాయనము తెచ్చుకున్నాను ఆ ఫలమే యిది. వాయనము తెచ్చుకున్న ఫలమని చెప్పెను. వాయనమునకు యింత ఫలమున్నది నోము

నోచుకొన్న నెంతఫలమో' యని అందరు ముప్పది మూడు పున్నములు ఉపవాసముండి క్రమముగా నుద్యాపనము చేసికొనిరి.

**ఉద్యాపనము :-** ముప్పదిమూడు అట్లు ముప్పదిమూడు ఆకులు, ముప్పది మూడు పోకలు, ముప్పదిమూడు డబ్బులు, ముప్పదిమూడు నల్లపూసలకోళ్ళు, ముప్పదిమూడు లక్కజోళ్ళు, ముప్పదిమూడు జ్యోతులు, చీర రవికెలగుడ్డ, ముప్పది మూడు కన్నుల కొత్తజల్లెడలో పెట్టి పాతజల్లెడ మూతవేసి ముత్తయిదువునకు వాయన మియ్యవలెను. కథలోపమైనను వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినను ఫలం తప్పదు.

## 26. కుందేటి అమావాస్య నోము కథ

ఒక కుందేలు చాకలి బానలో పిల్లలను పెట్టి మేతకొరకు ఎక్కడికోపోయినది. చాకలిదివచ్చి పొయ్యిమీద నా చాకలిబాననుంచి మంట పెట్టుచున్నది. అంతట మేతకొరకు పోయిన కుందేలు తన పిల్లలయొద్దకు వచ్చిచూచేసరికి పొయ్యిమీద నా చాకలిబానలో పిల్లలు ఉడికిపోతూ ఉడికిపోవుచున్నామమ్మా! అని యరుచు చున్నవి. తల్లియు నా బానచుట్టు తిరుగుచు నుడకకండి బిడ్డలారా! ఉడకకుండా ఉండ్రాళ్ళవాయనము నిచ్చినాను, అని తల్లి చెప్పినది. పిమ్మట పిల్లలు చచ్చిపోయే మమ్మా అని అరచినవి. చావకండి బిడ్డలారా! చావకుండా! చలిమిడి వాయనమిచ్చితి నని తల్లిపలికెను. అంత చిమిడితిమే యమ్మా! యని పిల్లలరచినవి. చిమడకండి బిడ్డలారా! చిమడకుండా చిమ్మిలి వాయనమిచ్చినానని తల్లి యనెను. తరువాత పిల్లలు వేగితిమేయమ్మా! అని యరచినవి. వేగకండి బిడ్డలారా! వేగకుండా వేపుడు బియ్యం వాయనమిచ్చినాని పలికెను. పేలిపోయితిమేయమ్మా యని పిల్లలరచినవి. పేలకండి బిడ్డలారా! పేలకుండా పేలాలు వాయనమిచ్చానని తల్లి చెప్పెను. అడుగంటితిమేమ్మ అని అరచినవి అడుగంటకండి బిడ్డలారా! అడుగంటకుండా అట్లు వాయనమిచ్చినానని తల్లిపలికెను. కాలిపోతిమేయమ్మా యనిపిల్లలరచినవి. కాలకండి బిడ్డలారా! కాలకుండా కర్రలు వాయనమిచ్చినానని తల్లిపలికెను. పాకితిమేయమ్మా! యని పిల్లలరచినవి. పాకకండి బిడ్డలారా! పాకకుండా పరమాన్నము వాయనమిచ్చినానని తల్లిచెప్పెను. పొంగితిమేయమ్మా! యని పిల్లలరచినవి. పొంగకండి బిడ్డలారా! పొంగకుండా పోలులు వాయనమిచ్చినానని తల్లిచెప్పెను. నానితిమేయమ్మా! యని పిల్లలరచినవి, నానకండి బిడ్డలారా! నానకుండా నానబియ్యం వాయనమిచ్చితినని తల్లి పలికెను. మాడిమితేయమ్మా! యని పిల్లలరచినవి. మాడకండి బిడ్డలారా! మాడకుండా మాడలు వాయనమిచ్చినానని తల్లిపలికెను. కందితిమేయమ్మా ! అని పిల్లలరచినవి. కందకండి బిడ్డలారా! కందకుండ గారెలు వాయనమిచ్చినానని తల్లిచెప్పెను. ఇట్లు చెప్పుచు తల్లి బానచుట్టు తిరుగునప్పటికి పిల్లలన్నియు పైకివచ్చి తల్లిదగ్గరకు వెళ్ళిపోయినవి. ఇదియంతయు చూచుచున్న చాకలిది ఆశ్చర్యమునొంది కుందేలుని ఎట్లు నీపిల్ల లన్నియు బ్రతికి వచ్చినవని యడిగెను. అప్పుడా కుందేలు చాకలిదానితో - నీవు నా పిల్లలున్న బాన పొయ్యిమీద పెట్టి ఉడికించుచున్నావు. నా పిల్లలన్నియు అరచు చున్నవి. ఆ

యేడుపువీని సహించలేక శోకముతో బానచుట్టు తిరిగినాను. అంతకన్న నేనేమి యెరుగనని చెప్పెను. అప్పుడు చాకలిది, ఈ రోజున అమావాస్య, ఈరోజు మొదలుకొని కథచెప్పి అక్షింతలు వేసికొని దీనికి, కుందేటి అమావాస్య అని పేరు పెట్టుకొని నోము పట్టెదనని నోముపట్టి కథచెప్పుకొని అక్షింతలు వేసుకొనెను. ఈ ప్రకారం పదమూడు అమావాస్యములు నోచుకొని అమావాస్య కొక్కరకము చొప్పున చలిమిడి మొదలైనవి చేసికొని దక్షణ తాంబూలము పెట్టి ముత్తయిదువులకు వాయన మిచ్చెను.

**ఉద్యాపనము :-** మూడు మానికెలబియ్యము చలిమిడిచేసి అది కుందేటి తల్లిపిల్లలుగాచేసి, చాకలిబానలోని దానిలోపెట్టి చీర రవికెలగుడ్డ, నల్లపూసలు, లక్కజోడు, దక్షణ తాంబూలములతో ముత్తయిదువునకు వాయనము యియ్యవలెను. కథలోపమైనను వ్రతలోపము కాకూడదు. భక్తి తప్పినను ఫలముతప్పదు.

## 27. దంపతుల తాంబూలము నోము కథ

ఒక రాజుభార్య దంపత తాంబూలము నోముపట్టి ఉల్లంఘన చేసెను. అందువల్ల భార్యాభర్తల కెడబాటు వచ్చెను. సిరిసంపదలు కూడ తక్కువయ్యెను. ఇట్లు కొన్నాళ్ళుండి సహించలేక యా చిన్నది అడవిలోకివెళ్ళి అచ్చట ఏడ్చుచూ కూర్చుండెను. పార్వతీపరమేశ్వరులు భూమి పాలించుటకువచ్చి యెందు కేడ్చుచున్నా వని యడుగగా నాయనా! మీకెందుకు వెళ్లుడని చెప్పెను. అందుకు వారు దేశాంతర మెళ్ళినాడు. సిరిసంపదలు తగ్గిపోయినవి. అందుచేత విచారించుచున్నానని చెప్పెను. అప్పుడు పార్వతీ పరమేశ్వరులు నీవు క్రిందటి జన్మమున దంపత తాంబూలము నోముపట్టి ఉల్లంఘనము చేసినావు. అందుచేత నీకీ విచారము కలిగినది. ఇప్పుడీ కథ చెప్పి అక్షింతలు వేసికొని, ఏడాది తాంబూలమిచ్చి ఏడాది అయిన తరువాత ఉద్యాపన చేసికొనవలసినదని చెప్పి యదృశ్యులైరి. ఆ ప్రకారం జరుపగా భర్తవచ్చెను. సిరిసంపదలతో సుఖముల ననుభవించెను.

**ఉద్యాపనము :-** దంపతులకు తలంటీ నీళ్ళుబోసి మున్నూట అరువది ఆకులు, మున్నూట అరువది పోకలు, తాంబూల సరంజాము ఒక పళ్లెమైనను, పొందానయైనను కొని దానిలో నుండి దంపతలకు భోజనము పెట్టి అందివయ్య వలెను. కథలోపమైనను వ్రతలోపముకాకూడదు. భక్తి తప్పినను ఫలము తప్పదు.

## 28. పదహారు ఫలముల నోము కథ

ఒక రాజుభార్యయు, ప్రధానిభార్యము పదునారు ఫలముల నోముపట్టి ప్రధానిభార్య మంచిఫలముల నన్నిటిని యెంచి యధాశక్తి దక్షిణతో నొక ముత్తెయిదువ కిచ్చినది. రాజుభార్య 'నేను కదా గొప్పదాన'ని గర్వించి పదునారు రకముల ఫలముల

తెప్పించి కొట్టులో వేయించి మంచి చెడ్డలు చూడకుండ దానము చేసినది. తరువాత ప్రధాని భార్యకు మంచి సంతానము కలిగెను. రాజుభార్యకు గ్రుడ్డివాండ్రు, కుంటివాండ్రు పిల్లలు గలిగిరి, అపుడు రాజుభార్య ప్రధానిభార్యను యేమమ్మా! మనమిద్దరము కూడా నోముపట్టినాము. ఉద్యాపనము చేసినాము. నీకు మంచిపిల్లలు పుట్టడమేమి? నాకిట్టి సంతానము కలగడమేమి? యని యడిగెను. అంతట ప్రధాని భార్య 'నీవు గర్వించి అన్ని ఫలములను ఒక్కసారి దానము చేసినావు. నేను ఏ ఫలము కాఫలమే చేసినాను. అందుచేత నీకు యిట్టి సంతానము కలిగినది. నాకట్టి సంతానము కలిగినది అని చెప్పినది. అపుడు రాజుభార్య యేమి చేయమనెదవమ్మా యిప్పుడ'ని ప్రధానిభార్య నడిగెను. తిరిగి పదునారు ఫలములనోముపట్టి మంచి మంచి ఫలముల నెంచి తగిన దక్షణతో నుద్యాపన జేసికొంటే మంచి సంతానమగును. అని ప్రధానిభార్య చెప్పెను. ఆ ప్రకారము రాజుభార్య నోముపట్టి పదహారు ఫలాలు యుద్యాపనము చేసికొనెను.

## 29. సౌభాగ్య తదియల కథ

ఒక బ్రాహ్మణుని కొక ఆడపిల్ల కలదు. ఆమెకు చిన్ననాటనే విధవరికము సంభవించెను. ఇందునుగూర్చి ఆ తల్లితండ్రులు మిక్కిలి విచారించుచుండెడివారు. ఆ జననీ జనకులు కొంతకాలము వరకుండి దుఃఖశాంతి గానక పిల్లలతో కానలకు బోయి విచారించుచు తిరుగుచుండగా భూమిపాలించుటకు పార్వతీపరమేశ్వరులు వచ్చి ఏమి మీరు యిలాగు విచారించుచు తిరుగుచున్నారని యడిగిరి. అప్పుడు వారు మీకెందుకు నాయనా! వెళ్ళండి యని చెప్పగా పార్వతీ పరమేశ్వరులు కాదు కూడదు. చెప్పవలసినదని యడిగిరి. అప్పుడా తల్లిదండ్రులు లేక లేక మాకీపిల్ల యొకర్తియే పుట్టినది. దీనికి పెళ్ళిచేసినాము. పెండ్లికాగానే భర్తపరలోకగతుడాయెను. ఆ దుఃఖము భరించలేక ఈలాగున పిల్లలతో తిరుగుచున్నాము అని చెప్పినారు. అప్పుడా పార్వతీపరమేశ్వరులు అయ్యో! ఆ పిల్ల క్రిందటి జన్మమున సౌభాగ్యతదియ నోముపట్టి ఉల్లంఘనచేసినది. అందుచేత నిట్టియాపద చిన్నదానికి సంభవించినది. ఆ వ్యథ పోవుటకుగాను తిరిగి యపుడా నోముపట్టించి సంవత్సరము పొడుగున పౌర్ణమి వెళ్ళిన తదియనాడు ఉపవాసముండి ఎడచేర పెడచేద బ్యియంబోసి యెదుట మనిషితో మాట్లాడకుండ ఉప్పువేయని చప్పిడితిని యేడాది అయిన తరువాత ఉద్యాపన చేసుకొనెను.

**ఉద్యాపన :-** వీసెపెబులం పసుపు మనిషితో మాట్లాడకుండా కలియగొట్టి 13 వెదురు పెట్టెలలోపోసి పదమూడు కానులు దక్షణ తాంబూలము, 13 లక్కజోళ్లు, 13 రవికెలగుడ్డలు, 13 నల్లపూసలుకోళ్లు పెట్టి పదముగ్గురు ముత్తైదువులకు వాయన మియ్యవలయును. కథలోపమైనను వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినను ఫలము తప్పదు.

# 30. మాఘఆదివారముల కథ

మాఘపూర్ణిమముందు రథసప్తమినాడు సోములారిసోమిదేవమ్మ పసుపు రాసుకొని స్నానముచేసి పచ్చని యక్షంతలు పట్టుకొని కుమారులారా! నాపాలిట మాఘపాదివారము కథ వినవలయునని కొడుకులను పిలిచి యడిగెను. అంతట నొక కుమారుడు 'మాకేమికథ మాకేమి కారుణ్యమమ్మా! రాజుగారు కచేరికివచ్చే వేళయైనది అక్కడికి పోవలెనని చెప్పి యట్లు కచ్చేరికి వెళ్ళెను. రాజుగారు అంతకు ముందుగానే కచ్చేరికివచ్చి యాలస్యముగా వచ్చినయా బ్రాహ్మణుని కుమారునిచే విడిమన్నన చేసినారు. అప్పుడా కుమారుడు 'సోములారి సోమిదేవమ్మ కథ వినని దోషము కట్టికుడిపినదని చింతించుచు తన గృహమునకు వెళ్ళెను. సోమిదేవమ్మ మనుమలను బిలిచి మనుమలారా! నాపాలిటి మాఘపాదివారముల కథవినెదరా? అని యడుగగా బడికిపోవలెను. పంతులు కొట్టిపోవును అని చెప్పుచు మనుమలు బడికి వెళ్ళిరి. అంత ప్రొద్దుపోయి రావడమేమని పంతులా బాలురను కొట్టిరి. అప్పుడు చిన్న కఱ్ఱల సోములారి సోమిదేవమ్మకథ వినని దోషము కట్టికుడిపింది యని యనుకొనిరి. సోమరారి సోమిదేవమ్మ తన కోడలిని బిలిచి కోడలా! నా పాలిటి మాఘపాదివారము కథ వినెదవా? యని యడుగగా- నాకేమి కథ? నాకేమి కారుణ్యమమ్మా నాపిల్లలకు పాలు ఉగ్గు పోసికొనవలెనని కోడలు చెప్పి ఉయ్యాలలో నున్న తన బిడ్డయొద్దకు వెళ్ళి చూచునపుడు ఉయ్యాలలోని బాలకొయ్య బారిపోయెను. అప్పుడా కోడలు అయ్యో! సోములారి సోమిదేవమ్మ కథ విననిదోషము కట్టికుడిపినదని విచారించెను. తిరిగి సోములారి సోమిదేవమ్మ నీళ్లరేవుదగ్గరకు వెళ్ళి, నీలాడెడుయక్కలారా! పాలాడెడు యక్కలారా! యని నీళ్లరేవున స్నానము చేయు కాంతలను పిలిచి నా పాలింటి మాఘపాదివారములకథ వినెదవా? యని యడిగెను. అప్పుడా స్త్రీలు మేము నీళ్లుపాలు తెచ్చుకొనవలెనమ్మా! అని చెప్పి నీళ్ల కడవలు భుజములపై నుంచుకొనబోగానవి విచ్చిపోయినవి. 'అయ్యో! సోములారి సోమిదేవమ్మకథ విననిదోషము కట్టికుడిపినదనియు యా స్త్రీలందరు విచారించిరి పిమ్మట సోములారిసోమిదేవమ్మ వీధిలోకివచ్చి నిలుచుండగా నొక బ్రాహ్మణు డెదురు గుండా వచ్చెను. అప్పుడా సోములారి సోమిదేవమ్మ బ్రాహ్మణుని పిలిచి- బ్రాహ్మణుడా! నా పాలింటి మాఘపాదివారములకథ వినెదవా? అని యడుగగా నా బ్రాహ్మణుడు పంచాంగము చెప్పుకొనవలెనని చెప్పి రాజుగారింటికి వెళ్లేసరికి తలుపులు మూయబడి వెళ్లుటకు వీలులేక పోయెను. అంతట బ్రాహ్మణుడు సోములారి సోమిదేవమ్మ కథ వినని దోషం కట్టి కుడిపిందని విచారించుచు పోయెను. తరువాత సోములారి సోమిదేవమ్మకు మేదరివా డెదురుగా వచ్చేసరికి నా పాలింటి మాఘపాది వారములకథ వినెదవా? యని వాని నడుగగా మాకేమి కథ? మాకేమి కారుణ్యమమ్మా తట్టబుట్టలు నల్లుకోవలెనని మేదరివాడు వెళ్ళి తట్టలల్లుకొనుచుండగా కత్తివిరిగి పోయినది. అయ్యో! సోములారి సోమిదేవమ్మకథ వినిన దోషం కట్టికుడిపినదని

మేదరివాడు చింతించెను. పిమ్మట ఉప్పరివాడు కనబడి వానిని పిలిచి- ఉప్పరి నా పాలింటి మాఘపాదివారములకథ వినెదవా? యని యడుగవాడు మాకేమి కథ మాకేమి కారుణ్యమమ్మా! గట్టుపుట్ట పెట్టుకొనవలెనని చెప్పి గట్టుపుట్ట పెట్టుకొనుచుండగా పార, గడ్డపార విరిగిపోయెను. అయ్యో సోములారి సోమిదేవమ్మ కథ విననిదోషము కట్టికుడిపినదని ఉప్పరివాడనుకొనెను. తరువాత చాకలివాడు యెదురుగా వచ్చుచుండ చాకలి వానిని పిలిచి 'చాకలీ! నా పాలింటి మాఘపాది వారములకథ వినెదవా? యని సోములారి సోమిదేవమ్మ అడిగెను. వాడందుకు- మాకేమికథ? మాకేమి కార్యణ్యమమ్మా! రాజుగారి బట్టలారవేయుటకు పోవలెనని బదులుచెప్పి ఇంటికిపోగా గాలివానవచ్చి బట్టలెగరకొట్టుకొని పోయినవి. అయ్యో! సోములారి సోమిదేవమ్మ కథ విననిదోషంబు కట్టికుడిపిందని యనుకొనెను. తరువాత కుమ్మరివాడెదురుగా వచ్చెను. అప్పుడు వానిని పిలిచి కుమ్మరీ! నాపాలించి మాఘపాదివారముకథ వినెదవా? అని యడుగ- 'నాకేమికథ నాకేమి కారుణ్యమమ్మా! యజుగారికి వెండిబాన, పయిడిబాన చేయుటకు పోవలెనని చెప్పి యింటికిపోయి వెండిబాన, పయిడిబాన చేయబోవునప్పుడు కుమ్మరిసాన విరిగిపోయెను. అపుడువాడు అయ్యో! సోములారి సోమిదేవమ్మ కథ విననిదోషము కట్టికుడిపిందని యనుకొనెను. కొంతకాలమున కుప్పరమాదేవి యెదురురాగా సోములారి సోమిదేవమ్మ ఉప్పరమా దేవిని పిలిచి నా పాలింటి మాఘపాదివారములకథ వినెదవా? యని ఆమె నడిగెను. అప్పుడామె ఇట్లు చెప్పెను వినెదను, నిన్న శనివారం ఒంటిపూట భోజనము. ఈ రోజు ఆదివారము, మానెడు పాలలో చేరడు బియ్యముపోసి పెట్టినకథ వినెదనని చెప్పెను. మంచిదని సోములారి సోమిదేవమ్మ మానెడు పాలలో చేరడు బియ్యముపోసి పెట్టినది. తిని యుప్పరమాదేవి గట్టుమీదపడుకొని నిదురపోయినది. ఆమె కడుపులో నున్నపిల్ల సోములారసోమి దేవమ్మతో మా అమ్మ బొడ్డు మీద నక్షతలువేసి కథ చెప్పుకోవమ్మా! వినెదనని చెప్పెను. అట్లు బొడ్డుమీద నక్షతలు వేసి సోమిలారి సోమదేవమ్మ-

పాడువూళ్లు పాట్నాలవును పట్టి జోజో - పాపా జోజో
ఎండిమ్రాను పండ్లు పండ్లు పట్టి జోజో - పాపా జోజో
పట్టావులు పాలనిచ్చు పట్టి జోజో - పాపా జోజో
గొడ్డువాంధ్రూ బిడ్డలగందురు పట్టి జోజో - పాపా జోజో
వేచి వేసినా వేయివేలే పండ్లు పట్టి జోజో - పాపా జోజో
కోసివేసినా కోటివేల పువ్వులు పట్టి జోజో - పాపా జోజో
కోసివేసినా కోటివేల పండ్లు పట్టి జోజో - పాపా జోజో
ప్రత్తిగింజలు ముత్యాలౌను పట్టి జోజో - పాపా జోజో
చచ్చిన పురుషుడు లేచివచ్చును పట్టి జోజో - పాపా జోజో
ఏడువారలనగలూ నట్టేటలోపడినా నట్టింటికివచ్చును పట్టి జోజో-పాపాజోజో

అని పాడుచు కథ చెప్పుకొనెను. అపుడుప్ప రమాదేవి లేచి– "సోమిదేవమ్మతో పలికెను. 'అమ్మా! నీకడుపులోనిపిల్ల ఆలకించినది. నేడు కథ చెప్పుకున్నాను. ఆడ శిశువు పుట్టినను, మగశిశువు కలిగినను నాకు కబురుచేయుమని సోములారి సోమిదేవమ్మ చెప్పెను. అప్పు డుప్పరమాదేవి యప్పరిపాకలోకి వెళ్ళి సోమిదేవమ్మ కిట్లని వర్తమానము చేసెను. యుప్పరమాదేవి నీళ్ళాడినది. ఆడశిశువు కలిగెను. రావలసిన దని వర్తమానము చేసెను. ఈ వర్తమానము విని సోములారి సోమిదేవమ్మ ఉగ్గునకొక గిన్నెయు, ఉయ్యాలకు నొకచీర పట్టుకొనివెళ్ళి ఆ పిల్లను తీసుకొనివచ్చి యడవిలో నశ్వత్థవృక్షమున కుయ్యాలవేసి, 'పక్షులారా! పాడండి. వృక్షవరులారా! ఊపండి అని చెప్పి కన్నతల్లి గట్టుపుట్ట పెట్టుకొనుటకుపోగా పెంచినతల్లి యింటికి వచ్చినది పక్షులు ఆనందముగ పాడుచుండెను. వృక్షములూగుచున్నవి ఒక రాజు సవారీ యెక్కి యామార్గమున బోవుచు పక్షులపాటయు, బాలరోదనమువిని యది యేమియో కనుగొనమని తన పరిచారకునితో చెప్పెను. వాడు 'వెరచి చెప్పుదునా? వెరువక చెప్పుదునా' అని అడుగ రాజు 'వెరువక చెప్పుమనెను. అప్పుడు వాడు మహారాజుగాదితో 'మాకయినమాత దేవరకయిన దేవీ' అని చెప్పెను. అంతట మహారాజు తనవారి నాయశ్వత్థ వృక్షసమీపమునకు పట్టించి యా బాలను తనపల్లకీలో నుంచుకొని పాడువూరిలోనికి తీసుకొనివచ్చినాడు. ఆపాడు గ్రామము గొప్ప పట్టణమై కడు అందముగా నొప్పుచుండెను. అంత 'యిదేమి చోద్యముగంటిని అక్కా! అనెను. తరువాత నాబాలను ప్రత్తిగింజలలో పరుండబెట్టి పైని ప్రత్తిగింజలే కప్పినారు. యా బాల శరీర స్పర్శకు ప్రత్తిగింజ లన్నియు ముత్యము లయినవి. 'యిదేమి చోద్యము గంటిని అక్కా! అనెను. వేయించి వేయగా వేపవేలుపండినవి. ఇదేమి చోద్యము గంటిని అక్కా! అనెను.కోసివేయగా కోటివేలుండెను. ఇదేమి చోద్యము గంటిని అక్కా యనెను. మాడ్చివేయగా నూరువేలు పండినది. ఇదేమి చోద్యము గంటిని అక్కా! అనెను. వట్టియావును తీసుకొనివచ్చి కట్టిపెట్టినాను. పాలు యిచ్చినది. ఇదేమిచోద్యము గంటిని అక్కా! అనెను. వట్టి మ్రాను తీసుకొనివచ్చి పాతిపెట్టగా పండ్లు పండెను. ఇదేమి చోద్యముగంటిని అక్కా! యనెను. రాజుగారి పెద్దభార్య యొద్దకు ఆ పిల్లలను తీసుకొనిపోగా నామెకు కొడుకుపుట్టెను. ఇదేమి చోద్యము అక్కా! అనెను. రాజుగారి పెద్దభార్యయొక్కయు, చిన్నభార్య అయిన ఉప్పరమాదేవి కూతురు యొక్కయు శరీరమందున్న నగలుతీసి యొక బరిణెలోనుంచి ఆ బరిణి సముద్రంలో బారవేయగా దానినొకచేప మ్రింగెను. పల్లెవాడొకడు వలవేయగా నాచేపవానికి దొరికెను. అపుడు పల్లెవాడా చేపను రాజుగారికి కానుకగా పంపించెను. తిన్నగా నా చేపను రాజుగారి పెద్దభార్య గృహమునకు పట్టుకొనిపోయి ఇచ్చిరి. రాజుగారు పెందలకడ వంటచేయవలసినదనియు భోజనమునకు వచ్చెదననియు తన పెద్దభార్యకు వర్తమానము చేసెను. అంతట 'నగ నాణెము దానికిని చేత బెల్ల నాకు' యని చేపను యుప్పరమాదేవికి పెద్దభార్య పంపివేసినది ఉప్పరమాదేవియు 'మంచికూర వచ్చినద'ని కత్తిమీద ముందరవేసుకొని తరగబోయే సరికి ఘల్లున

చేప కడుపులోనుంచి నగల బరిణె పడినది. 'నాపాలిటి మహాలక్ష్మి నా యింటికి వచ్చినది. పాలచేతకడిగి పళ్లెములో పెట్టుకొని నాయుప్పరమాదేవి యేడువారాల నగలుధరించి పద్మాల పట్టుచీర కట్టుకొని 'రాజుగారిని భోజనమునకు రమ్మని కబురుచేసినది. 'నగులుపోతే నగలు తెచ్చుకొన్నది. నేపోయిన తిరిగి నన్నేలాగున తెచ్చుకొనునో చేతముగాక!' అని చిన్నభార్యయైన ఉప్పరమాదేవి యింట్లో భోజనముచేసి పెద్దభార్య యింట్లో విషముతిని చనిపోయెను. అప్పుడు చచ్చిన పురుషునివంటయెండబెట్టి పెద్దభార్య తన సవతిని 'సహగమనమునకు రమ్మని'పిలిచి నది. సవతియగు యుప్పరమాదేవియు పసుపుకలిపి పళ్లెరములో పోసికొని కుంకుమ కొని కుదురు మీదపెట్టుకొని తలుపున తడకవేసి వెళ్ళుచున్నది. అప్పుడాదినారాయణ మూర్తి ఆమెకు ప్రత్యక్షమై "ఏమమ్మా! ఎక్కడకు వెళ్ళుచున్నావు?" అని అడిగెను. 'చచ్చిన పురుషుడు నట్టింటనున్నాడు సవతి సహగమనము చేయుచున్నది, రమాదేవి వచ్చింది. ఉప్పరమాదేవిని రమ్మని కబురు పంపించినారు. పసుపుకొని పళ్లెరములో పోసికొని, కుంకుమకొని కుదురుమీదపెట్టుకొని తలుపున తడకవేసి తొందరగా వెళ్లుచున్నాను అని ఉప్పరమాదేవి చెప్పెను'. అప్పుడాయన-'సౌభాగ్యవతీభవ! అంతపని పట్టరాదు నాకు కాళ్లు కడుగుకొనుటకు నీళ్లుయిచ్చి నీవుకూడా కాళ్లు కడుగుకోవమ్మా అని పలికినాడు ఆమెయు నా బ్రాహ్మణవేషముతో వచ్చిన నారాయణ మూర్తికి కాళ్ళుకడుగుకొనుటకు నీళ్ళుయిచ్చి తానుకూడా కాళ్లు కడుగుకున్నది. తిరిగి యా బ్రాహ్మణుడు- నాకు దాహమిచ్చి నీవుదాహముపుచ్చుకోవమ్మా! యని చెప్పినాడు. 'చచ్చిన పురుషుడు నట్టింటయున్నాడు. సవతిసహగమనము చేయుటకు వెళ్లుచున్నది. పసుపుకొని పళ్లెములో పోసినాను, కుంకుమకొని కుదురుమీద పెట్టినాను. తలుపుతడక వేసినాను. కాళ్ళుకడుక్కొని కాళ్లుదాచినాను, దాహమెక్కడ దాచనయ్యా! అని యుప్పరమాదేవి చెప్పెను. అప్పుడా బ్రాహ్మణుడు 'సౌభాగ్యవతీభవ! అంతపని పట్టరాదు. నాకు దాహమిచ్చి నీవు దాహము పుచ్చుకోవమ్మా! అని చెప్పెను. ఆ ప్రకార మా బ్రాహ్మణునికి దాహమిచ్చి తానుకూడా దాహము పుచ్చుకొన్నది తరువాత నా బ్రాహ్మణుడు 'నాకుతలయంటి నీవుకూడా తలయంటుకోవమ్మా! అని చెప్పెను. 'చచ్చిన పురుషుడు నట్టింటయున్నాడు. సవతి సహగమనము చేయుచున్నది. పసుపు పళ్లెములో పోసినాను. కుంకుమకొని కుదురుమీద పెట్టినాను. తలుపున తడక వేసినాను. కాళ్లు కడుగుకొని కాళ్లుదాచినాను. దాహము త్రాగి దాహముదాచినాను. తలయంటుకొని తలయెక్కడ దాచనయ్యా! అనెను. 'సౌభాగ్యవతీభవ! అంతపనిపట్ట రాదు. నాకు తలయంటి నీవు కూడా తలయంటుకోవమ్మా! అని బ్రాహ్మణుడు పల్కినాడు. ఆ ప్రకారమా బ్రాహ్మణునికి తలయంటి తానుకూడా తలయంటుకొనిన తరువాత నా బ్రాహ్మణుడు నామెను అడిగిన దేమనగా; తనకు గంధమిచ్చి యామెను పసుపు పూసుకోమనెను. చచ్చిన పురుషుడు నట్టింటనున్నాడు. సవతి సగహగమనము చేయుచున్నది. పసుపుకొని పళ్లెములోపోసినాను. కుంకుమకొని కుదురు మీదపెట్టినారు. తలుపున తడక వేసినారు. కాళ్లు కడుగుకొని కాళ్ళుదాచినాను. దాహముపుచ్చుకొని దాహము దాచినాను తలయంటుకొని తలదాచినాను. పసుపు

రాసుకొని మొగమెక్కడ దాచనయ్యా? అని యామె జవాబు చెప్పెను. 'సౌభాగ్యవతీభవ! అంతపని పట్టరాదు. నాకు గంధమిచ్చి నీవు పసుపురాసుకోవమ్మా!' అని బ్రాహ్మణుడు తిరిగిచెప్పెను. ఆ ప్రకారము బ్రాహ్మణుడు-'నాకు బొట్టునిచ్చి నీవు బొట్టుపెట్టు కోవమ్మా!' యని చెప్పెను. 'చచ్చిన పురుషుడు నట్టింటనున్నాడు. సవతిసహగమనము చేయుచున్నది. పసుపుకొని పళ్లెములో పోసినాను. కుంకుమకొని కుదురుమీద పెట్టినాను. తలుపున తడక వేసినాను. కాళ్లు కడుగొని కాళ్లుదాచినాను దాహము పుచ్చుకొని దాహము దాచినాను. తలయంటుకొని తలదాచిననాను. పసుపురాసుకొని మొగము దాచినాను. బొట్టుపెట్టుకుని బొట్టెక్కడ దాచనయ్యా! అనెను. 'సౌభాగ్యవతీ భవ! అంతపని పట్టరాదు. నాకు బొట్టిచ్చి నీవు బొట్టుపెట్టుకోవమ్మా! అని బ్రాహ్మణుడు పలికెను. ఆ ప్రకారము బ్రాహ్మణునికి బొట్టునిచ్చి తానుకూడా బొట్టుపెట్టుకొనెను. తిరిగి ఆ బ్రాహ్మణుడు- 'నాకు భోజనముపెట్టి నీవు భోజనము చేయవమ్మా!' అని యామెతో చెప్పెను. 'చచ్చిన పురుషుడు నట్టింటనున్నాడు.' సవతి సహగమనము చేయుచున్నది. పసుపుకొని పళ్ళెములోపోసినాను. కుంకమకొని కుదురుమీద పెట్టినాను. కాళ్ళుకడుకొని కాళ్లుదాచినాను. దాహము పుచ్చుకొని దాహము దాచినాను, తలయంటికొని తలదాచినాను, పసుపురాసుకొని పసుపుదాచినాను, బొట్టు పెట్టుకొని బొట్టు దాచినాను, అన్నము తిని కడుపెక్కడ దాచనయ్యా? అని యామె చెప్పెను. 'సౌభాగ్యవతీభవ! అంతపని పట్టరాదు. నాకు భోజనముపెట్టి నీవు భోజనము చేయవమ్మా!' అని బ్రాహ్మణుడు పలికెను. ఆ ప్రకారము బ్రాహ్మణునకు భోజనముపెట్టి తాను కూడా భోజనముచేసెను. అప్పుడా బ్రాహ్మణుడు నాకు తాంబూలమిచ్చి నీవుకూడ తాంబూలమువేసి కోపమ్మా! అని చెప్పెను. 'చచ్చిన పురుషుడు నట్టింటనున్నాడు. సవతి సహగమనము చేయుచున్నది. పసుపుకొని పల్లెములోపోసినాను కుంకుమకొని కుదురుమీద పెట్టినాను. కాళ్ళుకడుగుకొని కాళ్లుదాచినాను, దాహము పుచ్చుకొని దాహము దాచినాను, తలయంటుకొని తలదాచినాను. పసుపురాసుకొని పసుపుదాచినాను, బొట్టుపెట్టుకొన బొట్టుదాచినాను. అన్నముతిని అన్నముదాచినాను, తాంబూలము వేసుకొని నోరెక్కడ దాచనయ్యా? అని అమె చెప్పెను. 'సౌభాగ్యవతీభవ! అంతపని పట్టరాదు. నాకు తాంబూలమిచ్చి నీవుకూడా తాంబూలము వేసుకొనవమ్మా! అని బ్రాహ్మణుడు పలికెను. ఆ ప్రకార మా బ్రాహ్మణునికి తాంబూలమిచ్చి తానుకూడా తాంబూలము వేసుకొనెను. అప్పుడా బ్రాహ్మణుడు దివ్యమంగళ విగ్రహుండై శంఖుచక్ర గదాధరుండై ఆదినారాయణమూర్తి ఆమెకు ప్రత్యక్షమయ్యెను. అప్పుడామె మెచ్చి ఈ సయ్యాశంఖచక్రగధారుండా! నిన్నుకోరితి వరమీయవయ్యా! అని కోరెను. 'ఇచ్చితి పుచ్చుకో? యని పచ్చని యక్షతలు ఆమె చేతిలో నారాయణుడుంచి-"నీవు వెళ్లేసరికి కటుకుమీద పురుషుని కాటిమీద పెట్టుచుందురు అప్పుడు నీవు మూడు ప్రదక్షిణములుచేసి యక్షంతలు మీద చల్లవలెను. చల్లిన వెంటనే పురుషుడు లేచి కూర్చుండును అని నారాయణమూర్తి చెప్పెను. ఆ ప్రకారమే అక్షంతలు పట్టుకొని వెళ్ళి మూడు ప్రదక్షిణములుచేసి ఆ

యక్షంతలుమీద చల్లేసరికి 'యెంత నిద్రపోయి లేచినాను' అని యామెభర్త లేచి కూర్చుండెను. అప్పుడందరు ఆశ్చర్యమునొంది-'యేమి నోము పట్టితివమ్మా? యని యా బాలగోపాల మామెను అడుగసాగిరి. ఏమినోయు పట్టలేదు. ఏమి వ్రతము పట్టలేదు. మాఘపూర్ణిమ ముందర రధసప్తమినాడు మాఘపాదివారముల నోముపట్టి సోముసారి సోమిదేవమ్మ కథ చెప్పుకొని యక్షంతలు వేసుకొన్నది. ఆ కథ నేను విన్నాను వన్నిఫలమేకాని పట్టిన ఫలముకాదది అని యామె చెప్పెను. 'విన్నంత మాత్రాన ఇంతఫలము వచ్చినది. నోము పట్టిన యెంతఫలము వచ్చునో యని రాజు తన యిద్దరి భార్యలచేతను నోముపట్టించినాడు. వారు పట్టిన నోమే కలిగియుగ మందలి యందరూ పట్టినారు. నోముపట్టిన సంవత్సరము పాలు త్రాగరాదు. మరుసటి సంవత్సరము మజ్జిగ త్రాగరాదు. మూడవ సంవత్సరము పప్పుతినరాదు. నాలుగవయేడు తలంటుకోరాదు. అయిదవయేడు తాంబూలము వేసికొనరాదు. అయిదేండ్ల అనంతము ఉద్యాపన చేయవలెను.

**ఉద్యాపనము :-** తలయండుకొనిన సంవత్సరము అయిదుగురు ముత్తయిదువులకు తలంటి పప్పుతినినయేడు బూరెలువండి, పాలు త్రాగనియేడు పరమాన్నమువండి, చల్లత్రాగనియేడు పెరుగువడ్డించి, తాంబూలము వేసుకొనని యేడు తాంబూలమిచ్చి యీ ప్రకారము పదుగురు ముత్తయిదువులకు అయిదు రవికెల గుడ్డలనిచ్చి ఆదినారాయణమూర్తికి యైదుమూళ్ళ అంగవస్త్రమిచ్చి వుగ్గునకు గిన్నెయు, వుయ్యెలకు చీరయునిచ్చి యుద్యాపనము చేసికొనవలెను.

## 31. సూర్యపద్మము కథ

ఒకానొక గ్రామమున నొక బ్రాహ్మణుండు, నొక రాజు, నొక కోమటి, యొకకాపు, నొక గొల్లవాడు నుండిరి. వీరయిదుగురు అయిదు కుంచములను కొనుక్కొనిరి. ఈ అయిదు కుంచములు రోజు రోజు నా గ్రామముననున్న దేవాలయమునకు బోయి తమలోతాము 'నాతో నిన్న వరహాలు కొల్చినారు. నాతో నిన్న వడ్లుకొలిచినారు' అని చెప్పుకొనుచుండిరి. వాటిలో బ్రాహ్మణకుంచము తన యజమానియగు బ్రాహ్మణునికి దరిద్రమగుటచే తనలో యేమేమి కొల్చినారో చెప్పక యూరక కూర్చుండినది. ఒకనాడు తక్కిన నాలుగు కుంచములు యధాప్రకారముగ దేవాలయమునకు వెళ్ళెనుగాని బ్రాహ్మణకుంచ మారోజున రాలేదు. 'ఎందుచేత బ్రాహ్మణకుంచమురాలేదు!' అని తమలో తాము కొంతసేపు తర్కించుకొని కొంతసేపు కూర్చుని తమ తమ యిండ్లకు తిరిగి వెళ్ళిపోయెను. మరుసటి రోజున కుంచము లన్నియు నా దేవాలయమునజేరి 'నాతో నిన్న వరహాలు కొలుచుకున్నారు నాతో నిన్న వడ్లుకొలుచుకున్నారు' అని చెప్పుకొనుచున్నవి. అప్పుడు బ్రాహ్మణ కుంచము జూచి తక్కిన కుంచములు- 'నిన్న నెందుకు వచ్చినావు కావు' అని అడిగినవి. 'సోలెడు నూకలుండగా మాయమ్మగారు నాలో పోసి మూతవేసినందున నిన్నటిరోజున

నేను వచ్చుటకు వీలులేక పోయినద'ని బ్రాహ్మణకుంచము చెప్పెను. అందు మీద తక్కినవన్నియు–'నెప్పుడు చెప్పినా నూకలుఅళ్ళు కొలిచారని చెప్పు చుండెదవు' యని నీరసించి పలికెను. అంత బ్రాహ్మకుంచము– 'యేమి చేయమన్నారు? యెల్ల కాలము మీలాగుయుంటారా యేమిటి? కొన్నాళ్ళకు మా అమ్మకు కుమార్తె పుట్టును ఆ పిల్ల బొడ్డున మాణిక్యం పెట్టుకొనిమరీ పుడుతుంది. ఆ సంగతి యొక బ్రాహ్మణుడు గ్రహించి యా బాలికను తనకిండని యడుగును. అప్పుడు మా కెంతైన భాగ్యము కలుగును. అప్పుడు మేముకూడ వరహాలు కొలుచుకొనెదము' అని చెప్పెను. 'ఎప్పుడో కొలుచుకుంటారట!' అని నవ్వి తక్కినకుంచములు వెళ్లిపోయెను. బ్రాహ్మణకుంచము తనదారిన యింటికేగెను. ఈ పయి సంభాషణంతయు నొక బ్రాహ్మణుడు విని సమయముకొరకు వేచి యుండెను. అందులో బ్రాహ్మణకుంచముగల బ్రాహ్మణునికి బొడ్డునుండి ప్రతిరోజున నొక మాణిక్యము పడుచుండెడిది. దానివలన వారు కావలసినంత భాగ్యవంతులై, ఇదివరలో కుంచముల సంభాషణ విని సమయమున కెదురుచూచుచున్న బ్రాహ్మణుడు బ్రాహ్మణు కుంచముగల ఇంటికివచ్చి యజమాని గారిని "నీకూతురు నాకు యిచ్చి వివాహం చేయవలసినద"ని యడిగెను. ఆ ప్రకారము తమకూతురునిచ్చి ఆ బ్రాహ్మణునికి వివాహము గావించిరి, తరువాత పెండ్లికుమారు డగు నా బ్రాహ్మణుడు వివాహానంతరము యింటికి వెళ్లెను. కొంతకాలమైన తరువాత తిరిగివచ్చి తన భార్యయగు ఆ పిల్లను తీసికొని పోయెను. ఈ చిన్నది వెళ్ళిన తరువాత వారు కూడా మంచి భాగ్యవంతులయిరి. ధనాశచే నా బ్రాహ్మణుడు తన భార్యను పుట్టింటికి పంపుట మానినాడు. ఒకనాడు చిన్నది తల్లిని చూడవలెనని తలంపుతో భర్తయెక్కడికో వెళ్లినప్పుడు తన పుట్టింటికి వెళ్లిచూచి తిరిగి వచ్చుచుండగా మార్గమధ్యమందు పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షులై యా చిన్నదానిని–"ఎక్కడకు బోవుచుంటివని యడిగిరి. అప్పుడాచిన్నది. "మాయమ్మను చూడవలసియుండి వెళ్లి తిరిగి వచ్చుచున్నాన"ని చెప్పెను. అప్పుడు పార్వతీపరమేశ్వరుయిామెతో "అయ్యో వెర్రిదానా అలాకాదు నీ తల్లిదండ్రులకు నీవు పుట్టుటచేత భాగ్యమువచ్చినది. అందుచేతవారు నిన్ను వదలిపెట్టలేదు. ఈకారణముచేతనే నీభర్తయు నిన్ను వదలి పెట్టలేదు. ఈ కారణముచేతనే నీ భర్తయు నిన్ను వదలి పెట్టలేక నిన్ను పుట్టింటికి పంపినాడుకాదు అంతేగాని మరేమీకాదు అని చెప్పివారు 'ఇప్పుడేమి చేసినట్లయితే నాకు మావారికి కలియునో చెప్పవలెనని వారిని యాచిన్నది ప్రార్థించెను. క్రిందటి జన్మమున సూర్యపద్మము నోము పట్టినావు గనుక నీవు బొడ్డున మాణిక్యము పెట్టుకొని పుట్టినావు. అప్పుడు ఉదయముచూచి యుద్యాపనముచేసినావు కావు. కాబట్టి మీరిద్దరికి యిష్టము తక్కువగా నున్నది. ఇప్పుడీ నోముపట్టి యుద్యాపనచేస్తే మీరిద్దరు యిష్టముగా నుండెదరు.

**ఉద్యాపన :** ప్రొద్దు పొడవకుండా దంతపతులిద్దరికి తలయంటి నీళ్ళుపోసి మట్టెలు మంగళసూత్రము యిచ్చి చీర జామారు నొసంగి ప్రొద్దు పొడవకుండా యుద్యాపన చేసికొమ్మని జెప్పి పార్వతీ పరమేశ్వరులంతర్ధానము నొందిరి.

# 32. నందికేశ్వర వ్రత కథ

ఒకనాడు కైలాసపర్వతమున వినోద మందిరమున పార్వతి పరమేశ్వరునకు పాదము లొత్తుచుండగా పరమేశ్వరుడు పార్వతి కట్లనియె– "ఓపార్వతీ! నీచేతులు మృదువుగా నుండక నాపాదములు నొచ్చుచున్నవి. కావున నీవు నా పాదము లొత్తవద్దనియె. అందుకు పార్వతి చింతాకులస్వాంతయై–'దేవా! ఎందుచేత నిట్లంటిరో చెప్పవలయునని ప్రార్థించగా పరమేశ్వరుడు–'నీవు పరోపకారము చేసినావుకావు. అందుచేత నిట్లుండె'ననియెను. 'ఇందుకేమి చేసినచో నీకర్కశతపోవునని యడుగ నీశ్వరుడు– "నీవు నీళ్ళరేవునకు నీళ్ళపొయ్యి వేసుకొని నీళ్ళుకాచుచు పోవువారికి తలంటి నీళ్ళుపోసిన నీచేతులకు మృదుత్వము వచ్చున"ని చెప్పెను. పార్వతి ఆ ప్రకారము నీళ్ళుకాచి వచ్చీపోయేవారికి నీళ్ళుబోయుచుండగా నొక పేదరాలు తలంటి నీళ్ళు పోసుకుందామని పిల్లలు తాను అచ్చటికి రాగా వారికిగూడా తలంటి నీళ్ళ పోసుకుందామని పిల్లలు తాను అచ్చటికిరాగా వారికిగూడా తలంటి నీళ్ళు పోసెను. పిమ్మట వారు పార్వతియొద్దసెలవు తీసుకొని పోవుచుండగా వారిని జూచి పార్వతి– 'వీరికి భాగ్యమిచ్చెదనని మనస్సులో సంకల్పించుకొనెను. ఆ పేదరాలు యింటికి వెడలుసరికి పెనిమిటి యెడ నొకయూట పెడ నొకమూట వేసికొనివచ్చెను. ఆ రోజు కారోజు వారికి క్రమముగా భాగ్యమువచ్చెను. అంత నా బ్రాహ్మణునిభార్య బంగారు తూగుటుయ్యలలో కూర్చుండి వచ్చుపోవువారికి కందరికి పని చెప్పుచుం డెను. అది పెద్దవాడుకగా సూళ్ళవెంట చెప్పుకొనుచుండిరి. అప్పుడు పార్వతి–"నేను భాగ్యమిచ్చిన బ్రాహ్మణస్త్రీ కాబోలు, ఇంతకు వచ్చినదనుకొని ఒక పేద ముత్తయిదు వయై ఆ బ్రాహ్మణ స్త్రీ యింటికివచ్చి వాకిటిలో నిలువబడెను. ఆ బ్రాహ్మణస్త్రీ బంగారపుతూగుటుయ్యలలో నూగుచుండి యా ముదుసలి యవ్వనుగాంచి అమ్మా! పాలు పొంగువచ్చినవి. పాలమీద నొక నీళ్ళచుక్క చల్లి వెళ్ళమనెను. అప్పుడామె పాలమీద నీళ్లుచల్లి యింటికివెళ్ళి తలగట్టుకొని పడుకొనెను. అప్పుడు పరమేశ్వరుడు వచ్చి– ఎందుచేత నీలాగుంటివని యడుగగా బ్రాహ్మణునిభార్యకు తానుభాగ్యమిచ్చినది మొదలుకొని జరిగిన చర్య చెప్పి నన్ను అవమానించిన యామె భాగ్యము తీసివేయ వలసినదని పరమేశ్వరుని ప్రార్థించెను. పరమేశ్వరుడు వినాయకుని పంపగా నాతనిచూచి యా బ్రాహ్మణస్త్రీ ఐదుమానికెల బియ్యము ఉండ్రాళ్ళు వండి సోలెడు గిద్దెడు నెయ్యిపోసి చల్లిదయంచక పుల్దియుంచక చాకికిపెట్టక వేకికి పెట్టక వినాయకునికి నైవేద్యము పెట్టెను. అతనవితిని భాగ్యము తీసివేయుట నాతరముకాదని ఇంకను భాగ్యమునిచ్చి చక్కబోయెను. అప్పుడు తిరిగి నందినింపగా, అతడు వెళ్లేసరికి యా బ్రాహ్మణ స్త్రీ అయిదుమానికెల శెనగలు నీళ్లలోబోసి నైవేద్యము పెట్టెను. ఆ శెనగలుతిని యాతడు భాగ్యము తీయుట నాతరము కాదని యింకను భాగ్యమునిచ్చి వెళ్లెను. అప్పుడు పార్వతి హరుని పంపగా యాతని నా బ్రాహ్మణ స్త్రీచూచి అయిదు మానికల బియ్యము అట్లువండి సోలెడు గిద్దెడు నెయ్యిబోసి బెల్లముపెట్టి యాతనికి

నైవేద్యము పెట్టెను. అతండవి తిని-'భాగ్యము తీసివేయుట నాతరముకాద'ని యింకను భాగ్యమునిచ్చి చక్కావచ్చెను. తిరిగి అర్జునుని పంపగా నాతతనిచూచి యా బ్రాహ్మణస్త్రీ అయిదుమానికల బియ్యము అప్పాలువండి నైవేద్యము బెట్టగా నాతడవితిని మరింత భాగ్యమిచ్చి వెళ్లెను. అప్పుడు శివునిపంపగా నాతనిచూచి ఆ బ్రాహ్మణస్త్రీ అయిదు మానికెల నువ్వుపప్పు చిమ్మిలిత్రొక్కిన నైవేద్యము బెట్టెను. అతడవితిని మరింత భాగ్యమునిచ్చి చక్కాబోయెను. తరువాత కాలభైరవుని పంపగా నాతని చూచి యా బ్రాహ్మణస్త్రీ అయిదుమానికెల మినపప్పు గారెలవండి నైవేద్యము పెట్టెను. అతడవితిని యామె భాగ్యము తీయుటనావల్ల కాదదని వెళ్ళిపోయెను. పిమ్మట చంద్రుని పంపగా నాతనిచూచి యాబ్రాహ్మణస్త్రీ అయిదుమానికెల బియ్యము చలిమిడిచేసి నైవేద్యము పెట్టెను. అతడవితి- ఆమె భాగ్యము చెరుప నాతరము కాదని మరింత భాగ్యమిచ్చి వెళ్లెను. తరువాత సూర్యుని పంపగా నాతనిచూచి యాస్త్రీ అయిదుమానికెల బియ్యము పరమాన్నమువండి నైవేద్యము పెట్టెను. అతడది యారగించి ఆమెకింకను భాగ్యమిచ్చి చక్కాబోయెను. తరువాత నెవరిని వెళ్లమన్న- మావల్లకాదు, నీవే వెళ్లమమనిరి. అప్పుడు పార్వతీదేవి స్వయముగా బయలుదేరివెళ్లగా నామెనుచూచి ఆ బ్రాహ్మణస్త్రీ మిక్కిలి భక్తిశ్రద్ధలతో అయిదుమానికల బియ్యము పులగమువండి నేయి బెల్లముతో నైవేద్యము పెట్టెను. ఆమె అది తిని కోపముపోయినదై-"అమ్మా! మొదట నీమీద నాకు కోపమువచ్చి నీ భాగ్యము తీసివేయుము కందరిని పంపినాను. వారందిరికి అన్నీ చేసిపెట్టినావు. అందుచేత నీభాగ్యము మరింత వృద్ధిఅయినది. అందుచేత నాకు కూడా సంతోషము వచ్చినది. ఈనోము పట్టి కథచెప్పి అక్షతలువేసి కొని తొమ్మిది దినుసులు మిగలకుండా ఉద్యాపన చేసికొన్న యెడల సకల భాగ్యములు కలుగునని పార్వతీదేవి యదృశ్యమయ్యెను.

**ఉద్యాపన :** అయిదుమానికల పెసరపప్పు బిందెతో అత్తెసరుపెట్టి అయిదు మూళ్ల అంగవస్త్రము చుట్టపెట్టి బంగారపు నందిని చేయించి అయిదు డబ్బులు దక్షిణతాంబూలములతో పడకవేసి నందిమోహపు పెండ్లికొడుకునకు అందియ వలయును. కథలోపమయినను వ్రతలోపము కాకూడదు. భక్తి తప్పినను ఫలము తప్పదు.

ప్రథమ భాగము - సంపూర్ణము





బాలాంత్రపు వేంకటరావు వారి

ప్రాచీన

# స్త్రీల వ్రతకథలు

## ద్వితీయ భాగము

### 1. గాజుల గౌరీదేవి కథ

ఒక బ్రాహ్మణుని కోడలు గాజులగౌరీదేవి నోముపట్టి ఉల్లంఘనము చేసెను. అందుచేత ఆమెనిచూచి అంతా చిటచిట లాడుచుండేవారు, ఇరుగు చిటచిట-పొరుగు చిటచిట-అత్త చిటచిట మామ చిటచిట మగడు చిటచిట. ఎదురుచూస్తే వారే యిలాగున్నారని ఆ చిన్నది విచారించుచు, అడవిలోనికిపోయి తిరుగుచుండెను. అంతట పార్వతీ పరమేశ్వరులు భూమి పాలించుటకువచ్చి ఆ చిన్నదానిని చూచి- "ఏమిఅలాగు విచారించుచు తిరుగుచున్నావ"ని యడిగిరి. అందుకామె 'యిరుగు పొరుగు, అత్తమామ, మగడు నన్నుచూస్తే కోపంగా వుంటారు. అందుచేత నందరికి కోపమైతే యెట్లు బ్రతకనని ఇలా తిరుగుచున్నానని చెప్పెను. అలాగు కాదమ్మా! నీవు గాజుల గౌరీనోము పట్టి ఉల్లంఘనము చేసినావు. ఆ కారణమున నిన్ను జూచిన అందరు కోపంగా నున్నది. నీవు తిరిగి ఆ నోముపట్టి ఉద్యాపనము చేసుకుంటే నిన్ను అంతా ప్రేమతో చూస్తారు అని పార్వతీదేవి చెప్పెను. ఆ ప్రకారం అమె యింటికివెళ్ళి ఆ నోము నోచుకొని యధావిధిగ యుద్యాపనము చేసికొనగా, అప్పటినుండి ఆమె అందరికి యిష్టము కలదయ్యెను.

**ఉద్యాపనము :** ఒక ముత్తయిదువును తీసుకొనివచ్చి ఆమెకు యిష్టమైన గాజులు తొడిగించి, తలంటి నీళ్లుపోసి, చీర రవికెలగుడ్డ యిచ్చి పిండివంటలతో భోజనము పెట్టవలెను. భక్తి తప్పినా ఫలముతప్పదు. కథలోపమైనను వ్రతలోపము కాకూడదు.

# 2. గ్రహణ గౌరీ నోము కథ

ఒక బ్రాహ్మణునకు నలుగురు కొడుకులును, ఒక కూతురు కలరు. ఆకూతురు పుట్టినరోజు మొదలుకొని రాత్రి పురుగులుగాను పగలు మనిషిగాను అగుచుండేది. రాత్రివేళ తల్లి ఆ పురుగులను పోగుచేసికొని విచారించుచుండేది. అలాగునుండగా కొన్నాళ్ళకు ఆ పిల్ల తల్లిని పుట్టింటికీ తీసుకొనివెళ్లు నిమిత్తము అన్నగారువచ్చి-"అమ్మా! యీ పిల్లకు ఏడాది వెళ్లినది. గనుక ఒకసారి పుట్టింటికి రమ్మని పిలిచెను. ఆమె 'యిప్పుడుకాదు ముందువస్తాను' అని చెప్పెను. ఆ మాటలువిని అతడు వెళ్లిపోయెను. తరువాత నాలుగేండ్లు అయిన పిమ్మట మరల అన్నవచ్చి-"అమ్మాయీ! రమ్మన"ని పిలువగ ఇప్పుడు కాదు వస్తానులే! అని జవాబు చెప్పెను. ఆ మాటలకు సరే యని అతడు వెళ్లిపోయెను. ఆ పిల్ల పెద్దదైనకొద్దీ, పురుగులు ఎక్కువ కాజొచ్చెను. ఆ పురుగులను రాత్రి తల్లి జాగ్రత్తగా కాపాడుచుండెను. అంతట ఆ పిల్లలకు పది సంవత్సరములు ఈడువచ్చెను. అప్పుడు తిరుగా అన్నగారువచ్చి-'ఇప్పుడైనా నీవు వచ్చినగాని లేని యెడల నీకు మేలులేము, మాకు నీవులేవు' అని గట్టి పట్టుచేయగా ఆమె మరోమాట చెప్పలేక కోడండ్రువద్దకు వెళ్లి నాలుగురోజులు పిల్లను చూచుచెండెదరా? అని అడిగినదట. వారు 'మావల్లకాదని'రి. అప్పుడు నాలుగోకోడలు-నేను చూచెదను. మీరు వెళ్లిరండ'ని చెప్పెను. ఆ బ్రాహ్మణునిభార్య నాలుగో కోడలిని తలుపుచాటునకు తీసుకొనిపోయి-"పగలస్తమానముపిల్ల, రాత్రి పురుగులును, రాత్రి మాత్రము ఆ పురుగులను చెదరకుండా క్రింద గుంటతీసి దీపము పెట్టుకొనినది మొదలు జాగ్రత్తగా గుంటలోనికి పోగుచేసుకొని ఒక పురుగైనాపోకుండా చూడ వలయునమ్మా!" అని చెప్పి కూతురు నామెకప్పగించి పుట్టింటికి వెడలెను. అంత దీపాలు పెట్టేసరికి వంటచేసి మామగారికి భర్తకు భోజనముపెట్టి ఆపిల్లను గుంటవద్ద చాపవేసి పరుండబెట్టి నాలుగవకోడలా పిల్లవద్ద పరుండెను. తరువాత ఆ పిల్ల పురుగులగు చుండగా వాటినన్నింటిని గుంటలోకిత్రోసి తెల్లవారినదాక జూచుచుండెను. అంతట ఆమెభర్త-"ఇది నాయొద్దకు రావడములేదు. ఎక్కడికోపోవుచున్నది" అని అనుమానపడి మూడురోజులైన తరువాత నాలుగోరోజున దీపాలు పెట్టగానే భోజనముచేసి ఆ చిన్నది పడుకొనేగది గోడమీద కూర్చుండెను. అంతట ఆమె భోజనముచేసి మామూలు ప్రకారము ఆ పిల్లను కనిపెట్టుకొని కూర్చుండెను. ఆ రాత్రి చర్య అంతయు గోడమీదనుండి యా బ్రాహ్మణ చిన్నవాడుచూచి తెల్లవారిన తరువాత దిగివచ్చి 'అయ్యో! నా చెల్లెలు ఇంత కష్టపడుచున్నది. ఇదియేమి?' అని భార్యనడగ 'నాలుగురోజులనుంచి యేమిచేస్తున్నావు? నాకు కనబడడంలేదేమి?' అని కోపపడెను. ఈలాంటి పని మీ అమ్మ నాకు అప్పచెప్పినది. అందుచేత కనిపెట్టుకొని యుండవలసివచ్చినది యని యామె చెప్పగా-'ఈదురవస్థ యీామెకు ఎందుచేతవచ్చెనో! అని విచారముపొంది అడవిలోనికి ఆకుమీద ఆకు పోకచెక్క పోక వేసికొని తలక్రింద కాళ్లుమీదు పెట్టుకొని తపస్సుచేయమొదలు పెట్టెను.

అంతట అక్కడికి పార్వతీపరమేశ్వరులు భూమిపాలించు నిమిత్తమైవచ్చి 'యీ సమీపమున మనిషి సంచారము కలిగియున్నట్లు కనబడుచున్నది. జూడవలెన'ని పార్వతీదేవి ఈశ్వరుని అడిగెను" ఆడవాళ్ళతో ఇదేమిచిక్కువద్దు వెళ్లవద్దు అని ఈశ్వరుడు చెప్పగా- 'అలాకాదు జూడవలయును' అని పార్వతీదేవి భర్తను తీసికొని వెళ్లి తపస్సు చేయుచున్న యా బ్రాహ్మణ చిన్నవానిని జూచెను. అట్లుజూచి-'ఏమి అబ్బాయి! యిలాతపస్సు చేయుచున్నావు?' అని యడిగెను. అందుకా బ్రాహ్మణ చిన్నవాడు 'మీరేమి ఆర్చేవారా, తీర్చేవారా! మీకెందుకు? వెళ్లవలసినదని జవాబు చెప్పగా-"అలాకాదు నాయనా! ఆర్చేడివారము మేమే, తీర్చేడివారము మేమే చెప్పవలసినద"ని పార్వతీ పరమేశ్వరులు అడిగిరి. "మాచెల్లెలు పుట్టినది మొదలు పగలు మనిషి. రాత్రి పురుగులుగాను అగుచున్నది అది ఎందుచేతనో తెలుసుకొనగోరి యట్లు తపస్సు చేయుచున్నాన"ని ఆ బ్రాహ్మణచిన్నవాడు చెప్పెను. అప్పుడు పార్వతీ పరమేశ్వరులు దివ్యదృష్టిజూచి "మీ చెల్లెలు క్రిందటి జన్మము రజస్వలై యింటిలో కలిపింది. ఆ దోషముచేత యిలావచ్చినది. కాబట్టి ఆమెచే గ్రహణగౌరీనోము పట్టించి క్రమప్రకారము యుద్యాపనము చేయించిన యెడల దోషము పోవునని చెప్పి యదృశ్యులైరి. అప్పుడా బ్రాహ్మణ చిన్నవాడింటికి వచ్చి పార్వతీపరమేశ్వరులు చెప్పిన గ్రహణ గౌరీనోము చెల్లిలిచేత పట్టించి ఉద్యాపనము చేయించెను. అంతట ఆ పాపముపోయి ఆ పిల్ల రాత్రి పగలు ఎప్పటిలాగుండెను. తరువాత తల్లివచ్చి పిల్ల రత్నములాగున నుండుటజూచి మునుపటి చిహ్నము లేమీ లేకపోవుటకు సంతోషించుచు 'ఏమిటి అమ్మాయి! ఎలాపోయిందా పురుగులగుట్ట?' యిన కోడలిని యడిగెను. అప్పుడు చిన్నకోడలు అత్తగారు వెళ్ళినది మొదలు భర్తతనమీద యనుమానపడుట, యడవికి వెళ్ళుట గ్రహణగౌరీనోము పట్టించుట, మొదలగు సంగతులన్నీ పూసగుచ్చినట్లు చెప్పి- 'ఇది గ్రహణగౌరీనోము పట్టుటచేత పోయినది ఇదిగో మీ అమ్మాయి!' యిన ఆ పిల్లను అత్తగారి కప్పగించెను.

**ఉద్యాపనము :** సూర్యగ్రహణము పట్టిపట్టెననగా పసుపు కుంకుమ, పిండి, బియ్యము, ప్రత్తి, బెల్లము, ఆకు, పోక దక్షిణంతో పంటిలోపెట్టి విడిచీవిడచెననగా ఇంటిలోపెట్టి సూర్యగ్రహమునాడు కథచెప్పి అక్షతలు వేసికొని తొమ్మిదిరోజులు తొమ్మిది పద్మములు తొమ్మిది వత్తులదీపము, తొమ్మిది అట్లుతోవాయనము, తొమ్మిదిఅట్లు నైవేద్యము కొత్తజల్లిడిలో పెట్టి మూతవేసి చీర, రవికెలగుడ్డ పెట్టి ఒక ముత్తయిదువునకు వాయనమీయవలెను.

## 3. పోలి స్వర్గమునకువెళ్లు కథ

అనగనగా ఒక చాకలిది. దానికి నలుగురు కొడుకులు, నలుగురు కోడల్లు కలరు. ఆ చాకలికి ముగ్గురు కోడండ్రు, తాను ప్రతిరోజు కార్తీకమాసములో ఆశ్వయుజ బహుళ అమావాస్య మొదలు యుదయము కాకుండా స్నానము చేసికొని,

దీపముపెట్టి నెలరోజులాా తీరుగ జరిపెను. తరువాత కార్తీక బహుళ అమావాస్యనాడు తెల్లవారుజామునలేచి కడసారపు కోడలతో 'మేము స్నానమునకు వెళ్ళుచున్నాము. మేము వచ్చేవకు యింటివద్ద జాగ్రత్తగా నుండవలసినద'నిచెప్పి చాకలిది, ముగ్గురు కోడండ్రు స్నానమునకు వెళ్ళిరి. అప్పుడు చిన్నకోడలులేచి చల్లచేసి కవ్వమును అంటియున్న వెన్న ఊచ్చుకొని ప్రత్తిచెట్టు క్రిందపడియున్న ఒక ప్రత్తికాడ తెచ్చుకొని నూతివద్ద స్నానముచేసి దీపము వెలిగించుకొని అత్తగారు రాకుండా ఆదీపము మీద చాకలిబాన మూత వేసెను. అప్పుడు దానికి ఆకాశమునుండి విమానము వచ్చెను. అది విమానమునెక్కి బొందెతో గూడ స్వర్గమునకు చక్కా వెళ్లుచుండెను. ఈ వెళ్ళడము యేటియొడ్డున దీపములు పెట్టుకొనుచున్న వాళ్ళందరుజూచి– 'చాకలిపోలి స్వర్గమునకు వెళ్లుచున్నది. చాకలిపోలి స్వర్గమునకు వెడలుచున్నది. అని అందరు ఆశ్చర్యపడసాగిరి. అంత మాకోడలేమిటి! స్వర్గమునకు వెళ్లడమేమిటి? అని చాకలిది, దాని ముగ్గురు కోడండ్రును ఆశ్చర్యముతో జూచిరి. అలాజూచి ఆ విమానము మీదనుండి వెళ్లేదాని కాళ్లునలుగురు పట్టుకొనిరి. అప్పుడు విష్ణుమూర్తివచ్చి ఈ కోడలిని వదలిపెట్టి వాళ్లను నలుగురను పట్టుకొని "అశ్రద్ధగా భక్తిలేకుండా దీపాలు పెట్టుకున్నారు. ఇది శ్రద్ధాభక్తులతో పెట్టుకుంది. కాబట్టి దీనికి బొందితో స్వర్గమునిచ్చినాను. మీరు అడవులపాలై పోవలసినద'ని శాపము పెట్టి చక్కాపోయెను. ఈ కథ చెప్పి అక్షతలు వేసికోవలయును.

## 4. పోలాలమావాస్య కథ

ఒక బ్రాహ్మణునకు యేడుగురు కొడుకులు, ఏడుగురు కోడండ్రు కలరు. ఏడుగురు కోడండ్రు పోలాలమావాస్య నోము నోచుకుందామని యత్నము చేసికొనిరి. అంతట కడసారపు కోడలికి అమావాస్య రోజున ఒకపిల్ల చచ్చిపోయెను. ఆకారణము చేత ఆయేటికి ఆ నోము అంతామానివేసిరి. అదిమొదలు ప్రతిసంవత్సరము వీళ్లంతా నోము నోచుకుందామని యత్నము చేయుచుండుటయు, అమావాస్య వచ్చేసరికి కడసారపు కోడలికి పుట్టినపిల్ల చచ్చిపోవుచుండెను. ఇట్లు ఏడేళ్లు అయిన తరువాత– "యేటేట మాకడసారపుదానికి పుట్ట, చావ" అని తిట్టుకుటూ కోడండ్రంతా మళ్లీ యత్నము చేసికొనిరి. అమావాస్య వచ్చేసరికి సరిగా కడసారపు కోడలికి ఒక పిల్లపుట్టి మళ్లీచచ్చిపోయెను. అంతా తిట్టి పోతారని చెప్పి చచ్చిపోయిన పిల్లను ఇంటిలో పెట్టి తాలము వేసికొని కడసారపుకోడలు అందరి తోడకోండ్రయింటికి వెళ్లెను. అందరికి తలాయొక పని సాయముచేసెను. తరువాత ఒకరియింటిలో తలంటి నీళ్లుపోసి, మరియొక యింటిలో పిండి పప్పు మొదలయినవి తెచ్చుకొని యింటికివచ్చి చచ్చినపిల్లను యింటిలో పెట్టుకొని తాను కూడా నోము నోచుకొనెను. ఆ ఆరాత్రిదాకా వుండి చీకటిలో చచ్చినపిల్లను భుజముమీదను వేసికొని పోలేరమ్మ గుడివద్దకు వెళ్ళి ఆ పిల్లను అక్కడ పెట్టి యేడ్చుచు కూర్చుండెను. ఇంతలో అమ్మవారు గ్రామ

సంచారము వెళ్లి గుడివద్దకువచ్చి ఏడ్చుచున్న యా చిన్నదానినిచూచి "ఏమమ్మా ఇలా ఏడ్చుచున్నా"వని అడిగెను. అందుకా చిన్నది "యేడేండ్ల నుండి యేడుగురు పిల్లలను ఈ అమ్మవారికి అప్పగించుచున్నాను. ఈయేడు కూడా ఈ పిల్ల చచ్చి పోయింది. తోటికోడండ్రు తిట్టిపోతారని ప్రొద్దుటి నుంచి దాచి ఇపుడు తీసికొనివచ్చి ఇక్కడ పడకవేసి ఏడ్చుచున్నానని చెప్పెను. అప్పుడు అమ్మవారు కరుణించి– 'పిల్లలకు మరేమి భయంలేదు. నేను తీసికొనివచ్చి యిస్తాన'ని చెప్పి అక్షతలు ఆచిన్నదాని చేతులోబోసి 'నీవు నీపిల్లలను పాతిపెట్టిన చోటికివెళ్లి పిలువమని చెప్పెను. ఆమె ఆ ప్రకారము అవి పుచ్చుకొని ఆ అక్షతలు చల్లి "అందెలాడరారా! మువ్వలాడరారా! అని వరుసగా ఏడుగురిని పిలువగా అందరు వరుసగా లేచి చక్కావచ్చిరి. ఆమె సంతోషముతో ఆ పిల్లలను తీసుకొని యింటకి వెళ్లెను. తెల్లవారిన తరువాత అందరూ చూచిన 'అయ్యో! ఇదేటమ్మా! ఈ పిల్ల లెక్కడనుండి వచ్చినార'ని యడిగిరి. ఆ చిన్నది వారందరితోను తాను రాత్రిచేసిన పనులుచెప్పి– పోలేరమ్మ దయవలన వీరు బ్రతికి వచ్చినారని చెప్పెను. అంతట నుంచి ప్రతిసంవత్సరము ఈ యమా వాస్యను తప్పక నోము నోచుకొని అందరు ఈకథ చెప్పి అక్షతలు వేసుకొనుచుండిరి. అందుకా అమ్మవారు సంతోషించి సంతానము లేనివారికి సంతానము, సంతానము కలవారికి కడుపుచలవ యిచ్చి రక్షించెను.

దీనికి ఉద్యాసనము లేదు.

## 5. కరుళ్ళ గౌరీదేవి కథ

ఒక బ్రాహ్మణునకు అయిదుగురు కొడుకులు కలరు. ఆ అయిదుగురు కొడుకులకు పెండ్లి అయి అయిదుగురు కోడండ్రు కాపురమునకు వచ్చిరి. అందులో అయిదవకోడలు కరుళ్లగౌరీదేవి నోము పట్టినది. అంతాకూడా వేసి వెయ్యకుండా భాగ్యముతోనుండిరి. అలావుంది. 'అత్త సొమ్మొద్దు మామ సొమ్మొద్దు, పుత్రి సొమ్మొద్దు, పురుషసొమ్మొద్దు, నా సొమ్మే నాకిమ్మ'ని సూర్యదేవుని ప్రార్థించి ఆమెరోజూ నమస్కార ములు చేసేది. అట్లు నమస్కారములు చేసిన కొంతకాలమునకు అత్తకు మామకు, బావకు మరదలకు, భర్తకు ఎల్లవారికి ఆమెమీద కోపంగా వుండేది. ఒకరోజున పడుకొని నిద్రపోవుచుండగా మంచముతోపాటు దీసుకొనిపోయి మహారణ్యములో పారవేసిరి. ఆమె కొంతసేపటికి నిద్రమేలుకొని ఆ యడవిలోనే నీళ్ళు పోసుకొని సూర్యభగవాను నకు నమస్కారము చేయుచుండగా ఆమె దోసిటిలోనికి నిండుగా వరహాలు వచ్చెను. ఆమె అవి తీసుకొని సమీప పల్లెకేగి పసుపు, కుంకుమ, గిన్నె ఉప్పు, మిరపకాయ, బియ్యము మొదలగు యావత్తు సామాగ్రిని కొని ఒక గొల్లముసలివాని సహాయమున నొక గుడిసెలో నివసించుచుండెను. యింటివద్దనున్న వారికందరికి అష్టదరిద్రము పట్టుకొని నానాస్థలములు తిరుగుచు తినుటకు తిండి, కట్ట గుడ్డయులేక బాధపడుచు ఒకరోజున కట్టెపుల్లల నిమిత్తము యా యడవిలోనికి

వచ్చిరి. అట్లు వచ్చి తమకు సమీపములో నొకచోట సూర్యనమస్కారములు చేయుచున్న యా చిన్నదానిని చూచి తక్కిన కోడండ్రంతా 'ఇదిగో! మా తోటికోడలు ఈలాగే సూర్యనమస్కారములు చేయుచుండేది' అని తమవారితో చెప్పసాగిరి. సూర్యప్రభావమువల్ల అడవిలోనున్న చిన్నది డబ్బుకలదై మేడలు, మిద్దెలు, తోటలు, దొడ్లు కట్టించి అరిదేశి పరదేశి వస్తే అడ్డములేకుండా అన్నము పెట్టుచుండేది. ఆ సమయమునందు ఆమె అత్తా మామ లక్కడకువచ్చి- 'మాకింత అన్నం పెట్టించదవా?' యని యడిగిరి. అప్పుడు అత్తమామ యని ఆమె గ్రహించి 'నామామగారు అత్తగారు మీలాగే వుండేవారు. మీదేవూరు? మీ రెవరని అడిగెను. అందుకు వారు- 'మేము ఫలానా!' అని చెప్పిరి. అంతలో పెనిమిటివచ్చెను. వారి ముగ్గురికి తలంటి నీళ్లుపోయించి వారికి సకలోపచారములు చేయుచు పదమూడు కరుళ్ళు కంచములోపెట్టి క్రొత్త కంచముకొని చీర, రవికెలగుడ్డ కరుళ్ళు పెట్టుకొని ఉద్యాపనముచేసికొనెను. ఏడాది అయిన తరువాత చీర, రవిక, పదమూడు కరుళ్ళు క్రొత్తకంచములోబెట్టి ఉద్యాపనము చేసుకొనవలెను. కథలోప మైనను వ్రతలోపము కాకూడదు. భక్తి తప్పినా ఫలము తప్పదు.

## 6. నిత్యశృంగారము కథ

రాజుభార్య, మంత్రిభార్య నిత్యశృంగారము నోముపట్టిరి. రాజు భార్య నౌకరులచేత తాంబూలము బొట్టు పెట్టించుచుండెను. మంత్రిభార్య యట్లుగాక తానే స్వయముగా బొట్టుపెట్టి తాంబూలము నిచ్చు చుండేది. ఇలాగున నివ్వగా నీమెకు కదుభాగ్య మబ్బినది. రాజు భార్యకు అశ్రద్ధగా నివ్వడముచేత దరిద్రము సంభవించెను. అందువలన నామె యొకనాడు మిక్కిలి దుఃఖించుచు కూర్చుండెను. ఇట్లుండగా పార్వతీపరమేశ్వరులామెకు ప్రత్యక్షమై 'ఎందుకేడ్చు చున్నావమ్మా?' యని యడిగిరి. 'ఆర్చేడివారా, తీర్చేడివారా, మీకెందుకు? వెళ్ళండి. యని యామె వారితో ననెను. అంతటవారు 'అలాగుకాదు, ఆర్చేడి వారము మేమే, తీర్చేడివారము మేమే, దుఃఖకారణమేమో చెప్పవలసినదని యడిగినారు. 'మంత్రిభార్యయు నేను నోము పట్టినాము. ఆమెకు భాగ్యము వచ్చినది. నాకు దరిద్రము వచ్చినది. ఎందుచేత నాకి దరిద్రము వచ్చినదో తెలియక దుఃఖించుచున్నాను'అని యామె చెప్పెను. నీవు దాసీ జనంబుచే వ్రతకృత్యమును జరిపించినావు అందుచేత నీకు దరిద్రము వచ్చినది. మంత్రిభార్య నీవలెగాక తానే స్వయముగా చేయుటచేత నామెకు భాగ్యము లభించెను. శ్రద్ధగా తిరిగి యీ నోముపట్టి కథ చెప్పుకొని అక్షతలు వేసికొని ఏడాది పొడుగునా తాంబూలమిచ్చుకుంటే సిరిసంపద నీకు వచ్చునని చెప్పి ఆ పురాతన దంపతు లదృశ్యులైరి. అప్పుడీ నోముపట్టి ఏడాది కథచెప్పుకొని అక్షతలు శ్రద్ధగా వేసుకొని రోజును ముత్తయిదువులకు బొట్టుపెట్టి తాంబూలమిచ్చి అద్దము, దువ్వెన జూపించి ఏడాది అయిన తరువాత నామె యుద్యాపనము చేసికొని సిరిసంపదలను బడసెను.

**ఉద్యాపనము :** ఒక ముత్తయిదువునకు తలంటి నీళ్లుపోసి చీర, రవిక యిచ్చి భోజనము పెట్టి బొట్టుపెట్టి అద్దము, దువ్వెన, కాటుక, కాయ, కుంకుమభరిణీ, సవరము, గంధపుచెక్కయిచ్చి యుద్యాపనము చేసుకొనవలెను.

## 7. ఉదయకుంకుమ నోము కథ

ఉదయ కుంకుమనోముపట్టిన ఆవిడయున్న పట్టణము వెదకినను విధవలేదు.

**ఉద్యాపనము :** ఒక ముత్తయిదువునకు తెల్లవారకుండా తలయంటి నీరుపోసి తానును తలయంటుకొని నీళ్ళుపోసికొని చీర, రవికెల గుడ్డయు ఆ ముత్తయిదువున కిచ్చి పిండివంటలతో భోజనముపెట్టి కుంకుమభరిణి దక్షిణ తాంబూలము లొసంగి యుద్యాపన చేసుకొనవలయును.

## 8. కుంకుమగౌరీ నోము కథ

సోమయాజులుగారి కూతురు కుంకుమగౌరీనోముపట్టి ఉల్లంఘున చేసినది. అందువలన చిన్నతనములోనే విధవరికము వచ్చినది. తల్లి దండ్రులు ఈ చిన్నదానిని తీసుకొని కాశీపట్టణమునకు వెళ్లిరి అక్కడికి వెళ్ళినను ఆ చిన్నదాని విధవరికంపోలేదు. ఒకనాడు చిన్నదాని తండ్రి గంగయొడ్డున కూర్చుని తపస్సు గావించుచుండ ఈశ్వరుం డాయనకు ప్రత్యక్షమై-'ఏమి బ్రాహ్మణుడా! ఇట్లు కూర్చున్నావు?' అని యడిగెను. అప్పుడా బ్రాహ్మణుడు-నాకు లేక లేక యొక కూతురు గలిగెను. ఆ చిన్నదానికి వివాహము గావించితిని. వివాహమయిన నెలరోజులకు ఆమెకు విధవరికము సంభ వించినది. ఆకష్టమును సహింపనోపక కుటుంబ సహితముగా నీ పట్టణము వచ్చినాను' అనిచెప్పినాడు 'అయ్యో! నీ కూతురు క్రిందటి జన్మమున కుంకుమ గౌరీ నోముపట్టి ఉల్లంఘున చేసినందున బాల్యదశయందే విధవరికము సంభవించి నది' అని పరమేశ్వరుడు దయారసంబు తనమోమున తొలుకాడుచుండ బలికెను. అప్పుడు బ్రాహ్మణుడు 'అయ్యో! ఇప్పుడేమి యొనర్చిన నీకష్టము తొలగునో యానతీయ వలయున'ని యా పరమేశ్వరుని ప్రార్థించెను. 'ఇప్పుడు తిరిగి యీ నోముపట్టి యుద్యాపన చేసినచో యీ కష్టము పోవున'ని యా ఈశ్వరు డానతిచ్చి యదృశ్యు డయ్యెను. అప్పుడా ప్రకారము చిన్నదానిచే నోముపట్టించి యుద్యాపనము చేయిం చెను.

**ఉద్యాపనము :** పదముగ్గురు ముత్తయిదువులకు బరిణెనిండుగా కుంకుమపోసి నల్లపూసలు, లక్కజోడుపెట్టి దక్షణ తాంబూలమిచ్చి పదముగ్గురు మత్తుయిదువులకు పదమూడు బరిణెలు యివ్వవలెను.

## 9. చిక్కుళ్ళ గౌరీ నోము కథ

చిక్కి చిక్కినను చిక్కుళ్ళ గౌరీనోముపట్టి మాఘ పూర్ణిమ ముందర వచ్చెడు రథసప్తమినాడు కథచెప్పి యక్షతలు వేసుకొని- 'ఎత్తుకొన్న బిడ్డ లెడబాయకుండ, చంటిబిడ్డ సడలకుండ, పక్కలోబిడ్డ బాయకుండ, కంటికాటుక కదలకుండ, చేతిగాజులు చెదరకుండ, కాలి మట్టుకదలకుండ, కట్టినబట్ట విడువకుండా, తొడిగిన రవిక తొడగకుండా, వంటిసొమ్ము వదలకుండా వెంటపురుషుడు ఎడబాయకుండా వుండవనెనమ్మా! వెండి చిక్కుళ్ళు పయిడి చిక్కుళ్ళు నేను పంచి పెట్టెదను. చిక్కుళ్ళగౌరీదేవి తల్లీ ! చింతలేకుండా సిరిసంపదనిమ్ము అని కథ చెప్ప యక్షతలు వేసుకొనవలెను.

**ఉద్యాపనము :** ఒక బంగారు చిక్కుడుపూవు చేయించి చీర రవికెలగుడ్డ యిచ్చి దక్షిణ తాంబూలముంచి ఒక ముత్తయిదువునకు పిండివంటలతో భోజనము పెట్టి పైన చెప్పిన బంగారపు చిక్కుడు పూవు చీర, రవికెలగుడ్డ దక్షణ తాంబూలముతో వాయనమియ్యవలెను.

## 10. తవుడు గౌరీ నోము కథ

తవుడు గౌరీనోము పట్టిన సఖియలు తల్లితండ్రి అత్తమామ ఏవేళ నెడబాయకుండా నుండెడివారు,తల్లి, తండ్రి, అత్త, మామకూడా యెడబాయకుండ వున్నారు-"నీవు ఏమి నోము పట్టినావమ్మా! యని అందరు అడిగినారు. 'ఏమిలేదమ్మా! క్రిందటి జన్మమున మాయమ్మ తవుడు గౌరీనోముపట్టి యుద్యాపనము చేసికొన్నది. అందుకున్న ఫలమేగాని పట్టినట్టి ఫలముగాదు అని చెప్పెను. అందుకుంటేనే ఇంత ఫలము కలిగెను, పట్టినట్లయిన నెంతఫలమువచ్చునో అని కలియుగమందు తవుడు గౌరీనోముపట్టి ఉద్యాపనము చేసుకొన్నారు.

**ఉద్యాపనము :** తవ్వనిండా బియ్యంపోసి పయిన తవుడుపోసి శక్తియుంటే చీరనుంచి లేకపోయిన రవికెలగుడ్డ దక్షణ తాంబూల ముంచి యుద్యాపనము చేసు కొనవలెను.

## 11. శోకదానము నోము కథ

రాజుభార్యము, మంత్రిభార్యయు శోకదానము నోముపట్టిరి. రాజుభార్య 'యన్ని ఒక్కమారే ఇచ్చెదన'ని ఊరుకున్నదట మంత్రిభార్య తోటకూర మడివేసి రోజూ ఒక బ్రాహ్మణునకు ఒక డబ్బు ఒకకట్ట తోటకూర యిచ్చుచుండెను. ఈ ప్రకారము ఏడాదియిచ్చెను. ఇట్లు యిచ్చుటవల్ల కడుపుశోకములేకుండ సిరిసంపద లతో మంత్రిభార్య సుఖముగా నుండెను. రాజు భార్య-'ఎప్పుడో చేయుదున'ని

యూరకున్నందువలన శోకము ఎక్కువయినదట. ఆశోకము భరించలేక యడవిలోనికి బోయి ఒకచోట ఏడ్చుచు కూర్చుండియుండగా పార్వతీ పరమేశ్వరులు భూమి పాలించు నిమిత్తమైవచ్చి-"ఏమి అమ్మా! ఇలాఏడ్చెదవ"ని యడిగిరి. "ఏమీలేదు. అస్తమానమూ నాకు ఏడువవలెన"ని బుద్ధి అందుచేత యిలా యేడ్చుచున్నాను" అని చెప్పెను. అందుకు వారు-'అలాకాదమ్మా! నీవు శోకదానము నోముపట్టి తిన్నగా యిచ్చినావుకావు. అందుచేత నీకు శోకము వచ్చినది. ఇప్పుడు మళ్ళీ యింటికి వెళ్ళి ఈ నోముపట్టి మరచిపోకుండా నిత్యమును ఒక డబ్బు, కూర బ్రాహ్మణునకు తప్పకుండా దానమిచ్చిన యెడల ఈ శోకము పోవునని చెప్పి యదృశ్యులైరి. అప్పుడామె యింటికివచ్చి నిత్యమూ ఒక డబ్బు ఒక కూర ఒక బ్రాహ్మణునకు దానమిచ్చుచుండెను. అది లగాయితు ఆమె శోకముపోయి సిరిసంపదకలిగి సుఖముగా నుండెను. అప్పుడంతా 'యేమి నోము పట్టినావు? యేమి నోము పట్టినావు శోకము పోవుటకు? యని యడుగగా ఆమె 'శోకదానము నోము పట్టినాన'ని చెప్పెను. అప్పుడంతా ఆ నోముపట్టి ఉద్యాపనము చేసికొనిరి.

ఉద్యాపనము : తోటకూర మడిచల్లి బ్రాహ్మణునికి తలంటి నీళ్లుపోసి జామారుయిచ్చి పదమూడు డబ్బులు దక్షిణయిచ్చి తోటకూర ఆ బ్రాహ్మణునకు వాయనము యియ్యవలయును. కథ లోపమైనను వ్రతలోపము కాకూడదు. భక్తి తప్పినను ఫలము తప్పదు.

## 12. చద్దికూటి మంగళవారము కథ

ఒక రాజుకూతురు బ్రాహ్మణునికూతురు చద్దికూటి మంగళవారము నోము పట్టిరి. బ్రాహ్మణుని కూతురు వారంవారం ముత్తయిదువను పెట్టుకొని తొలినాడు అస్తమయవేళ కూర, పప్పు, చారు, అన్నం వండి మూతపెట్టుకొని ప్రొద్దున్నే వంటిమీద నీళ్లుపోసుకొని కథ చెప్పి అక్షతలు వేసుకొని ముత్తయిదువకు పెట్టి తాను తిని ముత్తయిదువులకు దక్షిణ తాంబూలము యిచ్చెను. అలా యేడాది అయిన తరువాత పదముగ్గురు పేరంటాండ్రకు యథావిధిగా దక్షిణ తాంబూలములిచ్చి ఉద్యాపనము చేసికొనెను. రాజు కూతురికి దరిద్రము వచ్చెను. ఆమె దరిద్రమును భరింపజాలక అడవికివెళ్ళి తిరుగుచుండగా పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమై 'ఏమమ్మా! ఇలా వచ్చినావు? అని యడిగిరి. తినుటకు అన్నము, కట్టుటకు బట్టలేక దరిద్రముచే బాధపడుచు ఈలాగువచ్చినాని ఆమె చెప్పెను. అప్పుడు పార్వతీ పరమేశ్వరులు నీవు చద్దికూటి మంగళవారముల నోముపట్టి యది యుల్లంఘన చేసినావు. ఆ కారణముచేత నీకీ దరిద్రబాధ సంభవించినది. నీవు తిరిగి యింటికి వెళ్లి ఆ నోముపట్టి యథావిధిగ ఉద్యాపనము చేసికొన్న యెడల నీ బాధ పోవునని చెప్పి యదృశ్యులైరి. అప్పుడామె యింటికివెళ్ళి నోముపట్టి యేడాది ప్రతివారము ముత్తయిదువకు పెట్టి ఏడాది అయిన తరువాత యుద్యాపనము చేసికోగా దరిద్రబాధ పోయెను.

**ఉద్యాపనము :** పదముగ్గురు పేరంటాండ్రకు తలయంటి నీళ్ళుపోసి పదమూడు డబ్బులు, దక్షిణ తాంబూలము పదమూడు రవికల గుడ్డలు పెట్టి తొలినాడు అస్తమయమువేళ వంటచేసి మూతపెట్టి చద్దివేళ ప్రొద్దునే ముత్తయిదువులకు భోజనము పెట్టి పదమూడు మూకుళ్ళలో ఈ చద్దిపెట్టి పదముగ్గురకు వాయనము యివ్వవలయును. కథలోపమైనను, వ్రతలోపము కాకూడదు. భక్తితప్పినను ఫలము తప్పదు.

## 13. రేగుల గౌరీ కథ

ఒక రాజుభార్య రేగుల గౌరీనోముపట్టి మరచిపోయెను. ఆమెకు సంతానము లేదు. 'సంతానము లేకపోయెనుగదా!' అని విచారముతో తలగట్టుకొని పరుండెను. ఆ సమయమందు విష్ణుమూర్తి వైష్ణవుని వేషముతోవచ్చి 'ఏమి అమ్మాయీ! ఆలాగున పరుండియున్నావు? అని యడుగగా– "సంతానములేక చింతచే ఇలా పరుండి యున్నాన"ని చెప్పెను. "నీవు రేగులగౌరీ నోము పట్టి మరచిపోయినావు. అందుచేత నీకు సంతానము కలుగలేదు. ఇప్పుడైనా బంగారు రేగుపండ్లు తవ్వెన్నరసోలెడు చేయించి దక్షిణతాంబూలముతో ఒక బ్రాహ్మణునకు వాయనము యిచ్చినట్లైతే నీకు పిల్లలు పుట్టెదర'ని చెప్పి యాతడు చక్కావెళ్లెను. అంతట ఆమెలేచి అదే ప్రకారము బంగారు రేగుపండ్లు తవ్వెన్నరసోలెడు, చేయించి ఒక బ్రాహ్మణునకు వాయన మిచ్చెను. తరువాత ఆమెకు సంతానము కలిగెను. అప్పుడంతావచ్చి– 'ఏమినోము పట్టినావమ్మా! ఏమి వ్రతము చేసినావమ్మా! నీకు సంతానము కలిగినద'ని యడిగిరి. యేమీలేదు. నేనొకప్పుడు రేగులగౌరీ నోముపట్టి మరచిపోయినాను. అందుకు విష్ణుమూర్తిలా నొక బ్రాహ్మణుడు వచ్చి ఆ సంగతి చెప్పి రేగులగౌరీ నోము తిరిగి పట్టుమని చెప్పగా పట్టినాను. అందుచేత నాకు బిడ్డలు కలిగినారని యారాజు భార్య అందరితోను చెప్పెను. అప్పుడంతా ఆ నోముపట్టి యేడాది అక్షతలు వేసుకొని ఏడాది అయిన తరువాత ఉద్యాపన చేసికొనిరి.

**ఉద్యాపనము :** కుంచెడు తవ్వెడు రేగుపండ్లు తెచ్చి అందులో ఒక బంగారపు రేగుపండుచేసి బ్రాహ్మణునకు తలంటి నీళ్ళుపోసి పంచెలచాపులు యిచ్చి ఆ కుండెడు తవ్వెడు రేగిపండ్లు, బంగారపు రేగుపండుతోపాటు బ్రాహ్మణునకు వాయన మీయ వలయును. కథలోపమయినను వ్రతలోపము కాకూడదు. భక్తి తప్పినను ఫలము తప్పదు.

## 14. పండు తాంబూలము నోము కథ

ఒక రాజు భార్యయు, మంత్రిభార్యయు పండు తాంబూలము నోముపట్టిరి. మంత్రిభార్య ఏరోజు తాంబూలమారోజున యిచ్చు చుండెను. రాజుభార్య భాగ్యము చేత అన్ని ఒక్కమారే యిచ్చెదనని యూరకున్నది. రాజుభార్య నిర్లక్ష్యముచేత

సంతానము కలుగక చాల విచారము పొందుచుండెను. మంత్రిభార్య సిరిసంపదగలదై బాగుండెను. 'నాతో నోముపట్టిన ఈమెకు యిట్టి సంపద కలుగుటయేమి? నాకు లేక పోవుటయేమని' రాజుభార్య విచారముతో అడవిలోకిపోయి తపస్సు చేయ మొదలు పెట్టగా అక్కడకు పార్వతీ పరమేశ్వరులు భూమి పాలించుటకు వచ్చి-'యిది యేమ'ని యామె నడిగిరి. అప్పుడామె-'మంత్రిభార్య నేను పండుతాంబూలము నోము పట్టినాము. ఆమెకు సిరిసంపదకూడా కలిగినది. నాకులేదు. అందుచేత ఈలాగువచ్చినానని చెప్పెను. పార్వతీ పరమేశ్వరులు-'అప్పుడు నీవు భాగ్యమున్న మూలమున గర్వించి తిన్నగా యిచ్చినావుకావు. అందుచేత నీకు బిడ్డలు పుట్టినారు కారు. ఇప్పుడు తిరుగ యింటికివెళ్ళి యధావిధిగా ఆ నోము పట్టి యుద్యాపనము చేసుకొన్న యెడల నీకు సంతానము కలుగున'ని చెప్పి వారు వెడలిపోయిరి. అప్పుడామె యింటికివచ్చి పార్వతీపరమేశ్వరులు చెప్పిన ప్రకారము తిరుగ పండు తాంబూలము నోము యధావిధిగ పట్టి భక్తి శ్రద్ధలతో ఏడాది అక్షతలు వేసుకొని ఉద్యాపనము చేసుకోగా ఆమెకు అప్పుడు సంతానము కలిగెను.

**ఉద్యాపనము :** ఒక పళ్లెముకొని ఒక ముత్తయిదువకు తలంటి నీళ్లుపోసి, పిండివంటలతో భోజనముపెట్టి చీర రవికెలగుడ్డ ఇచ్చి పాతికపండ్లు తక్కువలేకుండా ఆ పళ్లెముతో ఆ ముత్తయిదువకు వాయనమీయవలయును. కథ లోపమయినను వ్రతలోపము కాకూడదు. భక్తి తప్పినను ఫలము తప్పదు.

## 15. ముని కార్తీక వ్రతము కథ

ఒక బ్రాహ్మణుని పెండ్లాము ముని కార్తీక దీపముల నోముపట్టి ఉల్లంఘున చేసెను. అందువలన ఆమెకు దరిద్రమును కడుపు శోకమును వచ్చెను. అది భరించ జాలక-'బ్రహ్మదేవుని యొద్దకువెళ్ళి వరమడిగి తెచ్చుకుంటాన'ని ఆమె బయలుదేరి వెళ్లుచుండగా త్రోవలో నొక బ్రాహ్మణుడు కనబడి-'ఎక్కడికి వెళ్లెదవమ్మా!' అని యడిగెను. 'నేను బ్రహ్మదేవుని యొద్దకు వెళ్లుచున్నాను.' అని యామె చెప్పెను. అప్పుడా బ్రాహ్మణుడు-'అమ్మా! నాదికూడా ఒక మనవియున్నది చెప్పమని' యడిగెను. 'అది యేమిటో చెప్పమని ఆమె యడుగగా- 'బదునెనిమిది జన్మములనుంచి అన్నపానములులేక ఈలాగున్నాను' అని చెప్పమని యా బ్రాహ్మణుడు చెప్పెను. 'సరే' అని యామె కొంతదూరము వెళ్లగా అక్కడ పండ్లతోనున్న ఒక ముంతమామిడి చెట్టు కనబడి-"అమ్మా! ఎక్కడికి వెళ్లుచున్నావ"ని అడిగెను. "నేను బ్రహ్మదేవుని యొద్దకువెళ్లి వరము తెచ్చుకొనుటకై పోవుచున్నా"ని యా బ్రాహ్మణి చెప్పగా- "అమ్మా! నాదికూడా ఒక మనవి వున్నది" అని యాచెట్టు చెప్పెను. "అది యేమిటో చెప్పుమ"ని యా విప్రుని భార్య యడుగగా-'మూడు పురుషాంతరములనుండి చెట్టునిండా పండి యున్నాను ఎవ్వరూ ఒక పండైనా కోసుకొనితినరు. అది యెందుచేతనో అడిగిరమ్మ'ని చెప్పను. అంతట ఆ బ్రాహ్మణుని భార్య బయలుదేరి వెళ్లుచుండగా కొంతదూరము

వెళ్లేసరికి ఒక ఆవుదూడ మొలబండి గడ్డిలో వేయకుండా నిలబడియుండి-'అమ్మా! ఎక్కడికి వెళ్లుచున్నా'ని యడిగినవి. అప్పుడా బ్రాహ్మణస్త్రీ "బ్రహ్మదేవునియొద్దకు వరములు తెచ్చుకొనే నిమిత్తము వెళ్లుచున్నాన"ని చెప్పగా అమ్మా మాది ఒక చిన్న మనవి యున్నది.న అడిగి రావలయున"ని యది చెప్పెను. 'అది యేమిట'ని యామె యడుగగా-'ఈలా నిలబడి యున్నాము. ఈ సంగతి యేమిటో కనుక్కొని రావలయునని చెప్పెను. "సరే" అని ఆమె మరల కొంతదూరమేగుసరికి చెట్టునిండా పువ్వులతో ఒక మల్లెంటు ఆమెకు కనబడి- "అమ్మా! యెక్కడకు వెళ్లుచున్నావ"ని యామె నడిగెను. బ్రహ్మవద్దకువెళ్లి వరము తెచ్చుకుంటాను' అని ఆమె చెప్పగా - "అమ్మా! నాది కూడా ఒక చిన్న మనవి యన్నది. చెప్పుమని చెప్పెను. "అలాగే" యని యామె కొంతదూరము వెళ్లగా ఒకచోట వెదురు దండెముల కోరికలు తుగల బడుచుండెను. అదిచూచి ఆమె మరికొంతదూరము వెళ్లుసరికి, అక్కడ అట్లపెనము అంటుకొని మండుచుండెను. అదిచూచి మరికొంతదూరము వెళ్లేసరికి బ్రహ్మలోకము కనబడెను. అప్పుడామె బ్రహ్మలోకమునికి వెళ్లి బ్రహ్మ కెదురుగా నిలబడెను. ఆమెను జూచి బ్రహ్మ "ఏమమ్మా! ఈలాగువచ్చినావు! యని యడుగగా- "దరిద్రము చేతను, కడుపు శోకముచేతను బాధపడలేక యీలాగువచ్చినాన"ని చెప్పెను. "నీవు క్రిందటి జన్మమున ముని కార్తీక దీపముల నోముపట్టి ఉల్లంఘనచేసినావు. ఆ కారణముచేత నీకీ దరిద్రమున్ను, కడుపు శోకమున్ను వచ్చినవి. ఇప్పుడు మరల యింటికివెళ్ళి మునికార్తిక దీపమునోము పట్టి మూడు కార్తులు సమముగా వెలిగించుకుంటే అన్నీ బాగావుంటాయి అని బ్రహ్మ చెప్పెను. అప్పుడామె-'సరేకాని ఒక బ్రాహ్మణుడు పదునెనిమిది జన్మములనుండి అన్నపానములు లేకుండా వున్నాడు. ఎందుచేతనిని యడిగెను. ఆ బ్రాహ్మణుడు బాగా వేదము చదువుకున్నవాడు. ఎవరికి ఒక్క ముక్కయినా చెప్పినాడు కాడు. అందుచేత అయోగ్యత కలిగింది. కాబట్టి నీవు వెళ్లేటప్పుడు ఆయనతో "రామ" అనుమాట చెప్పి వెళ్ళుమని బ్రహ్మదేవుడు చెప్పెను. 'త్రోవలో ఒక ముంతమామిడిచెట్టు పండ్లు పండియున్నది. దాని పండ్లెవ్వరును కోసుకొని తినరట. ఎందుచేతనని మామె యడుగగా 'ఒక' ముత్తయిదువ పదిమంది కొడుకులతల్లి ఒక పిల్లవానిని పెంపు యియ్యమనగా యిచ్చినదికాదు. ఆ కారణము చేత వంశము పోయినది. ఆ శాపముతగిలి ఆమె చెట్టియి పుట్టినది. నీవు వెళ్లేటప్పుడు ఒక పండుతిని చక్కా వెళ్లుమని బ్రహ్మచెప్పెను 'త్రోవలో నొక యావుదూడ మొలబొడి గడ్డిలో మేతమేయకుండా నిలుచుండి యున్నవి. ఎందుచేతనని యామె యడుగగా 'అత్తకోడలును ఆవునకు దూడకు గడ్డి నీళ్ళు పోయుటకు వంతులాడి "నీవే వేసినావంటే నీవే పోసినావ"ని పోయుట మానివేసినారు. అందుచేత వారిద్దరును ఈలాపుట్టి గడ్డిమేయకుండా నిలిచియున్నారు. నీవు వెడలే సమయమందు గుప్పెడు గడ్డితీసి వానికివేసి యిన్ని నీళ్ళుపోసి మరి వెళ్ళుమని బ్రహ్మదేవుడు చెప్పెను. "సరే త్రోవలో

నొకమల్లెంటున్నది. దానినిండా పూవులున్నవి ఎవ్వరును నొక్కపువ్వయినను కోసు కొనరు. ఏమికారణమ"ని యా బ్రాహ్మణి యడుగగా-"అది పూర్వము భోగమది. ఆ జన్మయందు మల్లెపూవులు తెచ్చుకొని ఒక పువ్వయినను ఎవ్వరికి యియ్యకుండా తానే అలంకరించుకొనేది. అందుచేత యిలాపుట్టినది. ఇపుడు నీవు వెళ్లేటప్పుడు ఒక పువ్వు కోసుకొనుము. తరువాత అందరు కోసుకొంటారు" అని బ్రహ్మచెప్పెను. "సరే త్రోవలో దండెమున కోకలు కాలిపోవుచున్నవి. ఎందుచేతన"ని యని యామె యడుగగా-"ఏడుతరముల ఆడబడుచును తీసికొనివచ్చి ఒకబట్ట యెప్పుడును పెట్టిన పాపానబోలేదు. అందుచేత వారి చీరెలు తగులబడిపోవుచున్నవి. నీవు వెళ్ళేటప్పుడు అందులో నొక కోకతీసి కట్టుకొనుము చల్లారిపోవును" అని బ్రహ్మదేవుడు చెప్పెను. "సరే యింకొకచోట అట్లపెనములు మండిపోవుచున్నవి. ఎందుచేతన"ని యా బ్రాహ్మణి యడుగగా-"అత్తకోడలు ఎదురువాయనాలు అందుకున్నారు. అందుచేత మండుచున్నవి. నీవు వెళ్ళేటప్పుడు నీళ్లుచల్లి వెళ్లుము" అని బ్రహ్మదేవుడు చెప్పెను. సరే ఇవన్నియు చేయుదురు. నాకు ఫలితమేమిటి?" అని యామె యడుగగా "మున్నూటరువది వత్తులుచేసి గిద్దెడు నూనెపోసి దీపాలు వెలిగించినావు. వెలిగించి నందుకావత్తి ఫలము మానివేసి ఒలికిన ఫలమిచ్చినాను, వెళ్ళి నోముపట్టి ఉద్యాపనము చేసుకొమ్మ'ని బ్రహ్మ చెప్పెను. అప్పుడామె-"సరే" మంచిదని తిరిగి వచ్చుచు అట్లు పెనముపై నీళ్లుచల్లెను. మరికొంత దూరమువెళ్లి దండెమున కోకలు తగులబడిపోవుచుండగా ఒకటి తీసుకొని కట్టుకొనెను. మరికొంత దూరమువెళ్లి మల్లిపందిరి రెండుపువ్వులు కోసుకొని కొప్పులో పెట్టుకొనెను. మరికొంత దూరము వెళ్లి ముంతమామిడిచెట్టునున్న ఒక పండుకోసుకొని తినెను. తరువాత బ్రాహ్మణుని యొద్దకువెళ్లి పాలలో బియ్యముపోసి పరమాన్నమువండి పళ్లెములోపోసి "రామ-రామ రామ"యని మూడు సారులు యాతనికిపెట్టి తిన్నగా యింటికివెళ్లెను. తరువాత శివరాత్రినాడు కార్తీకదీపముల నోముపట్టి మూడువందల యిరువదివత్తులు, గిద్దెడు నూనెపోసి శివాలయములో దీపము వెలిగించి యింటికి వచ్చెను. వత్తుల ఫలముకంటె పలికిన ఫలము ఎక్కువగుటచేత ఆమె యింటికి వచ్చేసరికి సిరిసంపద కలిగియుం డెను. అప్పుడు చిన్నలైనవారు కాళ్లను, పెద్దలైనవారు చేతులు పట్టుకొని "ఏమి నోము పట్టినావ"ని యడిగిరి. "ఏమీలేదు మునికార్తిక దీపముల నోముపట్టినాను. పలికిన ఫలితమేగాని వత్తిఫలము లేదని బ్రహ్మదేవుడు వరమిచ్చినాడు'యని యా బ్రాహ్మణుని భార్య వారందరితో జెప్పెను. ఆ నోము కలియుగములో నందరు పట్టి ఉద్యానము చేసికొని సిరిసంపదలతో తులతూగిరి.

**ఉద్యాపనము :** అయిదుమూళ్ల యంగవస్త్రము నయిదుమానికెల బియ్యము మండపముపై పోసి దక్షిణ తాంబూలము పెట్టి వెండి ప్రమిదలో పయిడివత్తివేసి దీపము వెలిగించి ఒక బ్రాహ్మణునకు వాయన మీయవలయును. శక్తి తప్పినను భక్తి తప్పరాదు. కథ లోపమయినను వ్రతలోపము కాకూడదు.

## 16. కన్నె తులసమ్మ కథ

ఒక బ్రాహ్మణునకు ప్రథమ భార్యకు కూతురుండెను. ఇప్పటి భార్యకు ఆ చిన్నదానిని చూచుట యిష్టములేదు. అందుచేత ఆ పిల్లకు అన్నము పెట్టక, తలదువ్వక నానాబాధలు పెట్టుచుండెను. ఆ పిల్ల సవతితల్లి బాధపడలేక తాతగారింటికి వెళ్లిపోయెను. పిల్ల తాతగారి యింటికి వెళ్లిన తరువాత తండ్రి-'వెళ్లి తీసుకొని రావలసినద'ని ఆపిల్ల సవతితల్లి యడిగెను. 'నీవు యది యక్కడున్న యన్నినాళ్లును దానిని బాధపెట్టినావు. నేప్పుడేమని దానిని తీసికొనిరాను? నేను వెళ్లిన పంపరు. నీవు వెళ్లి తీసుకొనిరమ్మ'ని యా బ్రాహ్మణుడు చెప్పెను ఆమె. "సరే" యని వెళ్లి- "పిల్లను పంపుమ"ని పిల్ల తాతగారి నడిగెను. "అయ్యో! మామనుమరాలికి పెళ్లి చేయవలెను. ఇప్పుడు పంపుటకు వీలులేద"ని యా తాత చెప్పెను. "మా పిల్లకు మేమే పెళ్లి చేసుకుంటాము పంపడ"ని తీసుకొని వచ్చెను. ఇంటికి తీసుకొని వచ్చిన తరువాత-"పిల్ల ఎత్తుకోమ"ని చెప్పి కొంచెము అరసిముక్క పెట్టి తాను వెళ్ళి తులసెమ్మకు పూజచేసుకొనుచుండెను. సవతితల్లి యాపిల్ల చేతిలోని అరసిముక్క నైవేద్యము పెట్టెను. అప్పుడు తులసెమ్మ ప్రత్యక్షమై- 'నీవు కన్నెతులసెమ్మ నోముపట్టి ఉల్లంఘన చేసినావు. అందుచేత నీకు బాల్యంలో తల్లిచనిపోయినది. ఆ కారణము చేతనే యాచిక్కులు కలిగినవి. కాబట్టి ఇప్పుడు కన్నెతులసమ్మ నోము నోచుకొని యేడాది అయిన తరువాత యుద్యాపనము చేసికొమ్మ'ని చెప్పి యామె యదృశ్యమయ్యెను. ఆ పిల్ల ఆ ప్రకారము నోముపట్టి యుద్యాపనము చేసుకొనగా సవతితల్లికి ఆమెపై ప్రేమ కలిగెను.

**ఉద్యాపనము** : కన్నెపిల్లకు తలంటి నీళ్ళుపోసి పరికిణి రవిక యిచ్చి పదమూడు జోడాలు నైవేద్యము పెట్టవలెను. శక్తితప్పినను భక్తితప్పరాదు. కథ లోపమైనను వ్రతములోపము కారాదు.

## 17. కాటుక గౌరీ నోము కథ

"ఇరుగు గ్రుడ్డి, పొరుగు గ్రుడ్డి, ఇంటియిల్లాలు గ్రుడ్డి మాయింటి బ్రాహ్మణునకు గ్రుడ్డి" అని విచారించుచు ఒక బ్రాహ్మణుని భార్య కూర్చుండెను. అప్పుడు పార్వతీ పరమేశ్వరులు ఆమెకు ప్రత్యక్షమై- "ఏమమ్మా! యిలాగు విచారించుచున్నా"ని యడిగిరి. "మీకెందుకు వెళ్ళండి" అని యామె చెప్పగా- "మాకేకావలెను, ఎందుకో చెప్పవలెన"ని యామె చెప్పెను. "నీవు క్రిందటి జన్మమున కాటుక గౌరీ నోముపట్టి ఉల్లంఘన చేసినావు. అందుచేత నీకీలాగు కలిగినది. ఇప్పుడా గౌరీదేవి నోముపట్టి ఏడాది అక్షంతలు వేసుకొని తరువాత యుద్యాపన చేసుకొనమ"ని చెప్పిరి. ఆమె ఆ ప్రకారము నోముపట్టి యుద్యాపనము చేసుకోగా అందరికి కన్నులువచ్చి సుఖముగా నుండిరి.

**ఉద్యాపనము :** నోముపట్టి ఏడాది అక్షతలు వేసుకొన్న తరువాత ముత్తయిదువులకు తలంటి నీళ్ళుపోసి కరకంచు చీరయిచ్చి, కాటుక బరిణెయిచ్చి, రవికెలగుడ్డ దక్షిణ తాంబూలము ఇవ్వవలయును. శక్తి తప్పినను భక్తి తప్పరాదు. కథలోపమైనను వ్రతలోపము కాకూడదు.

## 18. అట్లమీద ఆవపువ్వు కథ

ఒక బ్రాహ్మణుని కూతురు అట్లమీద ఆవపువ్వు నోముపట్టి ఉల్లంఘనము చేసెను. అందుచేత విధవరికము కడుపుశోకము వచ్చెను. వంశములేకుండ నిర్వంశమయ్యెను. ఆ దుఃఖము భరించలేక ఆమె అడవికివెళ్ళి యేడ్చుచుండగా పార్వతీ పరమేశ్వరులు భూమి పాలించుటకువచ్చి–"ఏమి యిలాగేడ్చుచున్నావ"ని యడిగిరి. "మీకెందుకు నాయనా? మీదారి మీరు వెళ్లండి. మీరేమి ఆర్చేవారా? తీర్చేవారా? అని యామె చెప్పెను అప్పుడు వారు– "దీనికింకను కర్మపరిపాకము గాలేదు. మనమేమి చేయుదుమ'ని చక్కా వెళ్ళిరి. ఆమె అలాగే దుఃఖించుచుండెను. వారు కొన్నాళ్ళకు తిరిగి అక్కడికే మునుపటి చోటుననే ఆమెనుజూచి "ఏమి యిలాగున్నావ"ని యడిగినారట. అందుకామె–'నాయనా! నాకర్మము మీకెందుకని చెప్పగా– "ఓహో? యీామె కింకను కర్మపరిపాకము– కాలేద'ని మరలవెళ్లి పోయిరి. ఆమె చెట్టు పుట్టలూ అడవులవెంట తిరుగుచుండెను. అప్పుడు పార్వతి పరమేశ్వరులు మరలవచ్చి "ఇంకను ఇలాగే తిరుగుచున్నావా?" యని అడిగిరి. అప్పుడామె– నాయనా, పుట్టిన బిడ్డలు బుగ్గి అయిపోయినారు. తలమీద గొడుగు తర్లిపోయినది. అరణ్యాలపాలై యిలాగు తిరుగుచున్నాను అని చెప్పెను. నీవు పూర్వము అట్లమీద ఆవపువ్వుల నోముపట్టి ఉల్లంఘన చేసినావు. అందుచేత ఈలాగు తిరుగుచున్నావు. ఇప్పుడైనా యింటికివెళ్లి ఈ నోముపట్టి కథ చెప్పి అక్షతలు వేసుకొని ఏడాది అయిన తరువాత యుద్యాపనము చేసుకొనవలసినద"ని పార్వతీ పరమేశ్వరులు చెప్పిరి. ఆమె ప్రకారము యింటికివెళ్లి ఆ నోముపట్టి కథ చెప్పి అక్షతలు వేసుకొని ఏడాది అయిన తరువాత యుద్యాపనము చేసుకొనవలసినద"ని పార్వతి పరమేశ్వరులు చెప్పిరి. ఆమె ప్రకారము యింటికివెళ్లి ఆ నోముపట్టి ఏడాది అయిన ఉద్యాపనము చేసుకొనెను.

**ఉద్యాపనము :** ఒక ముత్తయిదువకు తలంటి నీళ్లుపోసి రవికెలగుడ్డ దక్షిణ తాంబూలము యిచ్చి, పండ్రెండు అట్లు, పూసికాసియున్న ఆవకొమ్మల తెచ్చి పేరిన నెయ్యి బెల్లముతో ఆ ముత్తయిదువకు వాయన మియ్యవలయును. శక్తి తప్పినా భక్తి తప్పరాదు. కథ లోపమయిన వ్రతలోపము కాకూడదు.

# 19. పదమూడు పువ్వుల నోము కథ

"శివా, మహాదేవా, సింహద్వారము గడచి వచ్చితిని దేవా, మూకలో ముసుకు వేయకుండా నోచితిని దేవా, అధమ స్థానము అల్లుడింటికి వెళ్లకుండా నోచితిని దేవా, ఒక పూవు పూజచేసితిని దేవా, యుత్తమమయిన బ్రాహ్మణ కడుపున బుట్టనోచి తిని దేవా, రెండు పూవుల పూజచేసితినిదేవా, సుపుత్రికలుగ నోచితిని దేవా, మూడు పూవులపూజ పూజచేసితినిదేవా, ముత్యాలగొడుగు నీడనడచి నోచితినిదేవా, నాలుగు పూవుల పూజ చేసితినిదేవా, నవధాన్యాలు నాయింటికి రా నోచితినిదేవా, అయిదు పువ్వుల పూజచేసితినిదేవా, ధరణవేణివంటి తల్లి దండ్రులు రానోచితనిదేవా, ఆరుపువ్వుల పూజచేసితినిదేవా, ఆదిత్య భగవానులవంటి అత్తమామలు రానోచితిని దేవా, యేడు పువ్వుల పూజచేసితినిదేవా ఏకచక్రముగ లేలనోచితినిదేవా! ఎనిమిది పూవులు పూజచేసిని దేవా! యెనమండ్రు కంసాలురు చేసిన సొమ్ములు యెడతెగ కుండా పెట్టదలచితినిదేవా! తొమ్మిది పూవుల పూజచేసితిని దేవా! తోయగంధేలు తొడుగ నోచితినిదేవా! పదిపూవులు పూజచేసితినిదేవా! పట్టపు రాజున కిష్టమైన దేవినిగా నోచితిని దేవా! పదకొండు పూవుల పూజచేసితినిదేవా సాయక పురుషుడు పరస్త్రీని జూడకుండా నోచితినిదేవా! పండ్రెండు పూవుల పూజచేసితినిదేవా! ఎకు&కవ ఆముదవనము మిక్కిలి సంపదా కలుగనోచితిని దేవా! పదమూడు పూవుల పూజ చేసితిని దేవా! పార్వతీసాన్నిధ్యము బయగోరితిని దేవా! మెచ్చితినిఅక్కా! యిచ్చితిని వరము మరియొక కోరవే మహేశలింగము. శివభక్తులారా! కోరనేమున్న దయా, మాననేమున్నదయ్యా! ఇష్టసంపదలను ఇద్దరు కుమార్తెలను గోరితిని పార్వతీదేవి వంటిది గూతురు, లక్ష్మీదేవివంటి గూతురు మెచ్చితిని అక్కా! యిచ్చితిని వరము మరియొకటి కోరవే మహేశలింగము. శివభక్తులారా? కోరనేమున్నదయ్యా, మాసనే మున్నదయ్యా! పదముగ్గురు కొడుకులను కోరితిని. మువ్వలాడు కొడుకు, గజ్జెలాడు కొడుకు, అందెలాడుకొడుకు, అమ్మా! అన్నము పెట్టుమనేవాడు కొడుకు, వుగ్గుపోయ మనేవాడు కొడుకు, పదమట భారతము చదువువాడు కొడుకు, ఉత్తరాది యుాళ్ళేలు వాడు కొడుకు, దక్షిణాద్వార మెత్తినవాడు కొడుకు గోవును తెచ్చి దొడ్డి పెట్టి గోదానము చేయమనేవాడు కొడుకు, అన్నము వండించి రాశిజేసి అన్నదానము చేయమనేవాడు కొడుకు, కన్నెలమగనిదగ్గర పెట్టి కన్యాదానము చేయుమను కొడుకు, సువర్ణముతెచ్చి పళ్లెములనుంచి సువర్ణదానము చేయుమను కొడుకు, వస్త్రములదెచ్చి దండెములవేసి వస్త్రదానము చేయుమను కొడుకు, అటువంటి కొడుకులను పదముగ్గురు కొడుకులను కోరితినిదేవా! మెచ్చితిని అక్కా! యిచ్చితిని వరము మరియొకటిగోరవే మహేశ లింగము. శివభక్తులారా! కోరనేమన్నదయ్యా మాననే మున్నదయా! సోమయాజుల వారి సోమిదేవమ్మ పెద్దకూతురునై పుట్టి వేగివేసిన వేయిపుట్ల రాజనాలు, పదిపుట్ల అపరాలు అయిదుపుట్ల జీలకర్ర, పందుము ఉప్పు ముద్దిడింగువ, గిద్దెడు నెయ్యి, పెరుగాకు పెరుగుపోక, గుమ్మడికాయంత సున్నము, పదికడవల ఆవకాయ, యిరువై

కడవలపెరుగు, చల్లికంచాల క్రింద చెల్లగోరితిని దేవా! మెచ్చితిని అక్కా! యిచ్చితిని వరము మరొయొకటి కోరవే మహేశలింగము శివభక్తులారా! కోరనేమున్నదయ్యా మాననేమున్నదయ్యా! సోమయాజులుగారి సోమిదేవమ్మ పెద్దకోడలునై వేగివేగిస వేయిపుట్ల రాజనాలు, పదిపుట్ల, అపరాలు, అయిదుపుట్ల జీలకర్ర, పందుము ఉప్పు ముద్దిడింగువ, గిద్దెడు నెయ్యి, పెరుగు ఆకు, పెరుగుపోక, గుమ్మడికాయంత సున్నము, పదికడవలావకాయ, ఇరువది కడవల పెరుగు వేడిపళ్లెరాల క్రింద చెల్లెగోరితినయ్యా దేవా? మెచ్చితినక్కా! ఇచ్చితిని వరంబు మరియొకటిగోరవే మహేశలింగము. శివభక్తులారా! కోరనేమున్నదయ్యా! మాననేమున్నదయా తల్లినికనిన తల్లి తనతల్లి తానుమూడుతోటల పూవులముడిచు కొని ఆరుకోటలపసుపురాసుకొని మునిమను లను చంకపెట్టుకొని, పట్టిమంచము పరుపుమీద పరుండ గోరితినయ్యా దేవా! మెచ్చితినక్కా యిచ్చితిని. వరము మరియొకటి కోరవే మహేశలింగము శివభక్తులారా! కోరనేమున్నదయ్యా, మాన నేమున్నదయ్యా! అత్తగాత్తగారు,అత్తగారు తాను మూడుతోటల పూవులు ముడిచికొని, ఆరుతోటల పసుపురాసుకొని మనుమ లను చంక బెట్టుకొని, పువ్వులపాన్నుయి పరుండగోరితినయ్యాదేవా! మెచ్చితిని అక్కా! ఇచ్చితిని వరము మరియొకటి గోరవే మహేశలింగము. శివభక్తులారా! కోరనేమన్న దయ్యా, మాననేమున్నదయా! వడు పువ్వుల నోముపట్టినపడతి వచ్చునది కడగంటి కాళ్లువేయండి గద్దెపూవులతోటి లోనికి తీసుకొనివెళ్లి పురాణపుస్తకములు విప్పి చూపించండి. యేలాగు వచ్చినదియో, యెటువచ్చినదియో నీలాంబరమున నిలిచి వచ్చినదియో కనకాంబరమున కదిలే వచ్చినదియో, తెల్లచీరలో వెలసికెలాగువచ్చి నదియో, అలాగేవచ్చినదియో, ఎటువచ్చి నదియో, ఉద్దండ పురుగులు పడకుండా ఇనుపముక్కల కాకులు పొడవకుండా పదమూడు పువ్వుల నోముపట్టి పడతికి స్వర్గమునకు తలుపుతీసి పెట్టండి ఆమె నోచిన నోము భూలోకమంతయు నోచినారు. శక్తి తప్పినా భక్తి తప్పరాదు. అక్షతలు తప్పినా లక్షవేలు అయిదవతనము.

**నోముపట్టెడు విధానము :** నోము ఇక పట్టెదరనగా నిత్యంమల్లెచెట్టునో మరి యేదయినా పువ్వుల చెట్టునో దొడ్డియందు వేసుకొని ప్రతి రోజును పదమూడు పువ్వులు గౌరీదేవికి పూజలు చేసుకొనవలెను. రోజుకొకమారు కథ చెప్పుకొనవలెను. పదమూడు పద్మాలు, పదమూడు వత్తుల దీపము, పదమూడు ప్రదక్షిణాలు.

**ఉద్యాపనము :** పదమూడు దోసిళ్ల బియ్యము. పదమూడు బంగారు పువ్వులు, పదమూడు కానులు దక్షిణ శివాలయమునకు పట్టుకొనివెళ్లి శివలింగమునకు పూజచేయవలయును.

## 20. కార్తీక చలిమిళ్ళ నోము కథ

రాజుకూతురు, ప్రధాని కూతురు కార్తీక చలిమిళ్ళ నోముపట్టినారు. ప్రధాని కూతురు పట్టినయేడు నీలాటి రేవున వాయనమిచ్చినది. నీలాటిరేవున వాయన

మిచ్చినందుకు నిధిక్షేపము పరమేశ్వరుడామెకు దయచేసెను. మరుసటి సంవత్సరం కొమ్ముక్రింద వాయనమిచ్చెను. అట్లు యిచ్చినందుకు కొమ్ముటేనుగుల వంటి కొడుకులను పరమేశ్వరుడామెకిచ్చెను. మూడవయేడు గుడిలో వాయనమిచ్చి నది. ఇట్లు ఇచ్చినందుకు పార్వతీదేవివంటి అయిదవతనము వచ్చెను. రాజుకూతు రుల్లంఘనము చేసినది, అట్లుల్లంఘనము చేయుటచే నామె హీనదశపట్టి మగడెప్పుడు రోగాలతో తీసుకొనుచుండెడువాడు. తనతోటి ప్రధాని కూతురు సకలైశ్వర్యము లనుభవించుచుండగా తానా హీనదశ ననుభవించలేనని యడవుల పాలైపోయి పార్వతీపరమేశ్వరులను ధ్యానము చేసుకొనుచున్నది. అట్లామెయుండగా పార్వతీ పరమేశ్వరుల కనుగ్రహమువచ్చి మునిదంపతుల రూపమున ఆమెకు ప్రత్యక్షమై "ఏమమ్మా ఇట్లు దుఃఖించుచున్నావ"ని యడిగిరి. 'మీకెందుకమ్మా! ఆర్చెడివారా! తీర్చేడివారా! వెళ్లుడ'ని వారితో నామె పలికెను. అప్పుడు పార్వతీదేవి పరమేశ్వరుని చూచి 'ప్రధాని కూతురు కార్తీక చలిమిళ్ళ నోము పట్టినది. రాజుకూతురును పట్టినదికదా, రాజుకూతురీలాగుండడమేమి? ప్రధానికూతురట్లుండడమేమి? అని యడిగెను. పరమేవ్వరుడు పార్వతీదేవితో-'ప్రధానికూతురు నీళ్ళరేవున వాయనమిచ్చి నందుకు కొమ్ముటేనుగులవంటి కొడుకుల నిచ్చితిని. నిన్నుబోలు నయిదవతన మిచ్చితిని. రాజుకూతురుల్లంఘనము చేయుటనుబట్టి ఆమెహీనదశ ననుభవించవలసి వచ్చెను' అని చెప్పినాడు. అప్పుడు పేదముత్తైదువు రూపముదాల్చియున్న పార్వతీదేవి యారాజకుమార్తెతో నీ సంగతిచెప్పి వెంటనే తాను కార్తీక చలిమిళ్ళనోము తిరిగి యామెచే పట్టించి యధావిధిగా నుద్యాపనము చేయించి యింటికి నామెను పంపించెకు, రాజుకూతురు తన యింటికి వచ్చేసరికి యిల్లు సకలైశ్వర్యములతో తులతూగుచుండెను. మగడు సుఖముగాను, ఆరోగ్యముగాను వున్నాడు. అప్పుడామె పట్టిననోము లోక మందరు పట్టిరి.

**విధానము** : పట్టినయేడు అయిదుమానికల బియ్యము, మరుచటి సంవత్సరము పదిమానికల బియ్యము, మూడవయేడు పదిహేను మానికల బియ్యము, చలిమిడిముద్దచేసి పట్టినయేడు అయిదుగురు ముత్తయిదువులకు, మరుచటియేడు పదిమందికి, మూడవయేడు పదిహేనుగురికి వాయన మీయవలెను. యీనోము కార్తీక పౌర్ణమినాడు పట్టవలెను ఇదే యుద్యాపనము.

## 21. తరగనాదివారముల నోము కథ

రాజుకూతురు ప్రధాని కూతురు తరగని యాదివారములనోము పట్టిరి. ప్రధాని కూతురు యేడాదిన్ని, ఆదివారమాదివారము తరగని కూర తినకుండగను, తరగకుండగను తగరమనకుండగను ఉండి భక్తి శ్రద్ధలతో నోచుకొని 13 కొబ్బరి కాయలు, 13 కానులు, చీర, రవికె పెట్టెలోబెట్టి ముత్తయిదువునకు వాయనమిచ్చు కొన్నది. ఆమెకు గృహము నిండా నెక్కడచూచినను సిరిసంపదలచే తులతూగు

చుండెను. రాజుకూతురు-'సింగినాదము, తరిగితే నేమివచ్చినది?న తింటే నేమి వచ్చినది?' అని తరిగిన కూరలు తినుచు, తరుగురు, భక్తిలేక, శ్రద్ధలేక నోము ఉల్లంఘనము చేసినది. రాజకూతురునకు పుట్టినబిడ్డలు చచ్చుచునుండేవారు. ఈమె ప్రధాని కుమార్తెను, దాని యదృష్టమును చూచి సహించలేక యొకనాడు ప్రధాని కుమార్తెయొక్క బిడ్డలనందరిని తన యింటికి రప్పించి తలకాయలన్నియుకోసి పెట్టెలోబెట్టి ప్రధాని కూతురింటికి పంపెను. ఇక్కడ రాజకూతురు పిల్లలనందరిని నరుకుసరికి అక్కడ ప్రధానికూతురింట్లో పార్వతీదేవి ఇక నొక అంతమంది పిల్లలను వేసివుంచిపోయెను. ఈ పిల్లల కామె యన్నము పెట్టుకొనుచుండగా రాజుకూతురు పంపినట్లు యింటికిరాగా ఆ పెట్టెతీసి చూచుకొనేసరికి దానిలో నాడుచు పాడుచు పదముగ్గురు పిల్లలును బైటికి వచ్చిరి. వారిని వారినికూడా చూచుకొని ప్రధాని కూతురు సంతోషించుచుండెను. రాజుకూతురు దాసిదానిని చూచి-'ప్రధానికూతు రేలాగునున్నద'ని అడిగినదట. అడిగితే 'అమ్మా! పెట్టెలోని పిల్లలను యింట్లో పిల్లలను చూచుకొని ఆమెపట్టరాని యానందముతో నున్నద'ని చెప్పినది. అదివిని రాజుకూతు రాశ్చర్యపడి-'యది పట్టిననోమే నేనున్ను పట్టినాను నాగతి యీలాగు కావడమేమని యడవులపాలై పోయెను. అపుడు పార్వతీదేవి ముసలి ముత్తయిదువుగావచ్చి యామెకు కనబడి- 'యేమమ్మా, ఈలాగున వచ్చినావు?' అని యడిగినది. 'ప్రధానికూతురును, నేనున్ను ఒకనోము పట్టినాము. అది యీలాగు సిరిసంపదతలతో తులతూగుచుండా నేనీలాగున్నాను. అందుకొరకుగాను అడవిలోనికి వచ్చితినమ్మా, అని రాజకూతురు పార్వతీదేవితో చెప్పెను. అప్పుడు పార్వతీదేవి- 'ప్రధాని కూతురు తరగని ఆదివారముల నోము భక్తిశ్రద్ధలతో తరగకుండాను తరగమనకుండాను, తరిగినది తినకుండాను చేసుకొన్నది. నీవు ఉల్లంఘనము చేయుటనుబట్టి యీలాంటి దశకు వచ్చినావు, అని తిరిగి చెప్పి యామెచేత నోము పట్టించి యధావిధిగా ఉద్యాపనము చేయించి తాను వాయనమందుకొన్నది. అప్పుడు రాజకూతురు కడుపుచలవ, సిరి సపందకలదై యుండెను. నోచిననోము అంతా నోచిరి. అక్షింతలు తప్పినను లక్షవేల అయిదవతనము.

## 22. గుమ్మడిగౌరీ నోము కథ

ఒక బ్రాహ్మణునకు ఒకడే కుమారుడు కలడు. ఆ కొడుకునకు పెండ్లియయిన కొన్నాళ్ళకు గండమున్నదని జ్యోతిష్కులు చెప్పిరి. అట్లుండగా కొన్నాళ్ళకా చిన్నవాని కొకచిన్నదానిని పెండ్లి చేసిరి. వారు కాపురము చేయుచుండగా కొన్ని రోజులకు యమదూతలువచ్చి- "మీపిల్లవానిని తీసుకొని వెళ్ళెదమ"ని తల్లిదండ్రులతో చెప్పిరి. అప్పుడు తల్లిదండ్రులు అయ్యలారా! పెండ్లి అయ్యేవరకే మాపిల్లవాడుకాని, పెండ్లి అయిన తరువాత పెండ్లాము పుణ్యం. మేమేమి చేయుదము? తీసుకొని వెళ్ళుడ"ని చెప్పిరి. ఆ మాటలువిని యాచిన్నది తన భర్తను అడవిలోకి తీసుకువెళ్ళినది.

యమభటులకు చిక్కకుండా కాపాడుకొనుచు తీసుకొని వెళ్లుచున్న ఆ చిన్నదాని వెర్రితనముచూచి పార్వతీ పరమేశ్వరులు దయగలవారై ముసలి దంపతులవేషములు ధరించి ఆ చిన్నదియు భర్తయున్నచోటికివచ్చి-'మీరెక్కడకు వెళ్లుచున్నార'ని యడిగిరి. అందుకాచిన్నది 'మీరార్చేవారా! తీర్చేవారా! మీకెందుకని చెప్పినది. అలాగుకాదు అమ్మాయీ! ఆర్చేడివారముమేమే, తీర్చేడివారము మేమే చెప్పవలిసినదని మరల పార్వతీ పరమేశ్వరులు అడుగగా-'నాభర్తకోసము యమదూతలు వచ్చినారు. అందుచేత నాభర్తను అడవిలోనికి తీసుకొనివచ్చి పార్వతీదేవి నడగి, అయిదవ తనం తెచ్చుకొందామని వచ్చినాను' అని యాచిన్నది చెప్పెను. అప్పుడు ముసలి ముత్తయిదువుగానున్న పార్వతీదేవి యాచిన్నదానిని చూచి-'అయ్యో! గుమ్మడిగౌరీ నోము పట్టి పెద్దముత్తయిదువను నాకుద్యాపనం చేసికోవమ్మా? నీమగనికి గండము గడిచి నీకైదవతనము వచ్చును. అనిచెప్పి ఆ అడవిలో మూడు గుమ్మడిపళ్లుకోసి రవికెలగుడ్డ, పసుపు, కుంకుమ, తాంబూలము రావించి తానాచిన్నదానిచేత వాయనము పుచ్చుకొనెను, వాయనము పుచ్చుకొన్న ఏడాది గుమ్మడి కాయకూడ తినవద్దనిచెప్పి పంపెను. ఆ చిన్నది తిరిగి యింటికివచ్చి నూరేండ్లు అయిదవతన ముతో నుండెను. ఈ సంగతంతయు నిరుగు పొరుగమ్మలు తెలుసుకొనిరి. ఆమె పట్టిన నోము జనమంతా పట్టిరి. శక్తితప్పినా భక్త తప్పరాదు. అక్షంతలు తప్పినా లక్షవేలయేండ్లు అయిదవతనము. కథలోపమయినా వ్రతలోపము కారాదు.

## 23. పువ్వుల తాంబూలము నోము కథ

ఒకరాజు కూతురుని నెప్పుడు మగండేలేవాడు కాదు ఆవిడ సంతానము లేక సిరియొల్లక అడవులబట్టి పోయెను. పార్వతీదేవి ముసలి ముత్తయిదువ వేషము వేసికొనివచ్చి 'ఏమి బిడ్డా! యిలా వచ్చితివ'ని యడిగెను. ఏమిచెప్పనమా! నా స్థితి అంత అని యామె తనకథ యంతయు చెప్పెను. అప్పుడు పార్వతీదేవి-'నేను చెప్పినట్లు చేయుము. అమ్మాయీ! నీమగనికి నీమీద దయవచ్చును. తరువాత సంతానము కలుగును. సకల భాగ్యాలు వచ్చును అని చెప్పెను. రాజకూతురు రామె మాటలకు సంతోషించి- యంతకంటే యేమి కావలయును చెప్పమని యడుగగా పార్వతీదేవి 'అమ్మాయీ! నీవు తిన్నగా యింటికివెళ్ళి ప్రతిదినము అయిదు పువ్వులు తాంబూలములోపెట్టి ఒక ఏడాది భక్తిశ్రద్ధలతో పార్వతీదేవి పేరుచెప్పి ఒక ముత్తయిదువకిచ్చి తరువాత పళ్లెమునిండా పువ్వులుపోసి బంగారు పువ్వుచేయించి చీర,రవికెల గుడ్డపెట్టి పళ్లెముతో కూడా ముత్తయిదువుకు ఉద్యాపనము చేసికొనుము అని చెప్పెను. ఆ మాటలు విని ఆమె తిన్నగా యింటివచ్చి భక్తిశ్రద్ధలతో పార్వతీదేవి పేరు చెప్పి ఏడాదిపైన చెప్పిన ప్రకారము పువ్వులు తాంబూలాలిచ్చుకొని ఆవిడ చెప్పిన ప్రకారము ఉద్యాపనము చేసికొన్నదట. అప్పటినుండి ఆ రాజుకూతురు మొగుడు నీళ్ళుపాలు కలిసినట్లు కలిసి సుఖములనుభవించిరి. తరువాత ఆమె ముత్యాలవంటి బిడ్డలను కని రత్నమాణిక్యాలు, భూషణాలుపెట్టుకొని సుఖముగా

నుండెను. ఆమెపట్టిన నోములోకమంతయు పట్టిరి. శక్తి తప్పినా భక్తి తప్పరాదు. అక్షతలు తప్పినా లక్షవేలుయేండ్లు అయిదవతనము. ఉద్యాపనము కథలోనున్నది.

## 24. గంధ తాంబూలాల నోము కథ

పై కథవలెనే దీనికథయును, ప్రతిదినము అయిదు గంధపు వుండలు తాంబూలములోపెట్టి యివ్వవలెను.

**ఉద్యాపనము :** గంధపుచెక్క, ఆకులు, పోకలు, చీర, రవికలగుడ్డ పెట్టి ముత్తయిదువునకు ఉద్యాపనము చేసికొనవలెను.

## 25. నిత్య తాంబూలాల నోము కథ

దీని కథయు పై కథవలెనే నిత్యము ఒక తాంబూలము బ్రాహ్మణుని కియ్యవలయును.

**ఉద్యాపనము :** బంగారు, భమిడ(పైడి) చెక్క చేయించి ఆకులు పోకలు, పాందానలోపెట్టి పాందానతోకూడా బ్రాహ్మణుని కియ్యయవలయును.

## 26. పుసుపు తాంబూలాల కథ

దీనికి కథయును పైకథవలెనే ప్రతిదినము ఐదుపసుపు తాంబూలముతో నుంచి ముత్తయిదువునకు ఇచ్చుచుండవలయును.

**ఉద్యాపనము :** వీసె యేబులము పసుపు, వీసె యేబులము కుంకుమ,చీర, రవికెలగుడ్డ, తాంబూలము పళ్ళెములోనుంచి ముత్తయిదువునకు ఇవ్వవలయును. శక్తి తప్పినా భక్తి తప్పరాదు. అక్షతలు తప్పినా లక్షవేలయేండ్లు అయిదవతనము.

## 27. మాఘ గౌరీ నోము కథ

ఒక బ్రాహ్మణునకొక కుమార్తెగలదు. ఆ కూతురుకి చిన్నతనములోనే విధవరికము వచ్చెను. ఆ పిల్ల యవస్త జూడలేక తల్లిదండ్రులు అడవిలోనికి తీసుకొని వెళ్లి తిరుగుచుండగా ఒక గట్టుమీద గూర్చుండి పునిస్త్రీలంతా ఒక రేవునను విధవలంతా ఒక రేవునను అయిదేసి పద్మాలుపెట్టుకొని నోము నోచుకొనుచుండిరి. అదిజూచి ఆ తల్లిదండ్రులు పిల్లను తీసుకొనివెళ్లి– 'అదేమినోమమ్మా! అని వారని అడిగిరి. అప్పుడు పార్వతీదేవి గూడా ఆ ముత్తయిదువులలో నొక ముత్తయిదవుగా నుండి వాళ్లను జూచివారి మాటలువిని "అయ్యా! ఆ నోము నేను చెప్పెదను గాని మీ పిల్లను నీ నదిలో స్నానము చేయించుదురుగాని తీసుకురండ"ని చెప్పెను. "అంతకంటేనా అమ్మా!" అని వారాపిల్లను తీసుకొని వెళ్లిరి. అప్పుడు పార్వతీదేవి

పిల్లనుజూచి నీళ్లలోనున్న యిసుక దోసెడుతీసి గట్టునపోయచున్నదట. ఆ పిల్ల ఆ ప్రకారము పోయేసరికి అదంతయు పసుపు అయినదట. "మళ్లీ దోసెడు పోయుమమ్మా!" అన్నదట. ఆ ప్రకారము పోయగా అది కుంకుమాయెను. "మళ్ళీపోయ మనగా" ఆ చిన్నది మళ్ళీ పోయుసరికి అది కొబ్బరి అయినదట. "మళ్లీ దోసెడు పోయుమమ్మా!" అని చెప్పగా బెల్లము అయ్యెను. "మళ్లీ దోసెడు పోయుమమ్మా!" అనగా ఆమె ఆ ప్రకారము పోయుసరికి అది జీలకర్ర అయ్యెను "ఇది పట్టినయేడు పసుపు, మరుచటియేడు కుంకుమ, మూడవ కొబ్బరి, నాల్గవయేడు బెల్లము, అయిదవ యేడు జీలకర్ర సేరుంబావు చొప్పున ముత్తయిదువునకు తలంటి నీళ్లుపోసి భోజనము పెట్టి వాయనమిమ్ము. ఈ నోము మాఘమాసములో అమావాస్య వెళ్లిన పాడ్యమి మొదలు నెల్లాళ్లు మళ్లీ పాడ్యమి వరకు నీలాటిరేవున పసుపు పెట్టుకొని పసుపుతోడ అయిదు పద్మాలు, పిండితోడ అయిదు పద్మాలు, కుంకుమతోడ అయిదు పద్మాలు, బెట్టుకొని పూజచేసుకొని ఈలా అయిదేండ్లు పూజచేసుకొని గౌరమ్మను నీళ్లలో విడిచివేసిన వాళ్లకు నిత్యసౌభాగ్యము వచ్చుననని" చెప్పెను. ఆ ప్రకారము ఆ పిల్లచేత తల్లితండ్రులు నోముపట్టించగా చచ్చిన మగడు మళ్లీవచ్చెను. ఆమె పట్టిన నోమంతా పట్టిరి. శక్తి తప్పినా భక్తి తప్పరాదు. అక్షతలు తప్పినా లక్షవేల యేండ్లు అయిదవతనము ఉద్యాపనము కథలోనున్నది.

## 28. బాలాదివారముల నోము కథ

ఒక బ్రాహ్మణునకు ఒక కూతురు, ఒక కొడుకు కలరు. కొడుకునకు పెండ్లి అయి కోడలు కాపురమునకు వచ్చెను. కూతురు చిన్నపిల్ల ప్రతిదినము వారింటికి యాయవారపు బ్రాహ్మణుడు వచ్చేవాడు. ఈచన్ని పిల్ల ఆ బ్రాహ్మణునకు రోజు యాయవారము వేసినప్పుడల్లా అతడు 'గంగాస్నాన ఫలసిద్ధిరస్తు' అనేవాడు. కోడలు యాయవారము వేయగా 'సౌభాగ్యవతీభవ' అనేవాడట ఆ మాటలువిని కూతురు తల్లిదండ్రులతో "రోజూ బ్రాహ్మణుడు నన్నొకలాగున వదిన నొకలాగున దీవించు చున్నాడే'మని యనుచుండెడిది. "ఏమని దీవించుచున్నాడమ్మా!" అని తల్లిదండ్రు లడిగితే ఆ పిల్ల ఆ రెండుమాటలు చెప్పెను. అది విని తల్లిదండ్రులు దుఃఖపడి మరునాడు యాయవారము బ్రాహ్మణుడు వారిని జూచినప్పుడు జాగ్రత్తగా కనిపెట్టి యుండి–"ఏమయ్యా! ఆపిల్ల నాలాగున, ఈపిల్ల నీలాగున దీవించెదవ'ని యడిగిరి. ఆ బ్రాహ్మణుడు వారినిజూచి–"ఆచిన్నదానికి బాల్యములో విధవరికమున్నది. కనుక "గంగాస్నాన ఫలసిద్ధిరస్తు" యని దీవించుచున్నాను. ఈ చిన్నదానికి చాలా అయిదవతనమున్నది గనుక "సౌభాగ్యవతీభవ" యని దీవించు చున్నాన"నియు చెప్పెను. ఆ మాటలువిని తల్లిదండ్రులు దుఃఖించి "మాకొక్కరైకూతురు నాయనా!" యని యేడ్చి ఆ బ్రాహ్మణుని కాళ్ళమీదపడి–"మా పాలిట దేవుడవు నీవే గనుక నీ పిల్లకు అయిదవతనము వచ్చే మార్గము చెప్పి రక్షింపవలయున"ని ప్రార్థించిరి.

అప్పుడా బ్రాహ్మణుడు-"బ్రహ్మవ్రాత యెవ్వరును తీసివేసేవారులేరు. అయినను నేనొకమాట చెప్పెదను. అలా చేయమనెను. "అంతకంటే నేమి నాయనా! చెప్పుమని వారడుగగా-"ఈపిల్లకు పెండ్లి అయిన తరువాత కొన్ని రోజులకే భర్తపోతాడు పోగానే పోయిన భర్త నింటిలో పెట్టి ఈ పిల్లను దీసుకొని మీరు గంగానది స్నానానికి వెళ్ళండి. అలా వెళ్ళిన యెడల దారిలో నొక ముత్తయిదువ స్నానానికి వెళ్లుచుండగా చెంగున కట్టుకొన్న పసుపుపొట్లము, కుంకుమ పొట్లము పడిపోవును. అవి నింపాదిగా మీ పిల్లచేత తీయించి ఆ ముత్తయిదువతో కూడా వెనుకనే స్నానాలరేవునకు వెళ్లండి. అక్కడకు వెళ్లిన తరువాత ఆమె స్నానము చేయబోయే సమయమున చెంగునున్న మూట లేకపోగా 'అయ్యో నా పసుపు కుంకుమ ఎవరికో దొరికింది అనుకుంటుంది. ఆ మాట వినగానే "నాకు దొరికినదమ్మా!" అని మీపిల్లను పసుపు కుంకుమ యిమ్మనండి. ఇమ్మనగానే ఆ ముత్తయిదువ ఆ పిల్లచేతిలో రవ్వంత మీచేతిలో రవ్వంత పసుపు కుంకుమ పెట్టి తాను రాసుకొని స్నానము చేయును. అప్పుడు మీ పిల్లచేత స్నానము చేయించి యింటికి తీసుకొని వచ్చి సేరుంబావు పాలు, పరమాన్నం వండించి అడుగుమట్టుపై మట్టుతీసి మధ్యనున్నది ముత్తయిదవునకిప్పించి ముత్తయిదువను పంక్తిని పెట్టుకొని భోజనము చేసినతరువాత ముత్తయిదువునకు చీర, రవికెల గుడ్డ, తాంబూలము దక్షిణతో యియ్యాలి. అలాగుచేసిన చచ్చిన పురుషుడు మళ్లీ బతుకుతాడు. ఈ పిల్ల చిన్నతనములోను పసుపు, కుంకుమ, అన్ని వస్తువులు దొంగతనము చేస్తుంటే మీరు తల్లిదండ్రులలు యుండి చూస్తూ ఊరుకొనుటచేత ఈ జన్మమున ఆ దొంగతనముచేసిన దోషమున ఈ పిల్లనుచూచి దుఃఖించుట మీకును కలిగినది అని చెప్పినాడట. ఆ మాటలు విని బ్రాహ్మణునకు మ్రొక్కి ఆయన చెప్పిన ప్రకారము పిల్లకు పెండ్లిచేసిన తరువాత విధవరికము రాగా గంగా స్నానమునకు తీసికొనివెళ్లి యధావిధిగా జరిపించిరి. ఆ చిన్నదానికి అప్పుడు చచ్చినభర్త మరల బ్రతికివచ్చెను. ఆమె పట్టిననోము జగమంతాపట్టి అయిదవతనముతో సుఖ పడిరి. శక్తి తప్పినా భక్తి తప్పరాదు. అక్షతలు తప్పినా లక్షవేలయేండ్లు అయిదవతనము.

## 29. బచ్చలగౌరీ నోము కథ

ఒకచిన్నది కాపురము చేయుచుండ అన్నగారు చూచుటకు వచ్చెను, ఆ చిన్నది అన్నగారితో కొంతసేపు ఇష్టాగోష్టినుండి పిమ్మట పిండివంటలతో వంటచేసి కూరపోపునకు కరివేపాకు కావలసివచ్చి-"అన్నయా! దొడ్డిలో చెట్టువున్నది. కొంచెము కరివేపాకు తెచ్చిపెట్టు" మని యడిగెను. "అలాగే" అని చెప్పివెళ్లి యెంతసేపటికి రాలేదు. పాముకరచి అక్కడపడిపోయెను. ఇంకను అన్నగా రెంతసేపటికి రాలేదని ఆ చిన్నది దొడ్డిలోకి వెడలేసరికి చెట్టుక్రింద పడిపోయిన అన్నగారు కనబడెను. ఆమె తొట్రుపడుతువెళ్లి- "అన్నా అన్నా!" అవి పిలిచి పలుకగపోగా యేడువసాగెను. ఆ యేడుపువిని ఊళ్లోవారందరు వచ్చిరి. అందులో ఒక ముసలి ముత్తయిదువ ఆ

చిన్నదానిని చూచి–"అమ్మాయీ! నీ విక్కడలేచి లోపలికి వెళ్ళి పువ్వులతోడ కాయల తోడ పండ్లతోడనున్న బచ్చలిచెట్టు తెప్పించి పూజచేసి ముత్తయిదువునకు తలంటి నీళ్ళుపోసి భోజనముపెట్టి వెండి బచ్చలకాయ, బంగారుబచ్చల కాయ చేయించి బంగారపుది నీవుంచుకొని వెండిబచ్చలకాయ చీర, రవికెలగుడ్డ బచ్చలిచెట్టు తాంబూలము దక్షిణతోడ ముత్తయిదువునకు వాయనమిచ్చి భోజనముపెట్టి రావమ్మా! వచ్చి నీ అన్నను లేపవమ్మా' అన్నదట, ఆమాట విని ఆ చిన్నది చటాలున లేచి ఆ ముసలి అవ్వ చెప్పినట్లు చేసి మళ్లీవచ్చి–"అన్నా! అని పిలిచేసరికి నిద్ర నుండి లేచినట్లాతడు లేచిచూచెను.న అప్పుడామె సంతోషించెను. 'ఇది బచ్చలగౌరీ నోమమ్మా! ఇది నోచిన వారికి కడుపు చలువ తోడునీడ చలువ, పుట్టింటచలువ, అయిదవ తనము కలుగును' అని ఆ ముసలి ముత్తయిదువుచెప్పి–'నేను పార్వతీదేవిన'ని చెప్పి అంతర్ధానమైనదట ఆమె పట్టిన నోము జగమందరు. అక్షతలు తప్పినా బచ్చలి తినకూడదు. శక్తితప్పినా భక్తితప్పరాదు. అక్షతలు తప్పినా లక్షవేలయేండ్లు అయిదవనతము. ఉద్యాపనము కథలో చెప్పబడినది.

## 30. ధైర్యలక్ష్మి నోము కథ

ఒక బ్రాహ్మణునకు ఆరుగురు కొడుకులును, ఒక కూతురును కలరు. ఆ కూతురత్తింట కాపురము చేయుచుండెను. ఆ సమయములో మొదటి అన్నకు పెండ్లికార్యము చేయుచుండెను. ఆ సమయములో మొదటి అన్నకు పెండ్లి కార్యము తలపెట్టి–'రావసలినద'ని కూతురుని తల్లిదండ్రుల పిలిచిరి. ఆమె 'సరే' అని తీరా పెండ్లికి ప్రయాణమై రాబోవుచుండగా ఆమెభర్తకు ప్రాణముమీదకి వచ్చెను. అందుచేత నామె ప్రయాణమును మానివేసెను. అలా అయిదురోజులు ఉన్న తరువాత పెండ్లి అయిన తరువాత ఆమెభర్తకు జబ్బుకుదిరి లేచెను. ఈలాగే అందరి అన్నల పెండ్లిండ్లకు ఆమె ప్రయాణము అయ్యేసరికి ఆయనకు ప్రాణము మీదకివచ్చి క్రింద పెట్టుచుండేవారు. ఆ పెండ్లి రోజులు అయిన తరువాత ఆయనకు నెమ్మదిగా నుండేది. చివరకు కడసారపు అన్నకు పెండ్లికి రాగా ఆమె ప్రయాణమయ్యేసరికి ఆయనకు మామూలు ప్రకారము ప్రాణముమీదికి వచ్చెను. అలా జబ్బు చేసినప్పటికి ఈసారి ఆమె ధైర్యము తెచ్చుకొని–'ఇదియేదో చిత్రమునున్నది. ఇది చూతాము. నా ధైర్యలక్ష్మియే నన్ను కాపాడగలద'ని ఆమె యెంచుకొని యెవ్వరితోడను చెప్పక క్రింద పారవేసిన పురుషుని చాపలో చుట్టి మూలబెట్టి తలుపులు తాళమువేసి తిన్నగా బయలుదేరి పుట్టింటికి వచ్చుచుండెను. అంతలో దారిలో నొక జువ్విచెట్టు కనబడెను. ఆమె యాచెట్టువద్దకు వెళ్ళి–'నీవే నా పాలిటి ధైర్యలక్ష్మివి తల్లీ! నేను తిరిగి యింటికి వచ్చేటప్పటికి నామగనికి నింపాదిగా నుండిన నీకు ఏడాది పూజచేస్తాన'ని దండముపెట్టి తిన్నగా పుట్టింటికివెళ్ళి అన్న పెండ్లి అయిన తరువాత ఇంటికి తిరిగివచ్చెను. వచ్చేసరికి మగడు లేచివుండెను. మిక్కిలి ఆరోగ్యము

గలవానివలె జబ్బుయేమీలేక కులాసాగా నుండెను. నాడు మొదలు ఏడాది జువ్వెకు పూజ చేసుకొన్నదట. అంతట ఆమెకు సిరిసంపదలు తరగని అయిదవతనము వచ్చెను. అంతట ఇరుగు పొరు అమ్మలువచ్చి- "ఏమమ్మా! చచ్చిన పురుషుని యింట్లోపెట్టి చక్కాపోయి వచ్చేటప్పటికి పురుషుడు లేచితిరుగుచున్నాడు. ఏమినోము నోచినావు? ఏమివ్రతము పట్టినావు? అని అడిగినారు. అడిగితే 'ధైర్యలక్ష్మినోము పట్టి జువ్విచెట్టుకు పూజచేసినానమ్మా!' అన్నదట. ఆమె పట్టిననోము లోకమంతా పట్టిరి. శక్తి తప్పినా భక్తి తప్పరాదు. అక్షతలు తప్పినా లక్షవేలయేండ్లు అయిదవతనము కథలో చెప్పబడి నది.

## 31. చిలుకముగ్గుల నోము కథ

ఒక బ్రాహ్మణునకు సంతానము లేకపోయినది. విష్ణుమూర్తిని గురించి తపస్సు చేసినాడు. విష్ణుమూర్తిని ప్రత్యక్షమై-'అయిదవతనము లేని ఆడది కావలెనా? ఆయుర్దాయములేని మగవాడు కావలెనా' అడిగెను. 'ఆప్రకారము నీకు కూతురు పుట్టున'ని చెప్పెను. తరువాత ఆ బ్రాహ్మణునకు ఒక ఆడశిశువు కలిగెను. తల్లిదంద్రులు ఆ పిల్లలకు నారాయణమ్మ అను పేరుపెట్టి ఆమె వివాహముగూర్చి విచారించు చుండిరి.న ఎవరూ చేసుకొన్నారుకారు. తల్లిదండ్రులు విచారిస్తూ అడవిలోనికి వెళ్ళి ఒకరాతికి పెండ్లి చేయుదమని తలచిరి. అప్పుడు అడవిలో ఒక కృష్ణ విగ్రహము కనపడగా దానికి వివాహముచేసిరి. ఆ విగ్రహము బ్రద్ధలై పిండైపోయెను. అప్పుడా చిన్నది విచారించుచు ఊళ్లోకివచ్చి విష్ణుమూర్తిని గురించి తపస్సు చేస్తూవుండేది. కొన్నాళ్ళకు తల్లిదండ్రులు చనిపోయిరి. ఆ చిన్నది రోజూ తపస్సు చేస్తూ యెవరికి ఏమి పెట్టకుండా- 'నాయింటికి రాకండి నారాయణా! నన్నెవరు అడగకండి నారాయణా' అని అంటూవుండేది. అందరూ ఆ చిన్నదానిని యిలోనారాయణమ్మ అని పేరుపెట్టారు. కొన్నాళ్ళ ఆమెకు అవసానకాలము వచ్చెను. అప్పుడు నారాయణమూర్తి కాకి అయివచ్చి కావు కావు మని అరుగుచుచుండెను. అందుకామె కోపగించి అలుకుతూవున్న అలుకుగుడ్డపుచ్చుకొని కొట్టెను. విష్ణుమూర్తిని ఆ గుడ్డపుచ్చుకొని వెళ్ళగా అందులో ఒక కందిగింజ దొరికెను. ఆ గింజ మొలవైచెను. అది మొలిచి చెట్టయ్యేసరికి నారాయణమ్మ చనిపోయెను. అప్పుడు విష్ణుమూర్తి దానిని తీసికొనిపోయి-'అలుకుగుడ్డ కట్టుకొని ఆ చెట్టుక్రింద వుండమ'ని చెప్పెను. అందుకా చిన్నది విచారిస్తూ 'నేను నీకు భక్తురాలను, నన్నిట్లు చెయ్యివచ్చునా?' యని యడుగగా-'నీవు యెవరికీ దానధర్మాలు చేసికోలేదు. అందుచేత ఇట్లు తటస్థించినద'ని చెప్పెను. ఆ చిన్నది పురుగై ఆ చెట్టుమీద కొన్నాళ్ళుండగా తిరుగ విష్ణుమూర్తి ప్రత్యక్షమై-' నాభార్య చిలుకముగ్గుల నోముపట్టును. అప్పుడు నిన్నుపిలుచుటకు వచ్చును. అప్పుడు ఒక బిందువు నాకు ధారపోస్తే వస్తానని చెప్పుము. అప్పుడు నీకు మేలు కలుగుతుంద'ని చెప్పెను. ఆ ప్రకారము లక్ష్మీదేవి

చిలుక ముగ్గుల నోము పట్టి యీ యిలోనారాయణమ్మను పిలుచుటకువచ్చెను. అప్పుడు విష్ణుమూర్తి మహిమవల్ల ఆ చిన్నది దివ్యవిగ్రహమై ఒక ఇంట్లో వుండెను. అప్పుడు లక్ష్మీదేవి-'అమ్మాయీ! నేను చిలకముగ్గుల నోము పట్టెదను రావలసినద'ని కోరెను. అందుకా చిన్నది-'అమ్మా! నాకొక బిందువు ధారపోస్తే వస్తాను. లేకపోతే రాన'ని చెప్పెను. 'ఆ ప్రకారము ధారపోసెదన'ని లక్ష్మీదేవి చెప్పెను. అప్పుడు చిన్నదానిని తీసుకొనివచ్చి చిలుకముగ్గుల నోముపట్టి చిలుకెతొక్కి ఒక బిందువు ఆ చిన్న దానికి ధారపోసెను. అప్పుడు ఆ చిన్నదానికి సమస్త దోషములు పోయెను. అప్పుడు విష్ణుమూర్తి 'నీకు ఏమి కావలెన'ని యడుగగా- 'నాకు నీ పాదసేవకంటే ఏమి యక్కరలేద'ని చెప్పెను. లక్ష్మీదేవి ఆమెకు యెప్పుడు అయిదవతన ముండేలాగున వరమిచ్చెను. నారాయణమూర్తి ఆ చిన్నదానికి ఎప్పుడు తన స్వర్గములో సుఖముగా నుండుటకు సెలవిచ్చెను. ఈ నోము నోచుకున్న వాళ్ళకును భోజనానికి వెళ్ళిన వాళ్ళకును, నిత్యసువాసినీత్వము కలిగి సర్వైశ్వర్యము కలుగునని విష్ణుమూర్తి జెప్పెను.

**ఉద్యాపనము :** ఈ నోము అయిదేళ్ళు నోచుకొని అయిదో సంవత్సరమునగాని అయిదేళ్ళలోగాని అయిదు మానికెల బియ్యము చలిమిడి చేసి, అడ్డెడు తవ్వెడు బియ్యము అప్పాలుచేసి శక్త్యానుసారముగా అయిదుగురు ముత్తయిదువులకు, పదిహేనుగురు బ్రాహ్మణులకు పదిహేను కలశలు, పదిహేను అంగవస్త్రములు, ముత్తయిదువులకు చీరలు, రవికలగుడ్డలుయిచ్చి భోజనముపెట్టి దక్షిణ తాంబూలము లిచ్చి ఉద్యాపనము చేసికొనవలెను. శక్త్యానుసారముగా ఏటా సంతర్పణ చేసుకోవ లెను. భక్తి తప్పినా ఫలము తప్పదు. కథలోపమయినా వ్రతలోపము కాకూడదు.

## 32. చిలుక ముగ్గుల నోము కథ (మరియొక విధము)

తలగ తలగ యేమిబుట్టె? నందరాడి పెరగగా తలగ తలగ యేమి బుట్టి? పందిబుట్టె. పంది పరమేశ్వరుడింట పెరగగా తలగ తల్గగ యేమిబుట్టె. దోమ దొడ్లోపెరగగా పన్నెండు కొమ్మల పన్నెండు ఆకుల తులసమ్మబుట్టె. 'ఆయువులేని చిన్నవాడు కావలెనా? అయిదవతనములేని ఆడది కావలెనా?' అయిదవతనమయు లేని అయితే అయితే మా యింటనయినా పడియుంటుంది. ఆయువులేని కుమారుండెదుకు? ఐదవతనములేని కూతురునే యిమ్మ'ని అడుగగా పార్వతీ పరమేశ్వరులు భూమిపాలించవచ్చి-'అలాగే కలుగుతుంది' అని వరమిచ్చిరి కుమార్తె కలిగినది. కుమార్తె కలిగితే- 'ఏచిన్నవానికి యిస్తున్నా'అని చూస్తున్నాడు. ఎవరికి ఇచ్చిచేసినా చచ్చిపోతాడుగదా యిన పర్వతునికిచ్చి పెండ్లిచేసెను. ఆ రాతికిచ్చి పెళ్ళిచేస్తే రాయికూడా బద్ధలైపోయెను. ఒక పుణ్యాత్మురాలు చిలుకముగ్గుల నోము పట్టింది. 'నోముపట్టితే నోచిన నోము నాకు ధారాగతం చెయ్యవమ్మ' యన్నది. పార్వతీ పరమేశ్వరుల దగ్గరకు వెళ్లి యడిగింది. 'నోచిన నోము, చేసుకున్న పెనిమిటిని ధారాగతము చేస్తారా? యెక్కడయినాకద్దా?' అంది. బిందువులు ధారాగతం చేసింది.

'విధవకు ధారాగతం వేయవలసి వచ్చింది ఏమిట'ని కొన్నినీళ్లుధారాగతం చేసింది అప్పుడు పన్నెండేండ్ల బాలకుమార్తె అయినది. 'ఈ బిందువుల పడితేనే అయిదోతనం వచ్చినది. ఈ నోము పడితే ఏం తఫలమో!' అని అయిదుపేర్ల పిండితెచ్చి చలిమిడిచేసి అయిదేళ్ళు చిలుకుత్రొక్కి బ్రాహ్మణునకొకముద్ద భక్తితో యిచ్చి తన పాలిముద్దలో పాలు నెయ్యిపోసి అందరికీ పంచి పెట్టి అయిదుగురు ముత్తయిదువులకు, అయిదు గురు బ్రాహ్మణులకు భోజనముపెట్టి యధావిధిగా అలా ఐదేళ్లు నోము నోచుకొని అయిదోయేడు వచ్చేటప్పటికి పదిహేను మండపాలు, పదిహేనువత్తులు, పదిహేను ముగ్గులు బెట్టుకొని ఐదేళ్లుచేసి పదియేడు పూర్తిఅయ్యేటప్పటికి పది పదిహేను కలశలు, పదిహేనువత్తులు, దీపములు, పదిహేను ముగ్గులు పెట్టి ఉద్యాపనము చేసింది. కథలోపమయిన వ్రతలోపము కారాదు. భక్తి తప్పినా ఫలము తప్పదు.

**ఉద్యాపనము :** పదిహేను కలశలు, పదిహేను వత్తుల దీపములు, పంచ ముగ్గులు, పదిహేనుగురు బ్రాహ్మణులకు ఆపోశనము వడ్డించి వెండితులసికోట, భమిడి తులసికోట, ఐదుమానికెల బియ్యము, మండపము యేర్పరచి పూజచేసికొని ఒక బ్రాహ్మణునకు దానమియ్యవలెను. కథలోపమయినా వ్రతలోపము కారాదు. భక్తి తప్పినా ఫలము తప్పదు.

## 33. సావిత్రీ-గౌరీదేవి కథ (బొమ్మలనోము)

అనగనగా పార్వతీదేవి మూడుపండుగలు వెళ్లిన మక్కనువు నాడు శివునితోటి –'మీలోకముమీద అష్టఐశ్వర్యంబులు పొందేటటువంటి ఒక వ్రతము చెప్పమని యడిగెను. శివుడు చెప్పదొడగెను. –ఏమియనగా మూడు దొడ్ల పేడవేసి, మూడుకదుళ్ల నూలుపోసుకొని, పదిమంది పేరంటాళ్లను పోగుచేసి, వ్రతము చెయ్య'మని చెప్పెను. పట్టినరోజు పులగం నైవేద్యము పెట్టి భూచక్రము యేలెను. రెండవ రోజున మట్టెలు నైవేద్యము పెట్టి ముద్దుగారాబాన పెరిగింది. మూడవ రోజున చలిమిడి నైవేద్యముపెట్టి ముత్తయిదువయినది. నాల్గవరోజున నానబియ్యము నైవేద్యముపెట్టి నాగప్పసాని అయింది. అయిదవనాడు పరమాన్నము నైవేద్యముపెట్టి సేగిలేని మనువు కోరింది. ఆరవరోజున గారెలు నైవేద్యముపెట్టి గారంబుద్ధుని తోడబుట్టింది. ఏడవనాడు అట్లు నైవేద్యముపెట్టి పట్టితల్లి అయింది. ఎనిమిదవనాడు పెరుగుపేరిన నెయ్యి నైవేద్యముపెట్టి పాతాళము యేలింది కథ లోపమయినా వ్రతలోపముకారాదు. శక్తి తప్పినా ఫలము తప్పదు. వాక్కుతప్పినా వ్రతము తప్పరాదు.

**ఉద్యాపనము :** తొమ్మిదిచేటలు, చేట ఒక్కొంటికి తొమ్మిదేసి బిళ్లకుడుములు, తొమ్మిది లక్కజోళ్లు, తొమ్మిది నల్లపూసల కోళ్లు తొమ్మిది ఆకులు, ఆకుచెక్కలు పెట్టి తొమ్మండుగురు ముత్తయిదువులకు ఇవ్వవలెను.

ద్వితీయ భాగము – సంపూర్ణము.



బాలాంత్రపు వేంకటరావు వారి

ప్రాచీన

# స్త్రీల వ్రతకథలు

## తృతీయ భాగము

### 1. అన్నము ముట్టని నోము కథ

కైలాసగిరిమీద గంగాధరులను పార్వతి వేడుకొని పలికెనొక పలుకు, నెలనెల ఈ నిష్టనియమంబుగాను కాంతులు దూరమై కడనుండటేమి?' అని పార్వతమ్మ హరుడు సమ్మతిని చెప్పె నీ కథ నిట్లు చిత్రముగాను వృత్తాసురునిజంపి సుత్రాము డపుడు బ్రహ్మహత్యాదోషాన బాధపడుచుండె, బ్రహ్మహత్యాదోషాన బాధపడలేక ఇంద్రుడు యజ్ఞంబులెన్నేని చేసి, శ్రీమహావిష్ణువునిచేరి ప్రార్థింపనెంచిరి బ్రహ్మహత్యా భాగాలుకాను, మొదటి భాగంబు భూదేవికిచ్చె, రెండవభాగమ్ము వృక్షాలకిచ్చె మూడవ భాగంబు ముక్తినొందింప జగములకిత్తుమని జగదీశుండనెను. నాలుగ భాగమ్ము నాతులకిచ్చె, కాంతలదూరమై కడచుందురిదియె. ఆ గంటు గలుపు వారువ్వరికైన పాపము దేహాల ప్రత్యక్షమగును. శ్రీ గజపతి నిన్ను చిత్తానదలతు తలచెదను మ్రొక్కెదను దేవా! నాధ ఈశ్వరపుత్రుడు నేకదంతుడు వాక్సుద్ధిగాను వరమప్పుడొసగె. శోభిలగుచున్న సూర్యభగవానుడు పాదాల పూజించి, పైడిపుష్పాల పంచనవరత్నాల బంగారుపూని, భక్తితో పూజించి, బాలభాస్కరుల పునుగు జవ్వాది చందనము, కస్తూరి పరిమళగంధాన శక్తితో పూజించి ఈరీతిగా పూజలెల్లకాలమ్ము ముగుదుల చేయవలె మూడువేళలలను ప్రజలసంరక్షణకు బాలభాస్కరుల వనితలకు దానొక్క వ్రతము గావించెను. పణతులకు దానొక్క పాటగావించెదరమీద వెలయ గాపణతులు పాడ అన్నము ముట్టని యాదివారమ్ము వ్రత మొక్కవిధముగా వర్ణించి చెప్పె.

వేదశాస్త్రంబులకు విప్రుండు తాను, అఖిలగుణసంపన్నుడా సౌమయాజు పుత్రుడు లేడుగురును, పుత్రికలిద్దరును శృంగారపుత్రిక చిన్న కుమార్తె అంగవతానుండె నత్తవారింట అమావాస్య పున్నముల విడవకుండ భాండవదూరమై పతికడనుండు నట్టి కష్టంబు తా నతివ పొందుచును తనయ లజ్జించి తన తండ్రి కెరిగించె. ముద్దు కూతురను గాంచి మోహమున తండ్రి చింతించి తనయకు జెప్పెను. నొక బుద్ధి అమావాస్య పూర్ణిమ లంటబనిలేదు. పున్నమునెలజేసి పొలతికడనుండి ఆ తండ్రి పల్కులకు నతివ హర్షించి ఉల్లాసముపొంగె. నుత్పలగంధి తండ్రి వాక్యముబట్టి

తానడుపుచుండె. నింతికి దేహంబు వింతయైదోచె పాపము దేహాన ప్రత్యక్షమాయె. అతివ తనయతిండి నతిక్లేశపడుచు నెటులో దినములు నెట్టుచుండగను తండ్రిని దోడ్కొనివచ్చె. తల్లిని పోషించె. చెప్పిన పాపాలు చెవిని పడవాయె. అధికరోగిష్ఠాయె. నా సోమయాజి పూర్వజన్మమునందు పుణ్యముచేసి ఈలోకమందు దాని జన్మమందు బాలభాస్కరులకు భక్తుడైయుండె. వచ్చి సూర్యాకృతికి వందనముచేసి చెప్పె. వృత్తాంతమ్ము చిత్తగింపగ శరణన్నవారిని గరుణ చేకొంద్రు. మమ్ము రక్షింతురని నమ్మితినిదేవ అజ్ఞానకృతములైనట్టి పాపాల అతిరోగినైతిననైనా సోమయాజి విష్ణు భక్తుండిట్లు విన్నపము సేయ సూర్యభగవాను లతనిజూచి యిట్లనియె–'చూడు మన గ్రామాన సోమిదేవమ్మ సకల ధర్మంబుల సర్వజ్ఞురాలు. పతికి మారాడని పతి వ్రతలమిన్న, పరుల దయతోగాంచె, వరణ్యాశాలిని, మున్నూట యరువది ముఖ్యవ్రతములు అన్నింటిగాంచె, నా భక్తురాలు మమ్ము బూజించునా మగువయే ప్రొద్దు మాకిష్టురాలైన మా భక్తురాలు అన్నము ముట్టని యాదివారము వ్రతము చేయుచుండ వనిత సద్భక్తి వనిత యింటిబోయి వారమ్ము ఫలము అడిగి తెచ్చుకొనిన ఆరోగ్యమనె'ను భాస్కరునియాజ్ఞ విని బ్రాహ్మణుడనెను–'నన్ను జూచినవారు రివ్వుదురు దేవా! చేరనీయర్వెరు సీమలోపలికి.' బ్రాహ్మణుడిటుల పల్క భాస్కరుండనెను– 'అంగలార్పకుమయ్య అంగుళ్ళనుండి ప్రియముగలవారిచే బిలిపింతు నిన్ను, వ్రతము చేసినవాడు వనిత పట్నాన అక్షతలిప్పించె వనిత విప్రులకు, పిలిపించె బ్రాహ్మణుల ప్రీతితోడతను పీటలు పెట్టించె ప్రియము మీరగను'నూటముప్పదిమూడు నేతి బూరె లను తామ్రపాత్రలయందు దనరగానుంచి, వస్త్ర ప్రతిమలుంచి వాయనాలుంచి, పన్నిద్దరు బ్రాహ్మణులను పరికింపగాను, భక్తితో పనిద్దరు బ్రాహ్మణోత్తముల, లెక్కకొక బ్రాహ్మణుడు తక్కువైయుండె. కడు శీఘ్రమేగి యంగడివీధి వెదకి, వృద్ధ బ్రాహ్మణుని జూచి వినయమ్ముతోను తగు ప్రీతితోడ నాతనితోడ తెచ్చి, భగవానుదేవచ్చె బ్రాహ్మణు డనుచు, వ్రతశాంతమాయెనని వనిత యుప్పొంగె. పీటలుపట్టించె ప్రియము తోడుతను అరటాకుపరచిరందమ్ము మీర, కడిదిపాత్రమ్ములు గడు వేడ్కనిడిరి. పాత్రాభిమానాలు భక్తిగానిడిరి. పంక్తి పంక్తి నుప్పువడ్డించినపుడు, వడ్డింపవచ్చె దానతి వేడుకను, పంచభక్ష్యములు పాయసాన్నములు తెచ్చి వడ్డించిరి. దివ్యాన్నములును, కందయు జేమయును గాయకూరలును, మండిగలు నవసరము బిండివంటలును, ఊరగాయలు మంచివారు దప్పళము ఆకుపచ్చడులతో నప్పడములతో అచ్చావు నేతులు నాగడ్డిపెరుగు ఔపోషనములబట్టు నాసమయమందు వినయాన సోమయాజి విన్నపముజేసె 'వనిత నీ వ్రతమొక్కవారమ్ము ఫలము దయచేయవమ్మ నేదానపాత్రు డను' అని బ్రాహ్మణుడు పల్కనాశ్చర్యమంది అతివ తానట్టులనే నందరిని జూచి– 'ఇదియేమి ఆశ్చర్యమిది వింటిరయ్య ధనధాన్య వస్తువుల దానమడుగుదురు. వ్రత ఫలము లడుగుదురు, వచ్చినవారు.' వెలదిమాటలు విని విప్రుడిట్లనెను. అధిక రోగిని గనుక నడిగితిని తల్లీ! రక్షించి వరమిమ్ము రక్షింపుమనె'ను. అంతలో వచ్చిరి అతివకొమాళ్ళు పిన్న పెద్దలుకూడి ప్రియమాడిరపుడు అవతరించి భగవానుడా

సమయమందు తరుణిచే వారఫలము ధారపోయించె, కడుపుచ్చుకోగానే కదలె పాపాలు, వజ్రకాంతులు దేరివచ్చె దేహము, సూర్యకాంతులమీర శోభిల్లె తనువు, చంద్రకాంతులుదేరి సౌరొప్పెమేను, అందరునిగని మోహమంది రాజసులు, అంతా సంతోషించిరా విప్రులంత, ఆరగించిలేచి అతి శీఘ్రముగను, ఆరగించిన వారి హస్తములకెల్ల వాసించి నుదకమువారవోయించె, విప్రులకు గప్పురపు విడియమ్ము లిచ్చె, సంపూర్ణదక్షిణాలు చాలగానిచ్చి భక్తిమ్రొక్కెను బ్రాహ్మణుల కప్పుడు, చేతులు గడిగిరి చితుతళ్ళనొత్తి, చెరి కూర్చుండి చిరుచాపమీద అతిశీఘ్రముగ వచ్చి యా సోమయాజి-'తల్లి నీ వ్రతముచే ధన్యుడనైతి, నీ వ్రతము నేనెట్టు లాచిరించెదను' అని సోమిదేవమ్మ యాతనికి బలికె- 'మంచి ముఖ్యమైన మాఘమాసాన, అయిన పున్నమినాడు నాదివారాన, మజ్జనంబులనాడి మడతగలట్టి, నీమమ్ముతో భక్తి నెల్లవారలను, గోమయముతో నరుగు కొమరొప్పనలికి, పండ్రెండు పాద్యాలు పంచవన్నెలను, నిలిపి మండపమున నెలత లుంచెదరు. కార్యసిద్ధికొరకు గణపతిని దలచి, ఘనముగా సరస్వతిని కాంతలు పూజింత్రు, పండ్రెండు స్నానాలు భానునకు చేసి పట్టుపీతాంబరము భానునకుగట్టి, సకలోపచారాల స్వామిబూజించి, ఆవుపాల పొంగలమరంగపెట్టి ఆదినారాయణున కర్పితనముచేసి, ఉద్యాపన సాంతమ్ము నెప్పుతో వినుడి, నూటముప్పదిమూడు నేతిబూరెలును, తామ్రపాత్రలలోన తనరంగ నుంచి, వస్త్రప్రతిమలుంచి, వాయనాలుంచి, సంపూర్ణ దక్షిణలు చాలంగనుంచి, పన్నిద్దరు బ్రాహ్మణులకు భక్తితో నొసగ, వ్రతసాంగమగునె వైభవమునను 'అతివృద్ధులై నట్టి యతివలకునెల్ల' ఏన్నర్థమీవ్రతము హితమొప్పుననెను. ముట్టందునగు నట్టి ముగుదలకెల్ల మూడేండ్లకీవ్రతము ముగియునని చెప్పి ఆచరింపగలేని యతివలకు నెల్ల పాడగ ఈ కథ పఠియింపవలెను. పఠియింపలేనట్టి పణతులకునెల్ల, పాపము దేహాన ప్రత్యక్షమగును.' అనిన సంతోషించి యాసోమయాజి తగు శీఘ్రమున దన నగరికేతెంచి ముద్దుకూతురుచేత మురిపమున తండ్రి వ్రతము చేయించె, కడువైభవ మునను వ్రతముచేసిన వెనుక వనితపుద్యానవజ్రకాంతులజేరి వచ్చెదేహమ్ము సూర్యకాంతులజేరి శోభిల్ల తనువు చంద్రకాంతులుచేరి సౌందర్యమొసగె.

అందరునుజూచి ముదమందిరి జనులు
అడుగుటకువచ్చిరా యతివలందరు
పాటకంతతబట్టి భాగ్యముక్మ వినుము
వరపుత్రి లక్ష్మక్క వరుసతోడ వినుము
కనకగోదానమ్ము కన్యదానమ్మ
సర్వకృత దానమ్మ సలిపిన ఫలము
కృష్ణజయ! కృష్ణ జయ! కృష్ణమ్మ దలతు
ఇష్టసంపదలు మాకిచ్చి రక్షించి
రామజయ! రామజయ! రామజయ! రఘురామదలతు
నానాటిపాపము నాశనము నాశనము చేయ.

## 2. ములగగౌరీ నోము కథ

ములగ ములగనరాదు-ములగ తినరాదు
ములగనీడ దొక్కరాదు
ములగ ముట్టరాదు - ములగ తినరాదు

ఈ కథ చెప్పుకొని రథసప్తమినాడైనను, మాఘపూర్ణిమనాడైనను అక్షతలు వేసికొని యేడాది ఈ వ్రతము జరుపవలెను. ఈ వ్రతము చేసిన యతివకు అష్టఐశ్వర్యము, ఐదవతనము కలుగును.

**ఉద్యాపనము :** పంద్రెండు జోడాలు ములగకాడలుంచి, దక్షిణ తాంబూలము లుంచి, లక్కజోళ్ళు, నల్లపూసలకోళ్ళువుంచి ఈవిధముగా పంద్రెండు ముత్తయిదువులకు వాయన మియ్యవలెను. ఒక్కొక్క వాయనములో పంద్రెండేసి జోడాలు ములగ కాయ లుంచవలెను. కథ లోపమైనా వ్రతలోపము కాకూడదు భక్తి తప్పిన ఫలము తప్పదు.

## 3. అంగరాగాల నోము కథ

అంగరాగాల నోచిన అంగతన అంగన రాగాలతో, అసమానరత్న భూషణ ములతో అఖండైశ్వర్యములతో, అమితశృంగారముతో, అనంత సంతానముతో, అతి పాడిపంటలతో, ఆపదలెరుగని యానందముతో ఆలుమగల యేకీభావముయై అఖిలగుణ సంపత్తితో, అనంత కాలము ఇహసుఖము లనుభవించి అక్షయలోకాలు పొందుచున్నవి.

ఈ కథ చెప్పుకొని అక్షతలు వేసుకొనవలెను.

**ఉద్యాపనము :** ఐదు బొట్టుపెట్టెలను చేయించి, అయిదు బొట్టుపెట్టెలలోను బొట్టు పెట్టు సామానులును వారివారి శక్త్యానుసారము వుంచి, కాటుక కాయలు కుంకుమ బరిణెలు, నల్లపూసలకోళ్ళు అత్తరులు, పన్నీరు, గంధపు చెక్కలు, దువ్వెనలు, సవరాలు, అగరుండలు బంగారు పువ్వులుగాని గులాబి మొదలగు పువ్వులుగాని యుంచి సబ్బుబిళ్లలుంచి శక్తిగలవారింకను వారి వారి శక్త్యానుసారముగా ముక్కు పుడకలు, కాసులు మొదలగు రవికెలు చీరలు మొదలగునవి నుంచవచ్చును. ఈ విధముగా మంచిగంధము మల్లెపువ్వులు మొదలగునవి వుంచి ఐదు బొట్టుపెట్టెలు దక్షిణ తాంబూలములతో అయిదుగురు ముత్తయిదువులకు సమర్పింపవలయును. శక్తిగలవారు పేరంటాండ్రకు తలంటి భోజనము పెట్టవలెను. కథలోపమైనా వ్రతలోపము కాకూడదు. శక్తి తప్పినా ఫలము తప్పదు.

## 4. అమావాస్య సోమవారముల నోము కథ

ఒకానొక బ్రాహ్మణునికి ఏడుగురు కొడుకులును నొక కూతురును, గలరు. ఆ బ్రాహ్మణుని యింటిలో కోడండ్రు కూతురుగూడ ప్రతిదినము యాయవార బ్రాహ్మణునకు బియ్యం పెట్టుచుండెడివారు. ఆ యాయవారపు బ్రాహ్మణుడు తనకు బియ్యము వేయుటకువచ్చే కోడండ్రను 'సౌభాగ్యవతీభవ' అనియు కూతురును గంగాస్నాన ఫలసిద్ధిరస్తు అనియు దీవించుచున్నాడు. బ్రాహ్మణుని కూతురు ఆ బ్రాహ్మణుని దీవెన విని యొకనాడు తన తల్లిదండ్రులకు జెప్పగా వారొక రోజున బ్రాహ్మణుని 'ఏమ'ని యడిగిరి. బ్రాహ్మణుడప్పుడు వారినిజూచి- 'ఈచిన్న దానికి సప్తపాదాలవద్దనే వైధవ్యము రానున్నది?' అని చెప్పెను. అప్పుడా బాలిక తల్లిదండ్రులా బ్రాహ్మణునికి మ్రొక్కి అతనిని ప్రార్థించి- 'స్వామీ! ఈ దోషమెట్లు నివారణము కాగలదు?' అని వినయముగా ప్రశ్నించిరి. అప్పుడు బ్రాహ్మణుడు 'ఏడు సముద్రాల కావల చాకలి పోలియున్నది. ఆ పోలిదగ్గరికి బాలికను తీసుకొని వెళ్ళినచో ఈ దోషము నది నివారణము చేయగలదు' యని చెప్పెను. అప్పుడా తల్లిదండ్రులు తమ ఏడుగురు కొమారుళ్ళనుబిలిచి-'మీలో నెవ్వరైన మీ చెల్లెలను చాకలిపోలివద్దకు దీసికొని పోవలయున'ని చెప్పిరి. కాని వారి యేడుగురు పుత్రులలో కడసారపు కొడుకు మాత్రమే తల్లిదండ్రులాజ్ఞ శిరసావహించి ధైర్యముతో తన చెల్లిలిని 'ఏడు సముద్రాలు దాటించి చాకలిపోలిదగ్గరకు తీసుకొనివెళ్ళెదనని చెప్పెను. వారటనుంచి వెంటనే వారిరువురిని ప్రయాణముచేసి పంపిరి. ఆయన్న చెల్లెలిని వెంటబెట్టుకొని సముద్రతీరమునకువచ్చి అచ్చట నొక చెట్టు నీడను నిలుచుండెను. ఆ వృక్షాగ్రము నుండి అప్పుడొక పండినపండు రాలి ఆయన్న చెల్లెండ్ర ముందుపడెను. అప్పుడా పండుగైకొని వారిద్దరు చెరిసగమును భక్షించిన వెంటనే ఆ వృక్షముపై నుండి యొక పక్షి దిగివచ్చి వారిరువురను రెక్కలపై నెక్కించుకొని సప్తసముద్రాలు దాటించి చాకలిపోలి వాకిటదించి అంతర్ధానమయ్యెను. అప్పటినుండి వారు ప్రతిదినము చాకలిపోలి వాకిలి తుడిచి కలయింపులు చల్లి యలికి ముగ్గులిడి వెళ్ళిపోయి యొక బసలో భోజనముచేయుచు కాలము గడుపుచుండెడివారు. ఇట్లుండగా నొకనాడు చాకలిపోలి వారిని జూచి-'యిదియేమి? మీరెవ్వరు? నాయిల్లు తుడిచి ప్రతిదినము ఇట్లు పనిచేయుచున్నారేమి పాపము?' యని యడిగెను. అప్పుడు వారామెను జూచి-'అమ్మా! నీవలన మాకొక గొప్పసాయము కావలసియున్నది. అందుచేత నీకిట్లు సేవచేయుచున్నాము' యని చెప్పిరి. చాకలిపోలి వారు వచ్చిన కారణ మంతయు గ్రహించి వారి కభయమిచ్చి అప్పుడు తన కోడండ్రను జూచి- బిడ్డలారా! నేను పనిగలిగి యొకచోటికి బోవుచున్నాను. నేను మరల వచ్చులోపల మన యింట నెవ్వరైన చచ్చిపోయినచో వారిని దహనముచేయక నేను వచ్చునందాక అట్లేయుంచి

జాగ్రత్తగా చూచుచుండుడు యని చెప్పి యాయన్న చెల్లెంద్రను వెంటబెట్టుకొని తన యోగబలంచే వారితో గూడ ఏడుసముద్రాలు దాటి వారియింటికి వచ్చెను. తరువాత నామె యా చిన్నదానికి వివాహము చేయింప వివాహ సమయమున సప్తపాదాలు తొక్కుచుండగా చిన్నదాని పెనిమిటి మరణించెను. చాకలిపోలి యప్పుడు తన యమావాస్య సోమవారముల వ్రతఫలము ధారపోసి చనిపోయిన పెండ్లికుమారుని బ్రతికించెను. అదిచూచి అక్కడి వారందరు చాకలిపోలి మహామహిమకు మహాశ్చర్య మునొంది పరమానందభరితులైరి. కాని చాకలిపోలి తన వ్రతఫలము ధారపోయుటచే ఆమె ఇంటివద్ద ఆమె కొడుకు లేడ్వురును చనిపోయిరి. చాకలిపోలి పెండ్లివారివద్ద సెలవు పుచ్చుకొని తన యింటికి తిరుగువచ్చు దారిలో అమావాస్య సోమవారము రాగా అశ్వత్థ వృక్షమునకు ప్రదక్షిణములు గావించి అక్కడ ఫలము లేమియు దొరక నందున నూటఎనిమది గులకరాళ్ళు పట్టుకొని 108 ప్రదక్షిణములు చేయగా ఇంటివద్ద చచ్చిన యామె కొడుకు లేడుగురును మరల బ్రతికిలేచిరి. తరువాత చాకలిపోలి యింటికి వచ్చెను. ఆమె కోడండ్రందరును ఆమెను చుట్టుకొని అత్తా! ఇది ఏమివింత? ఇట్లు జరిగినదని యడిగిరి. అప్పుడు పోలి కోడండ్రతో-'అది అంతయు అమావాస్య సోమవారవ్రత ఫలమ'ని తెలియజెప్పి తన కోడండ్రచే యధావిధిగా నోము పట్టించెను.

**వ్రత విధానము :** 108 అమావాస్య సోమవారములు ఈ వ్రతము చేయ వలెను. అశ్వత్థవృక్షమునకు 108 ప్రదక్షిణములు చేయవలెను. ప్రదక్షిణము చేయు నపుడు-మూలతో బ్రహ్మరూపాయః మధ్యతో విష్ణురూపేణః అగ్రత శివరూపాయః వృక్షరాజాయతేనమః అను మంత్రమును పఠించుచుండవలెను. 108 ప్రదక్షిణముల కును 108 రత్నములుగాను, 108 ఫలములుగాని, ఏవైన నుపయోగమైన వస్తువులు గాని ఒక చోట వేయుచుండవలెను. ఈ విధముగా 108 ప్రదక్షిణములు పూర్తి యయినప్పటికి తన చేతిలోనున్న నూటయెనిమిది వస్తువులను క్రిందనొక పళ్ళెములో పెట్టివేయవలెను. ఐదుసేర్ల బియ్యము అశ్వత్థవృక్షమువద్ద మండపముచేసి, లక్ష్మీనారాయణ ప్రతిమ బంగారుతో చేయించి నందుదుంచి లక్ష్మీ నారాయణ పూజయు, అష్టదిక్పాలకపూజయు, యధావిధిగా జేసి తరువాత మండ పము నుత్తమ బ్రాహ్మణునకు ధారపోసి ఆ 108 వస్తువులను అందరకును పంచి పెట్టవలెను. యీ విధముగా 108 అమావాస్యా సోమవారములను నోచుకొనవలెను.

**ఉద్యాపనము :** నూట ఎనిమిది కలశములుపెట్టి అయిదు కుంచముల బియ్యము మండపముపోసి లక్ష్మీనారాయణ ప్రతిమను యుంచి అష్టదిక్పాలకులను పూజించి బ్రాహ్మణునకును, మండప దానముచేసి కలిశలు మొదలగునవి బ్రాహ్మణులకు, ముత్తయిదువులకు తక్కినవారికి పంచిపెట్టవలెను. యీ వ్రతము సిరిసంపదలను వృద్ధిచేసి కైవల్య పదవి నిచ్చుచున్నది.

## 5. నిత్య విభూతి నోము కథ

ఒకానొక సోమయాజులుగారికి లేక లేక ఒక కూతురు కలిగినది. ఆమె నతిగారము మహాగారముతో అరచేతిలో వెన్నప్పములాగున పెంచి పెద్దదానిని చేసి కట్నాలిచ్చి కానుకలిచ్చి భూములిచ్చి మాణ్యాలిచ్చి భాగ్యాలిచ్చి అనుకూలవరునికి సోమయాజులుగారా బిడ్డకు అతివైభవముతో పెండ్లిచేసిరి. పెండ్లి పేరంటములైన కొన్ని రోజులకే పిల్ల పెద్దదైనది. అత్తవారువచ్చి అనురాగముతో కోడలిని పంపుమని కోరగా సోమయాజులుగారు మారుమాట చెప్పలేక సోమిదేవమ్మను సమాధానపరచి శుభకార్యానికి తగిన సన్నాహముచేయించినారు. అతి వైభవముతోను, మహావైభవము తోను అమ్మాయికి శుభము జరిగించి అత్తవారింటికి పంపిరి. అత్తవారింటిలో రాజుల చేతి నిమ్మపండువలె, పంజరములోని రామచిలుకలాగున బహుముద్దుగా బ్రాహ్మణ బిడ్డలా పెరుగుచున్నది. పాలు నీళ్లు కలబోసినట్లు భార్యాభర్తలున్నారు. అన్నియు బాగున్నవి, కానీ యీ పిల్లకొక బాధపట్టుకొన్నది. కట్టిన కోటనచ్చదు. పెట్టిన బొట్టు కుదురదు. ఉన్న సొమ్ములు గిట్టవు ఏమికావలెనో ఎరుగదు. ఏదో కావలెనని బెంగ, ఉన్నదానితో తృప్తిలేదు. సంతోషములేదు, ఉత్సాహములేదు, సర్వకాల సర్వావస్థలు సంతాపమే. అదిచూచి అత్తగారొకనాడు వియ్యంకునితో 'ఇదేమన్నా! యీ బిడ్డ విచారినికి కారణము తెలియదుకన్నులలో పెట్టుకొని కాపాడు కొనుచున్నాము మాటెత్తులోపము లేకుండా మారాజకూచి బిడ్డవలె జరుపుచున్నాము. అని చెప్పినది. అది విని సోమయాజు లంతయును గ్రహించి బిడ్డలో అసంతుష్టి రోగము ప్రవేశించిన దని తెలుసుకొన్నాడు. వెంటనే ఆయన కూతురువద్దకేగి-'అమ్మా! నిరంతరము సంతుష్టి-నిత్యము ఐదవతనము కలిగించు నోమొకటున్నది నోచుకొనుమమ్మా!' అన్నాడు. 'అంతకంటె నున్నదా చెప్పవయ్యా తండ్రి!' అన్నదాబిడ్డ. వెంటనే సోమయాజులు బిడ్డచే నోము పట్టించి ఉద్యాపనము చేయించినాడు. రోజుకొక ముత్తయిదువకు తలదువ్వి బొట్టుపెట్టి శక్తికొలది సకల శృంగారాలు చేసి తాంబూలా లిచ్చి దండము పెట్టి పంపుచు నొక ఏడాది యిట్లు వ్రతమాచరించిరి. సోమయాజులు గారి కూతురు ఏడాది అగునప్పటికి కెక్కడిలేని సంతోషమును, ఎక్కడలేని యానంద మును, నిత్యసంతుష్టి కలిగి, నిర్మలానందముకలిగి, సకల సౌభాగ్యాలు కలిగి, సంతా నము కలిగి, చింతలుపోయి, చివుకులుపోయి, వంతలుపోయి, వాదులుపోయి అత్తవారింటిలో అల్లారుముద్దుగా, కన్నవారింటిలో కంటిలోపాపగా సోమయాజులు గారి కూతురు సుఖసంతోషాలయమై జగానికెల్లా సంతోషము కలిగించినది. ఆమె పట్టిన నోము జగమెల్ల పట్టెను. ఏడాదిలో నైననుసరే తరువాత నైననుసరే ఉద్యాపనము చేయవలెను.

**ఉద్యాపనము :** ఆకులతోను, పోకలతోను, అన్ని సంబరములతోను, ఐదు తాంబూలములమర్చి శక్తి గలవారు చీరలు, లేనివారలు రైకలుంచి, ఐదు

తాంబూలములతో అయిదు విభూతి పండ్లుంచి శక్తికొలది కానులో, రూకలో, కాసులో దక్షణలుంచి పరమేశ్వరుగుడిలో పార్వతి సన్నిధానమందు ఐదుగురు ముత్తయిదువులను పసుపు కుంకుమతోను, పన్నీరత్తరువులతోను, గంధకర్పూరాలతోను అలంకరించి, పూజించి ఆ ఐదు తాంబూలాల వాయనము ముత్తయిదువుల కియ్యవలెను. వాయనాలందుకున్న వనితలు తాంబూలలోనున్న విభూతిపండ్లను దీసి దైవరాయుడైన పరమేశ్వరుని సన్నిధిని నుంచవలెను. తక్కిన చీరలు, రైకలు, దక్షిణ తాంబూలాలు వారు తీసుకొనవలెను. కథలోపమైనా వ్రతలోపముకారాదు. భక్తిలోపముకాకున్న ఫలలోపముకాదు. అక్షతలు తప్పినా లక్షవేలలైదవతనము తప్పదు.

## 6. కడుపుచెదరని గౌరీ నోము కథ

### (దీనినే పొట్టకథలని గౌరీనోము కథ అందురు)

వేదపండితుడేకాని పేదపారుడగుటచే ఆయన కెవ్వరును పిల్లనిచ్చినారుకాదు. ఆ బ్రాహ్మణుని విద్యయు బుద్ధియుజూచి, గుణము గౌరవముజూచి, నీయమము నిష్టనుజూచి, తెలివితేటలుజూచి, భక్తిశ్రద్ధలజూచి పండితుడైన బ్రాహ్మణుడొకడు- 'యీతడే అల్లుడు కాగల'డని భావించి తన ముద్దులకూతురుని చక్కనిచుక్కనిచ్చి ఆకాశమంత పందిరి భూదేవంత అరుగువేసి ఆ బాల పండితునకు ఆ పేదబాపనికి మహావైభవమున పెండ్లి చేసినాడు. పెరిగి పెద్దదైన బ్రాహ్మణుని కూతురు కాపురమునకు వెళ్ళినది. పేద బాపడు పెన్నిధి దొరికినట్లానందించుచు తన యిల్లే కైలాసముగాను, తన యిల్లాలే పరమేశ్వరిగాను భావించుకొనుచు పరమానందముతో కాలము గడుపుచుండెను. తండ్రికి కన్యాదానఫలము దక్కనిచ్చి, పేదసారులకు గృహసౌఖ్యము తెలియనిచ్చి ఉన్నదోలేదో రెండవకంటివారికి తెలియకుండా కలదానితోనే గంపెడు సంతుష్టి నొందుచు, ఇరుగుపొరుగు వారిలో మెరుగులు చూపుచు శుచిగలిగి, శుభ్రతగలిగి, నీమముగలిగి, నిష్టగలిగి, విద్యగలిగి, బుద్ధిగలిగి, శుభంగలిగి, గౌరవం గలిగి, తెలివిగలిగి, తేటగలిగి, అందంగలిగి, చందం గలిగి, భక్తిగలిగి, శ్రద్ధగలిగి, యిట్లు దిద్దుచూ, అత్తమామలకు తలలో నాలుకలాగ ఆడుబిడ్డలకు అక్క చెల్లండ్రలాగు, తోడికోడండ్రుకు తోడునీడలాగు, ఇరుగుపొరుగువారి కిలవేల్పులాగు, భర్తకు ప్రాణాధిదేవతలాగు, సోమయాజులుగారి ముద్దు కూతురు కాపురము చేయుచున్నది. యీలాగున నుండగా చెఱకునకు పండుపండినట్లా పిల్లకు నెలతప్పినది. సకలజనులు సంతోషముతో ఆవిడకన్ని గారాబములు జరుపుచున్నారు. రోజురోజుకు కళలుదేరుచు, ఆబాల బంగారు బొమ్మలాగు, రత్నాల రామచిలుకలాగు మెరిసిపోవుచున్నది. రెండు నెలలు గడచినవి మూడునెలలు గడిచినవి, నాలుగు నెలలు గడవకుండ వొకనాడు తగనిబాధ గలిగి యా పిల్లకు గర్భము విచ్ఛిత్తయిపోయినది. 'అయ్యో!' అని యిరుగు పొరుగువారు, అత్తింటివారు, పుట్టింటివారు, అందరు చిన్నమొగము వేసుకొని విచారించినారు. తరువాత మందులు మ్రాకులు వేసికొని పిల్లనోదార్చుకొని-

'పోయింది పొల్లు ఉన్నది గట్టి' అని క్రమముగా మనస్సమాధానము చేసుకొన్నారు. అదియేమి పాపమో! పాలసముద్రములో విషములాగు, చంద్రునిలో మచ్చలాగు, ఆ చిన్న దానికి ఒక కష్టము కలిగినది. అది మొదలు సోమయాజులుగారి కూతురికి యేయేడు కాయేడు యిలాగు గర్భములు గలుగుచుపోవు చుండెను. అందరు విచారించుచుండిరి. 'అయ్యో! కన్నతల్లిదండ్రులకు కలత తెచ్చి పెట్టితిని. అత్తమామల కలసట తెచ్చిపెట్టితిని. పండియు పొల్లయి పోవుటకు పాపమేమి చేసితినో పరమేశ్వరా! పరమేశ్వరీ యని సోమయాజులుగారి కూతురి ఆ పురాణదంపతులను నిరంతరము ధ్యానించుకొనుచు, చూచిన దైవాలకు మ్రొక్కుచు, చెప్పినదైవాలను సేవించుచు, పుణ్యచింతతో ప్రొద్దులుగడుపుచుండెను. ఈలాగునుండగా నొకనాటి యుదయమున వారింటికొక పండుతమలపాకులాంటి పేదముత్తయిదువ వచ్చినది. ఆ యిల్లాలి కర్ఘ్యపాద్యాలిచ్చి కూర్చుండుమని పీటవేసి మంచిమాటలతో మర్యాదచేసి – "అమ్మా! దయగలిగి మాయింటికి దయచేసినారు, గౌరీదేవివలె కన్నులకు చల్లగా, మహాలక్ష్మి వలె మనసుకు హాయిగా, మిమ్ములనుచూచి వదలలేకున్నాను, ఈపూట మాయింటి వద్ద మాకున్న భాగ్యములారగించి మమ్ములను ధన్యులను జేసి మరివెళ్ళుదురుగాని తల్లీ! నేటి కాగుమమ్మా' యని యామెను సోమయాజులుగారి కూతురు వేడుకొన్నది. అందులకా యిల్లాలు సమ్మతించి దయారస మొలుకు కనుబొమ్మలతో చూచిదగ్గరగా దీసికొని గారవించి సోమయాజులు కూతురితో–'అలాగుననే చేతువులేవమ్మా!' అన్నది. ఇంటిలోనివారందరు వచ్చి ఆ ఇల్లాలి నాదరించిరి. భక్తి శ్రద్ధలతో వారు పెట్టిన పప్పన్నమే పదివేల పిండివంటలవలె భోజనముచేసి సంతుష్టివదనముతో చల్లని చూపులతో ఆ యిల్లాలు వాకిట చిరుచాపమీద కూర్చున్నది. వినయవిధేయతలతో వేడుకలాడుచు వీడెము మడచి యిచ్చుచు సోమయాజులుగారి కూతురు ఆమె దగ్గరనే కూర్చుండినది. సోమయాజులుగారి కూతురి కప్పుడు మరల నాలుగవ మాసము జరుగుచున్నది. 'బుద్ధిమంతురాలైన పుణ్యశాలినివేగాని, భక్తి శ్రద్ధలున్న భాగ్యశాలినివేగాని, అన్ని సుఖములుగల యదృష్టశాలినివేగాని, గర్భదోష మున్నట్లగు పడుచున్నావు. కాంతా! నిజమేనా?' యని సోమయాజులుగారి కూతురి నడిగినదా యిల్లాలు. ఆమాట వినగానే యాపిల్ల వొడలుజల్లుమన్నది. బ్రహ్మదేవుని వదనమందలి భాషాదేవియా! విష్ణుదేవుని వక్షమందలి లక్ష్మీదేవియా? దేవదేవుని అర్థదేహమయిన పార్వతీదేవియా? ఎవరు చెపుమా యీ యిల్లాలు? ఈమెను జూడగానే యీమె మాటలు వినగానే పరవశమై పోవుచున్నాను. ఈమె పాదములు పట్టుకొనుటకు బుద్ధితొందరచేయుచున్నది' అని యనుకొని సోమయాజులు గారి కూతురిక నాగలేక నాయిల్లాలు పాదపద్మాలు కన్నుల కద్దుకొని 'తల్లీ! నా పాపములుబాపి రక్షించవమ్మా!' అని ఆమెను ప్రార్థించినది. 'కడుపుచెదరని గౌరీదేవి నోముపట్టవే బిడ్డా! కడుపుశోక ముండద'ని చెప్పి, దాని కుద్యాపనము చెప్పి యా యిల్లాలు అంతర్ధానమైనది. ఆ పలుకులు శిరసావహించి–'నీవే నా పాలిటి పార్వతీదేవివ'ని ఈమెకు మ్రొక్కుచు,

భక్తిశ్రద్ధలతో ఆ నోముపట్టి సోమయాజులుగారి కూతురు ఉద్యాపనము చేసుకొన్నది. ఆమె కడుపున పాలసముద్రమున బాలచంద్రునివలె బంగారువంటి కొడుకులు పుట్టి బాగున్నారు. ఆ తరువాత మువ్వలనాడు తెడుకు, గజ్జెలవాడు కొడుకు, కొడుకులు తరువాత కొడుకులును, కూతుండ్రు తరువాత కూతుండ్రును పుట్టిన ఇల్లంతయు కొల్లల కొఠార్రై, కమలాలకొలవై, భాగ్యాలపంటై సోమయాజులుగారి కూతురు తులలేని భోగభాగ్యాలతో తులతూగుచు, పుట్టెడు పసుపు, పుట్టెడు కుంకుమ, పాలకుండ చెదరకుండ కలకాలము సుఖముగా జీవించి కడపట గైలాసము చూరగొన్నది.

ఈకథ చెప్పుకొని అక్షతలు వేసుకొనుచు ఈమె నోచిన నోము భామలంతా నోచిరి. యీ నోము నోచినమ్మకు కడుపు శోకముండదు. కలిమికి లోటుండదు. కలకాలమైదవతనము, కైలాసప్రాప్తి కలుగును. భక్తి తప్పకున్న ఫలము తప్పదు.

**ఉద్యాపనము :** అయిదు మానికల బియ్యము కడిగి; నానబెట్టి విసిరి జిల్లేడు కాయలు వండవలెను. అందులో కొబ్బరిపూర్ణమో నువ్వుపప్పు పూర్ణమో పెట్టవలెను. అంత పిండికలిపి యిరవై అయిదు కాయలుచేసి గజ్జికాయలు వాసెనమీదపెట్టి వాని పొట్టలు విచ్చిపోకుండ శ్రద్ధతో వంటచేయవలెను. పొట్టవిచ్చని గౌరీదేవి నోము కనుక జిల్లేడుకాయలు పొట్టలు విచ్చిపోకుండా జాగ్రత్తగా వండవలెను. అవి అయిదు గురు ముత్తయిదువులకు అయిదేసి చొప్పున దక్షిణ తాంబూలములుంచి వాయనము లీయవలెను.

## 7. నిత్యదానము నోము కథ

"నిత్యదానముచేతి నియమంబు గలుగు
నిత్యదానముచేత కష్టములు తొలగు
నిత్యదానముచే నసత్యంబు తొలగు
నిత్యదానముచేత నిఖిలము లభించు
నిత్యదానముచేత నిరయము నశించు
నిత్యదానముచేత నెలతకు జూడ
నిత్యదానముచేత వైకుంఠమబ్బు"

యీకథచెప్పుకొని అక్షతలు వేసికొని ఒక ఏడాది ప్రతిదినమును బ్రాహ్మణునకు చేరెడు బియ్యము. ఒక కూరయు నిచ్చుచుండవలె.

**ఉద్యాపనము :** ఎద్దుతొక్కని ధాన్యమేదుం గుంచెడు జాగ్రత్తపెట్టుకొని, కొత్త పంచెలచాపుతో, శక్తికొలది దక్షిణతాంబూలములతో కాయగూరలతో, దుంపకూరలతో పిండివంట సామానులతో బ్రాహ్మణునకు దానము చేయవలెను.

## 8. నిత్యధాన్యము నోము కథ

ఒకానొక రాజునకు సకలైశ్వర్యములుండెను. గాని అజీర్ణరోగముతో అహర్నిశలు బాధపడుచుండెను. పాపమారాజు చిన్నమెత్తు అన్నమైనతినలేక పండు రోత, ఫలమురోత, తిండిరోత, తీర్థము రోత, ఇండ్లురోత, వాకిండ్లురోత, పెండ్లము రోత, బిడ్డలురోత, తనువురోత, తామురోత, సకలమురోతై చావలేక బ్రతుకుతున్నాడు. స్నేహితులు, పురోహితులు, మంత్రులు, సామంతులు, అందరుచేరి యా రాజుచేత మందులు మ్రాకులు మ్రింగించుచు, ఎన్నెన్నో పున్నెములు చేయించుచున్నారు. ఇట్లుండగా ఆరాజు పట్టణములో నొక వృద్ధబ్రాహ్మణుడు వచ్చి–'పెట్టినవారికి పుట్టినదే సాక్షి' అని పెద్దపెట్టున గొంతెత్తిపాట పాడుచు వీధులవెంట తిరుగుచుండెను. ఆ బ్రాహ్మణుని కంఠమాధుర్యం గోపాల బాలుని వేణుగాన మాధుర్యము లాగున్నది. కనక ఆ యూరివారందరు గోపాలకృష్ణుని గోపికలులాగున ఆ బ్రాహ్మణుని బట్టుకొని విడువక తిరుగుచున్నారు. ఈ సంగతి వెంటనే మంచము మీదనున్న రాజునకు తెలిసింది. రాజాయనను తక్షణమే భక్తిశ్రద్ధలతో తన యొద్దకురప్పించుకొన్నాడు. ఆ బ్రాహ్మణుడును దేదీప్యమానముగానున్న అగ్నిశిఖలాగు వెలిగిపోవుచు రాజు యెదుట రత్నపీఠముపై గూర్చుండెను రాజునకు ఆయనను చూడగానే హృదయ ముప్పొంగిపోయినది. ఎప్పుడు నెరుగని ఈవింత సంతోషమును బొందుచు రాజు బ్రాహ్మణునిజూచి 'స్వామీ! ఎంతో పుణ్యము చేయుటచే మీ దర్శనము నేడు నాకు దొరికినది అని ఇంక నేమేమో చెప్పబోవుచుండగా ఆయన రాజుని జూచి 'అలాగు చేసినావు కనుకనే యీలాగువచ్చినాను. అది నిజమేగాని నీ పూర్వవృత్తాంతము వినవోయి రాజా! నీవు పూర్వజన్మమున మహాధనికుడవైయుండి ఒక ప్రాణికొక పట్టెడన్నమైన పెట్టనొల్లక ధన ధాన్యములన్నియుదాచి పెంచిమూటగట్టి మూలనుబెట్టి మూలుగునట్లుచేసి మురిసి మురిసి చచ్చినావు. అందుచేతనేన నీకిప్పుడా భాగ్యము లన్నియు నీయెట్టయెదురుగజేరి ప్రత్యక్షములై పిశాచమువలె నిన్ను పీడించుచున్నవి. 'పెట్టినవారికి పుట్టినదే సాక్షి' నీవెవ్వరికి ననుభవింప బెట్టినావుకాదు. కనుక నీవిప్పుడు వాని ననుభవించుటకు నధికారములేదు. ఆ పాపముచేతనే యిప్పుడు బాధపడు చున్నావు. ఆ పాప నివారణార్థమని సంకల్పించుకొని నీవిప్పుడొక వ్రతము చేయుము. నిత్యము వొక బ్రాహ్మణునకొక దోసెడు ధాన్యము, నొక కూరయు దానము చేయుము. ఇట్లొక సంవత్సరముభక్తి శ్రద్ధలతో చేయుము. సంవత్సరము లోపలనైనను, తరువాతనైన ఎద్దు తొక్కని ధాన్యం ఎనుబది కుంచములు ప్రోగుచేసి, బంగారుతీగ దానిచుట్టుజుట్టి, నూతనవస్త్రములుంచి కాయకూరలు, కందకూరలు, పిండివంట సరకులు నేతిమజ్జిగలు సువర్ణ దక్షిణ తాంబూలములుంచి ఉత్తముడు. సంపన్న గృహస్థుడు నైన పేదపారున కుద్యాపన చేయుము' అని చెప్పి యాదేవు డంతర్ధాన మయ్యెను. రాజంతాశ్చర్యంపొంది 'హితులారా! పురోహితులారా! మంత్రులారా! సామంతులారా! చెప్పిన పుణ్యములన్నియు చేసితిని, కనుకనే యిప్పుడు దేవుడు

నాకు ప్రత్యక్షమైనాడు. నేనింక ధన్యుడనైతిని. నా పాపములు పటాపంచలైనవని చెప్పి నిత్యధాన్యమగు నోము భక్తిశ్రద్ధలతో చేసి ఉద్యాపనము కావించెను. రాజు రోగము రవ్వంతైన లేకుండపోయి యాతం డఖిలభోగభాగ్యముల ననుభవించెను. ఈ కథచెప్పి అక్షతలు వేసుకొని యీనోము సకల జనులు నోచి సఫలులైనారు. భక్తి తప్పకున్న ఫలము తప్పదు.

## 9. ధైర్య గౌరీ నోము కథ

రాజు కూతురును ప్రధాని కూతురును ధైర్య గౌరీనోము పట్టినారు. రాజుకూతురు గర్వముచే నోముల్లంఘన చేసినది. ప్రధాని కూతురు భక్తిశ్రద్ధలతో నోము సాంతముగాచేసుకొన్నది. ఆ తరువాత వారిద్దరు మరొక జన్మములో మరల రాజుకూతురు ప్రధాని కూతరులై పుట్టినారు. ఈ బిడ్డ లిద్దరు చిన్ననాటి నుండియు కలిసి మెలసి యాడుకొనుచు గారాబముగా పెరుగుచున్నారు. ఆటలలోను పాటల లోను అన్ని పనులలోను మంత్రి కూతురు ధైర్యముతో విజయము పొందుచుండెను. రాజు కూతురునకు మాటలాడుటకు భయమూ, పని చేయుటకు భయమూ, పలుకరించుటకు భయమూ ఆమె అన్నింటికి ఆ ధైర్యముగా నుండెడిది. 'పిల్లకు చిన్నతనము గనుక ఆలాగున్నదని రాజును రాణియు నశ్రద్ధగావించిరి. రాచబిడ్డ పెద్దదయినదికాని యా జబ్బు మాత్రముపోలేదు. తల్లిదండ్రులు, అత్తమామలు, భర్త బంధువులు అందరు ఆ పిల్ల కొరకు బెంగపెట్టుకున్నారు. పిల్ల చీటికి మాటికి ధైర్యములేక యేడ్చుచు కూర్చుండేది. 'లేక లేక కలిగిన యీ పిల్లకీ కళంక మేమి చెపుమా!'యని భార్యభర్తలిరువురు దైవములకు మ్రొక్కుచు– 'తమ యాపద బాపుమ'ని దైవమును వేడుకొనుచుండే వారు ఇట్లుండగా భక్తుల మొరవిని పరమేశ్వరు డొకనాడు ముసలి బ్రాహ్మణ వేషముతో వారింటికి వచ్చెను. రాజు కూతురు దీర్ఘవిచారముతో గడగడ వణుకుచు ఏడ్చుచు నొకమూల కూర్చున్నది. అది చూచి ఆ మాయ బ్రాహ్మణు–'దదియేమ'ని యడిగెను. ఆమె తలిదండ్రులు వృత్తాంతమంతయు నా దేవునకు భక్తిశ్రద్ధలతోడ చెప్పుకొనిరి. అప్పుడా బ్రాహ్మణ వేషమైన పరమేశ్వరుడు– ' ఈబిడ్డకి కష్టము తీరుటకొక వ్రతము చేయవలెను. పూర్వజన్మమందీ మీ ధైర్యగౌరీ నోము పట్టి ఉల్లంఘనము చేసినది. అందుచేత నీమె ధైర్యములేక యిట్లు కృసించి పోవుచున్నది' అని చెప్పి, యంతర్ధానమయ్యెను. వెంటనే రాజదంపతులు, రాజ కుమార్తెయు ఆశ్చర్యమగ్నులై– 'దేవుడు ప్రత్యక్షమై వ్రతము చెప్పినాడ'ని తెలిసికొని భక్తితో ఆయన చెప్పినట్లా వ్రతము యధావిధిగా చేసిరి. వెంటనే బాలిక సురక్షితురాలై ధైర్యస్థైర్యము కలిగి సుఖసంతోషములతో భర్తతో గాపురము చేయుచు, కడుపునిండ బిడ్డలుగాంచి, సిరిసంపదలతో తులతూగుచు, నిత్యకళ్యాణము పచ్చతోరణముతో, పదివేలేండ్లు బ్రతికి పార్వతి సాన్నిధ్యము నొందెను. ఆమె నోచిన నోము భామలందరు నోచి యిష్టార్థముల నందిరి. భక్తితప్పకుంటే ఫలము తప్పదు.

**ఉద్యాపనము :** ఈ కథ చెప్పి అక్షతలు వేసుకొని తవ్వెడు గిద్దెడు ఆవునెయ్యి, వరహాయెత్తు భమిడివత్తతో ఒక్కటే దీపముగా వెలిగించవలెను. మానెడు సోలెడు ఆవుపాలలో కావలసిన బియ్యము వేసికొని వండి నైవేద్యముపెట్టి యెవ్వరికి పెట్టకుండ భోజనము చెయ్యవలెను. దీపము కొండయెక్కే వరకు భోజనము చేయరాదు. ఈ దీపము చాతుర్మాసములో నెప్పుడైన నొకప్పుడు వెలిగించవలెను.

## 10. దీపదానము నోము కథ

దీపదానము నోచినవారికి పాపాలన్నియు బాసిపోవును.
దీపదానము నోచినవారికి పాపాలన్నియు మాసిపోవును.
దీపదానము నోచినవారికి దివ్యపథంబు సన్నిధియగును.
ఈకథ చెప్పుకొని అక్షతలు వేసికోవలెను.

**ఉద్యాపనము :** ముప్పదిమూడు వెండి ప్రమిదలు శక్తికొలది చేయించి వానిలో నొక్కక్క దీపము వెలిగించవలెను. ఈ దీపము కమలవత్తులతో వెలిగించవలెను. కమలవత్తి యనగా పదమూడు పోచలు కలిపినవత్తి ఎనిమిది ముక్కల క్రింద త్రుంచి ఆ యెనిమిది ముక్కలు కలిపి ఒక్కవత్తిగా నలపవలెను. దీనిపేరు కమలవపువొత్తి ఈ కమలపువొత్తులు ప్రమిదక్కొక్కటి చొ్ప్పున వెలిగించి దీపములు వెలుగుచుండగా శక్తికొలది దక్షణ తాంబూలాదులతో బ్రాహ్మణునకు దానమీయవలెను. ఈయుద్యాప నము కార్తీక మాసములోచేయవలెను.

## 11. నవగ్రహ దీపాల నోము కథ

సోమయాజులుగారి కూతురొకనాడు తండ్రిదగ్గరకు వెళ్ళి-'తండ్రీ పట్టినదెల్ల బంగారమగుటకు, ముట్టినదెల్ల ముత్యములగుటకు, కోరికలెల్ల కొనసాగుటకు, ఆరని నైదవతనము కలుగుటకు, కడుపుచలువ గలుగుటకు ఏమి నోచవలెనండి?' యని యడుగగా ఆయన ముద్దులకుమార్తె యుద్దేశమునకు మెచ్చి ఈనోము చెప్పినాడట. ఆమె యీ నవగ్రహదీపాల నోముపట్టి యుద్యాపనము చేసికొని యిష్టసిద్ధులు పొందిన దట.

**ఉద్యాపనము :** తొమ్మిది కొత్తమండిగలు తెచ్చుకొని మండిగ యొక్కంటికి సేరుంబావు చొప్పున నూనెపోసి మండిగ యొక్కంటికి వరహాఎత్తు వత్తి (అనగా పావలాయెత్తుకట్టె, అణాయెత్తు కట్టెవేసి యుంచినచో వరహాయెత్తు) ఏకువలెనలిపి, చమురులోముంచి, దీపము వెలిగించవలెను. నవధాన్యము తవ్వెదున్నర సోలెడుగాని, మానెడు సోలెడుగాని తెచ్చుకొని ఒక్కొక్క దీపము దగ్గర ఒక్కొక్క ధాన్యము దినుసు లుంచవలెను. తొమ్మిది తాంబూలములుంచి వానిలో ఒక్కొక్క పావులా చొప్పున దక్షణ యుంచవలెను. కొంచెము కొంచెముగా నవధాన్యములన్నియు కలిపి,

మండిగల క్రింద కొంచెము పోయవలెను. విఘ్నేశ్వర పూజయు, శివునికభిషేకమును చేయించి, ఈ దీపములన్నియు శివాలయములోనే తొమ్మండుగురు బ్రాహ్మణులకు ఒక్కొక్క మండిగా ఒక్కొక్క దక్షన తాంబూలములతో నియ్యవలెను. ఇది దీని యుద్యాపనము. శక్తి కొలది ఒకరికో యిద్దరికో బ్రాహ్మణులకు సమారాధన చేయ వలెను. ఈనోము కార్తీక మాసములో చేయవలెను.

## 12. పెద్ద సంక్రమణ దీపాల నోము కథ

'ఎన్ని పుస్తకాలు చదివినా, ఎన్ని పురాణాలువిన్నా, అజ్ఞానాంధకారము వదలిపోకుండా వున్నది. ఎటుచూచినా చీకటే, ఎటుచూచినా అంధకారమే, ఏమిచేతును? ఏమి నోమునతోతును? ఏమి వ్రతము చేతును చెప్పవయ్యా తండ్రీ' అని సోమయాజులుగారి కూతురు తండ్రీ నడిగినదట. అడిగితే తండ్రి 'అజ్ఞానాంధ కారము వదలిపోయే నోము, అంతరంగశుద్ధిచేసే నోము, అఖండజ్యోతి గనపరచే నోము పెద్ద సంక్రమణ దీపాలు పెట్టవమ్మా!' అన్నాడు. అప్పుడాపిల్ల ఆ నోము పట్టి తండ్రి చెప్పినట్లు ఉద్యాపనము చేసికొని ధన్యురాలై యీశ్వరుని కృపచే ఇహపరాలు చూరగొన్నది.

**ఉద్యాపనము** : సంక్రమణ ప్రవేశము కాగానే శివాలయము లోనికివెళ్ళి తొలియేడు సేరునెయ్యి, సేరునూనెతో రెండు దీపాలు వెలిగించవలెను. నేతి దీపము నకు భమిడివత్తి, నూనెదీపమునకు కొండవత్తి వరహాయెత్తు చొప్పున గింజతీసిన వత్తి వత్తులుచేసి రెండుదీపాలు రెండు వరాయెత్తులు వెలిగించవలెను. దీపాలు వెలిగించి శక్తికొలది ఒకరికో ఇద్దరికో ఎందరికో బ్రాహ్మణులకు భోజనము పెట్ట వలెను. ఈలాగున ఐదేండ్లు దీపములు పెట్టవలెను. మొదటియేడు వరాయెత్తు ప్రత్తి రెండవయేడు రెండువరాలెత్తు, మూడవయేడు మూడు వరాలెత్తు, నాల్గవ యేడు నాల్గవరాలెత్తు, ఐదవయేడు ఐదువరాలెత్తు చొప్పున భమిడిపత్తి కొండపత్తి తెచ్చుకొని మొదటియేడు సేరునెయ్యి, సేరునూనె రెండవ యేడు రెండుసేర్ల నూనె, నాలుగవయేడు నాలుగుసేర్ల నెయ్యి, నాలుగుసేర్ల నూనె, అయిదవయేడు అయిదు సేర్ల నెయ్యి, అయిదుసేర్ల నూనెపోసి నేతికి భమిడిపత్తి, నూనెకు కొండపత్తి వత్తులుచేసి శివాలయములో అయిదేండ్లు దీపాలు వెలిగించవలెను. ప్రతియేడు శక్తికొలది బ్రాహ్మణ భోజనము పెట్టవలెను. దక్షణ తాంబూలము లీయవలెను.

## 13. విష్ణు విదియల నోము కథ

రాజు కూతురు బ్రాహ్మణునికి కూతురు విష్ణు విదియల నోము పట్టిరి. బ్రాహ్మణునికూతురు భక్తిశ్రద్ధలతో నోము నోచుకొన్నది. రాజుకూతురు రాజసముచేత నోముల్లంఘనచేసినది. భక్తిశ్రద్ధలతో నోము నోచుకొన్న బ్రాహ్మణ బాలిక అష్టయిశ్వర్య ములతోను, అఖండ సౌభాగ్యములతోను తులతూగుచున్నది. రాజసంతో ఉల్లంఘన

చేసిన రాచబిడ్డ అష్ట దరిద్రాలపాలై అష్టకష్టాలనుభవించుచు, అంతమందు నట్టడవికి పోయి పార్వతీ పరమేశ్వరులను ప్రార్థించుచు, తన కష్టాలకు విలపించుచుండెను. అప్పుడు పార్వతీ పరమేశ్వరు లాబిడ్డయెడ దయగలవారై ప్రత్యక్షమైనారు. అప్పుడా రాజబిడ్డ– "అమ్మా! అయ్యా! నాకష్టాలేలాగున నివారణమగునో చెప్పుడ'ని వారిని ప్రార్థించినది. అప్పుడు వారు – "అమ్మా! విష్ణు విదియల నోముపట్టి ఉల్లంఘనచేసినావు. అందుచేత నీకు కష్టాలు కలిగినవి. నీవు మరల నోముపట్టి భక్తి శ్రద్ధలతో నోచుకోవమ్మా!' అని చెప్పిరి. అప్పుడామె తెలివి దెచ్చుకొని చెంపలు వేసుకొని మరల నోముపట్టి అక్షతలువేసుకొన్నది. శివరాత్రి వెళ్ళిన విదియనాడు మొదలుపెట్టి నెలనెలకు మరల శివరాత్రి వచ్చువరకు పదమూడు విదియలను ప్రొద్దుటలేచి స్నానముచేసి పార్వతీపరమేశ్వరులను లక్ష్మీనారాయణులను పూజించి, తరువాత ఎడచేర పెడచేర బియ్యముపోసి అత్తిసరువేసికొని, ఆ యన్నము, పెరుగు, అరటిపండ్లు నైవేద్యము పెట్టి ఎవ్వరితోను మాటాడకుండ ఆ అన్నము, పండ్లు, పెరుగు తినవలెను. ఇంకేమి తినరాదు.

**ఉద్యాపనము** : వీసె యేబులము పసుపు ఎదటి మనిషితో మాటాడకుండ కంగామంగాదంచి పదమూడు వెదురు పెట్టెలలోపోసి ఆ పెట్టెలలో పదమూడు లక్కజోళ్ళు, పదమూడు నల్లపూసలకోళ్ళు పదమూడు కుంకుమ పొట్లాలు, పదమూడు రవికెల గుడ్డలు, పదమూడు దక్షిణ తాంబూలాలుంచి, దేవి దేవరలకు నివేదనముచేసి అందులో ఒకపెట్టె మహాలక్ష్మి పెట్టెయని తానుంచుకొని, తక్కిన పండ్రెండు పెట్టెలు పండ్రెండుగురు ముత్తయిదువులకు దక్షణ తాంబూలాలతో వాయన మియ్యవలెను. కథలోపమైనా వ్రతలోపము కాకూడదు. భక్తి తప్పినా ఫలము తప్పదు. అక్షతలు తప్పినా లక్షవేలేండ్లయిదవతనము తప్పదు.

## 14. నెల సంక్రమణ దీపాల నోము కథ

నెలసంక్రమణము నోచిన నెలతకు నెలలూ వెలుగులే, పక్షాలూ వెలుగులే; వారాలూ వెలుగులే, తిథులూ వెలుగులే, ఋతువులూ వెలుగులే, సంవత్సరాలూ వెలుగులే, యుగాలూ వెలుగులే, జగాలూ వెలుగులే, కళ్ళవెలుగుతోను, కడుపు చలువతోను, కలకాలం అయిదవతనముతోను కైలాస ప్రాప్తియగును.

ఈ కథ చెప్పుకొని అక్షతలు వేసుకొనవలెను.

**ఉద్యాపనము** : నెలనెలకు వచ్చే నెల సంక్రమణమునాడు ఒక వరహాయెత్తు కొండవత్తి, సేరుంబావు నూనె దీపారాధనము చేయవలెను. దీపము కొండయెక్కే వరకు భోజనము చేయరాదు. ఈలాగున నొక యేడాది నోచవలెను. నెల నెలకు ఒక బ్రాహ్మణునికి భోజనము పెట్టి దక్షణ తాంబూలము నీయవలెను. కథలోపమైనా వ్రతలోపముకారాదు. భక్తి తప్పినా ఫలము తప్పదు.

## 15. కైలాస గౌరీ నోము కథ

ఒక మహారాజు లేక లేక పుట్టిన తనకూతురిని రతీదేవివంటి చక్కని చుక్కను అతిగారాబముతోను, మహాగారాబముతోనుపెంచి పెద్దదానిని చేసి పదునారేండ్లు ప్రాయమువచ్చిన తరువాత మన్మథునిబోలిన మహారాజు కొకనికిచ్చి అఖండ వైభవముతో వివాహము చేసినాడు. కాని యాచిన్నదాని పెనిమిటి యాచిన్న దానిని యెప్పుడు చూడకుండా వారకాంతలయిండ్లలోనే అహోరాత్రములు గడుపుచున్నాడు. బాలికామణిభర్తకొరకు మనోవ్యాధితో మంచముపట్టి పగలు రాత్రి పార్వతీ పరమేశ్వరులను ప్రార్థించుచు, కైలాసములో పార్వతీపరమేశ్వరుల లాగు వైకుంఠములో లక్ష్మీనారాయణలలాగు, సత్యలోకములో సరస్వతీ బ్రహ్మలాగు, మేమెప్పుడు నొకరికొకరు ఎడబాయకుండా నుండే నోము సకలసుఖాలు పొందేనోమునోచి వెయ్యండని వేడుకొనుచుండేది. ఉండగా నుండగా కొన్నాళ్ళకు పార్వతీదేవి యాపడుచు కలలోకి వచ్చి–"కైలాసగౌరీనోము నోచవేకాంతా! గౌరీశంకరులాగు, లక్ష్మీనారాయణులాగు, వాణీవిధాతలలాగు సకల సౌభాగ్యాలతో స్వామీ నీవు ఏకమై సంతాన భాగ్యములో ఇంతులలో మేలుబంతి వౌదువ'ని ఆనతి వచ్చెను. కలగాంచిన వెంటనే తెలివొంది గౌరీదేవికి కడుభక్తితో మ్రొక్కుకొని రాజుకూతురు కైలాసగౌరీనోము ఉద్యాపనము చేసికొన్నది. ఆమెభర్త వెంటనే ఆటవెలదులను వదలి అత్యానురాగముతో వచ్చి తన యిల్లాలి నాదరించి, యిల్లాలితో చిరకాల మిహపరము లనుభవించినాడు. ఆమె నోచిన నోము అందరుకాంతలు నోచినారు. భక్తి తప్పినా ఫలము తప్పదు. కథలోపమయినా వ్రతలోపము కాకూడదు. అక్షతలు తప్పినా ఐదువేలయేండ్లు ఐదవతనము తప్పదు.

**ఉద్యాపనము :** ఐదు కుంచముల కుంకుమ, ఐదు కుంచముల పసుపు, అందుకు సరిపోయినపండ్లు పార్వతీదేవి గుడిలో పర్వదినాలలో గంగానదుల తీరము ననో ఉంచుకొని యా పండ్లు, పసుపు, కుంకుమ ముత్తయిదువులకు చేరడు చేరడు చొప్పున పంచిపెట్టవలెను. పంచిపెట్టుట సమాప్తియగు వరకు మాటాడరాదు.

## 16. చల్లచిత్త నోము కథ

"చల్లచిత్తనోము నోచవేతల్లీ !
వెల్లయాపులపాడి చేయవే తల్లీ !
ఇల్లుపాలనేత్ర పలుకవేతల్లీ !
ఎల్లసొమ్ములు నీవు తాల్పవేతల్లీ !
చల్లనికడుపుతో సాగవే తల్లీ !
కొల్లయిగ సౌభాగ్యమేలవే తల్లీ !

ఈకథ చెప్పుకొని అక్షతలు వేసికొనవలయును. చల్లగిలకొట్టునప్పుడు చల్లకుండకు చుట్టును చిలికే చల్లచినుకులు పసుపుతోకలిపి ఒక ఏడాది ప్రతిదినము అయిదుగురు ముత్తయిదువులకు బొట్టుపెట్టు చుండవలెను. ఇది చిట్టిబొట్టు నోముతో కలిపి పట్టెదరు.

**ఉద్యాపనము :** పాడిగలరోజులలో ఒకనాడు చేసినచల్ల ఆనాటి వెన్నముద్దతో గూడ కుంభపాళముగా ఒక ముత్తయిదువకు వాయన మీయవలయును. దక్షణ తాంబూలము లీయవలయును.

## 17. పెరుగుమీద పేరిన నెయ్యి నోము కథ

ఒక బ్రాహ్మణ పండితునకు సకలైశ్వర్యములు కలవు. కాని సంతానములేదు. ఆ బ్రాహ్మణుడు భార్యతో గూడ అనేకమగునోములు, అనేక వ్రతములు చేసిచేసి, దేవునికృపచే చాలా కాలానికి ఒక కూతురుని గన్నాడు ఆ పిల్లనతిగారాబముతోను మహాగారాబముతోను పెంచుతూ వుండేవారు. ఆ బ్రాహ్మణుడు గంగిగోవుపాలు ప్రత్యేకము కాపించి పాలు, పెరుగు, నెయ్యి పిల్లకు కడుపునిండా పెట్టాలని సరదాపడే వాడు. ఆపిల్లకు నెయ్యి, పెరుగు, పాలు, వెన్న, చల్ల ఇష్టమయేవికావు. వాటి పేరు చెపితే ఆ పిల్ల కసహ్యము. వాటిని వేటిని కల్లోనైనా రానిచ్చేదికాదు. అందుకోసం తల్లిదండ్రి బెంగపెట్టుకొని అనేక విధాల ఆలోచిస్తూ ఉండేవారు. వారు పిల్లతాగంతే తామేమియు తినుటకు నోటికిపోక ఇంట్లో కొల్లలుగానున్న పాడి ఊరందరకు పంచిపెడుతూ ఉండేవారు. ఇలావుండగా ఒకనాడు వారింటికో స్వాములవారు భిక్షకు వచ్చారు. ఆయనకు పంచభక్ష్య పరమాన్నములతో వడ్డింపచేసి పిల్ల బంగారు బొమ్మలాగు ఆడుకొంటూవుంటే చూచి స్వాములవారు తమ పంక్తిన పిల్లకు విస్తరవేయమన్నారు. పిల్ల–'అబ్బే! నేనిక్కడ తినను చల్ల, నెయ్యి, పెరుగు, వెన్న అన్నీ వేస్తారు బాబూ! అని పారిపోయింది. 'అది యేమ'ని స్వాములవారడుగగా పిల్ల తల్లితండ్రులా సమాచారమంతా స్వాములవారితో విన్న వించుకున్నారు. అప్పుడు స్వాములవారు దివ్యదృష్టితోచూచి యిలాగు చెప్పినారు. ఈపిల్ల పూర్వజన్మములో విస్తారము పాడిగల యింట్లోపడి ఆపాడితాను, తన పిల్లలు, మగడు త్రాగినంత త్రాగి తక్కినది యిరుగుపొరుగు వారెవ్వరికీ కొంచమైన పోయక కడవలతో మిగలి పోయిన పెరుగూ, మజ్జిగా పట్టుకొని వెళ్ళి గొడ్లగోలెంలో పోసివేస్తూ ఉండేది. అంతకుముందు జన్మములో చేసిన విశేష పుణ్యముచేత మరలనట్టి భాగ్యవంతుల యింట్లో పుట్టినది. క్రిందటి జన్మములో చేసిన పాపముచేతనే ఈ జన్మములో పవిత్రమైన ఆవుపాడి అనుభవించడానికి అధికారము లేకపోయింది. అందుచేత ఒక యేడాది ప్రతిదినమూ ఉదయాన్ని నమస్కరించిన తరువాత యీపిల్ల ఒకనాడు అయిదు సేర్లుగాని, అయిదు సోలలుగాని, ఆవుపాలు ఎర్రగాకాచి తోడుపెట్టి ఆగట్టి పెరుగుమీద పేరిన ఆవునేతిముద్ద పెరుగుకు తగినట్లుగా పెట్టి ఆ పెరుగు ముంత

పేరిన నెయ్యి ఒక రవికెల గుడ్డ కుంకుమ, పసుపు, తాంబూలము, దక్షిణ ఒక ముత్తయిదువకు యియ్యవలెను. అప్పుడీ దోషముపోయి యీ బాలిక సకల సుఖములను పొందున'ని చెప్పెను. అట్లు తలిదండ్రులు భక్తి శ్రద్ధలతో తమపిల్లచేత పెరుగుమీద పేరిన నెయ్యి నోముపట్టించి ఉద్యాపనము చేయించగా ఆ పిల్ల ఆనాటి నుండి ఆనందముతో అతివిచిత్రమైన ఆవుపాలూ, అంతరంగ శుద్ధి కలిగించే ఆవు పెరుగూ, ఆత్మజ్ఞానమునిచ్చే నెయ్యి అన్నియు సుఖముగా అనుభవిస్తూ చిరకాలము అయిదువతనము, పసుపు చలువ కలిగి వర్ధిల్లినది. ఆమె నోచిన నోము భామలందరూ నోచారు. కథలోపమయినా వ్రతలోపము కారాదు. భక్తి తప్పినా ఫలము తప్పదు.

## 18. విష్ణు కమలాల నోము కథ

ఒక రాజుకూతురు, ప్రధాని కూతురు వుండేవారు. ప్రధాని కూతురినిచూచి రాజుకూతురు 'అయ్యో! ఎన్ని నగలు పెట్టుకొన్నా, ఎంత సంరక్షణచేసినా నా మోమున కందములేదు. ఆకారములేదు. కళాలేదు. కాంతిలేదు, ప్రధాని కూతురు మోము కమలంలాగు కలకల లాడుతూ దీపంలాగు తేజరిల్లుతూ చూడముచ్చటగా నుంటుంది. అదేమి పుణ్యం చేసిందో!' అని ఆలోచించుకొని విచారించుచుండేది. ఒకనాడు రాజుగారింటికి రాజపురోహితుని భార్యవచ్చి కథలూ కారుణ్యాలూ చెప్పుచు ఒక కథ చెప్పినదట-'ఒకనాడు వైకుంఠ నగరములో రత్నసింహాసనముమీద భక్తులు సేవించుచుండగా శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవి తొడలపై పాదాలుంచుకొని చిగురుటాకు వంటి హస్తాలతో తనపాదము లొత్తుచున్న ఆ దేవినిచూచి-'కమలా! నీముఖకమలము వంటి ముఖకమలము కావాలని యెందరు కాంతలు కోరుకొనుచుందురో కనుక వారి కోరిక తీరునట్లు నేనొక వరమిచ్చుచున్నాను సుమా!' అన్నాడు. లక్ష్మీకాంత నవ్వుచు మారకున్నది. విష్ణుమూర్తి మరల చెప్పుటకు మొదలిడినాడు. 'యేస్త్రీ యైనాసరే ప్రతిదినము ఒక కమలవత్తి ఆవు నేతితో ఆ రెండు ప్రమిదలలో కమలవత్తులు దీపాలు వెలిగించి మానెడు సోలడుబియ్యము ఒక క్రొత్త వస్త్రము, దక్షిణ తాంబూల ముతో ఆ వెలుగుచున్న వెండి దీపము, బంగారు దీపములతో ఒక బ్రాహ్మణునకు దానమియ్యవలెను. దీపము వెలిగించుటకు ఆటంకమైన రోజులు గలిగినచో ఆ దీపములన్నియు ఒకనాడుగాని, రెన్నాళ్ళుగాని సంవత్సరములోగా ఏప్పుడైనా సరే వెలిగించుకోవచ్చును. ఈలా ఎవ్వరు నోచెదరో వారికి లక్ష్మీదేవి ముఖకమలమువంటి ముఖము సౌభాగ్యము కలుగును అని విష్ణుమూర్తి చెప్పేసరికి లక్ష్మీదేవి-'స్వామీ! ఆ నోము నోచిన భామలకు మీవంటిభర్తగలిగి జ్ఞానమువచ్చేటట్టుకూడా ప్రసాదించండి. అని కోరినది. విష్ణుమూర్తి-'తథాస్తూ' అని వర మిచ్చినాడు. అని పురోహితుని భార్య కథ చెప్పేసరికి రాజుకూతురు మనోరథము పండినది. ఆమె గంపంత సంతోష ముతో లేచి ఆమెపాదాలకు నమస్కరించి భక్తిశ్రద్ధలతో విష్ణు కమలాల నోముపట్టి ఈకథ చెప్పి అక్షతలు వేసుకొని ఏడాది దీపము వెలిగించి ఉద్యాపనము చేసుకొన్నది.

ఆమె ముఖము ఆమె కోరినట్లు లక్ష్మి తాండవిస్తూ కనిపించింది. విష్ణుమూర్తి వంటి భర్తను పొంది విజ్ఞానము కలిగి వర్ధిల్లినది. ఆమె నోచిన నోము భామలంతా నోచారు. భక్తి తప్పకుంటే ఫలము తప్పదు. అక్షతలు తప్పినా లక్ష వేలేండ్లు అయిదవతనము.

## 19. సూర్య చంద్రుల నోము కథ

'సూర్యదేవుడా! నీకే నమస్కారము. చంద్ర దేవుడా! నీకే నమస్కారం. బాలభాస్కరా! నీకే నమస్కారం ఉదయభాస్కరా! నీకే నమస్కారం. మధ్యాహ్న మహేశ్వరా! నీకే నమస్కారం. ధన ధాన్య సమృద్ధయినపట్నంలోను, పేద బ్రాహ్మణుడు-సాద బ్రాహ్మణుడు ఊరుతిరిగినా ఏడుమానికెలు, పల్లెతిరిగినా ఏడుమానికెలు, పట్నం తిరిగినా ఏడుమానికెలు, ఎడుమానికెలు బియ్యముచేత కూడుకాక, నీళ్ళాకాక, దరిద్రాన, పేదరికాన విసిగి వేసారుచుండగా, పుట్టక పుట్టక ఇద్దరు పినపాపలు పుడితే చిన్నక్కెమ్మను చినసోమయాజులుకిచ్చి, పెద్దక్కెమ్మను పెద్దసోమయాజులుకిచ్చి, తాచక్రబుక్షీశరీరంబోయెను. ఇంద్రలోకాన ఇంద్రకన్యలు చంద్రలోకాన చంద్రకన్యలు, భూలోకాన పేరంటాళ్ళు, కొలనుగత్తెక్కలు నోమునోచగా-'అమ్మల్లారా! అక్కల్లారా! ఏమినో మేమివ్రతం?' (చెప్పండంటే) 'ఆడవారి నోములు మీకెందుకని'రి. పెద్దయ్యగారు తటాకమందు స్నానముచేసి బంగారు చెరువులో పట్టు వస్త్రం గట్టుకొని పెద్దయ్యగారు ఒకగద్దె పెట్టుకొని, పేరంటాలు ఓగద్దె పెట్టుకొని, పెద్దయ్యగారితో అక్షతలు పేరక్కచేతిలోపెట్ట పెద్దయ్యగారి కథచెప్పగా పేరక్కమ్మకథ వినయంగా ఏటికెదురుగా మాఘమాసాన్ని పున్నమి ముందర రథసప్తమినాడు విఘ్నము కాకుండా విఘ్నేశ్వరులు కుంద్రాళ్ళుపోసి, ఆదిత్య భగవానునికి పాలుపొంగించి ఆయనను మూడు కోరికలుకోరి, అది మొదలుకొని ముట్టయినా కథ అంటైనా కథ పురుడైనా కథ పుణ్యమైనా కథ శుభమైనా కథ శోభనమైనా కథ వడుగైనా కథ పెండ్లైనా కథ శుభమైనా కథ పంచజ్ఞాన కథ పంచ శత్రువులా కథ కథేనితది, కథేనీమం, కథే వాలాయితీ, కథ మరచి కుడువరాదు. వ్రతభంగం చేయరాదు. కన్య కథ మరచి కుడిస్తె బ్రాహ్మణునికి భోజనం పెట్టి, బ్రాహ్మణుడు కథ మరచి కుడిస్తె బ్రాహ్మణుడికి భోజనం పెట్టి, బ్రహ్మచారి కథ మరచి కుడిస్తె ఉపవాసముండి రక్తజూచి, బ్రాహ్మడికి కాళ్లుకడిగి, భోజనముపెట్టి ఏడుంగాలందాచరించి ఏడాది కాగానే షష్ఠినాడు ఉపోష్యముండి సప్తమినాడు చెరకుగర్రల, అరటి స్థంబాల పందిళ్లువేసి, చేమంతి పువ్వుల ఎత్తులబెట్టి, అట్లతోను అరుగులు వేసి బుట్టలతో మూలలువేసి కుడుములతో కోటలువేసి, కుంకుమతోను కుదుళ్లువేసి, అల్లంతోను అరుగులువేసి బెల్లంతోను పొయియలువేసి పాలాను ప్రారందీర్చి, పంచవన్నెల ముగ్గుపెట్టి, పన్నెండు పద్మాలూ పెట్టి పసుపుతోను గడపాపెట్ట ఏడుమానికల బియ్యము సూర్యదేవునికి మండపంబోసి, ఏడుమానికెల బియ్యము చంద్రదేవునికి మండపంబోసి చిన్నం బాతిక బంగారాన సూర్యదేవునకు ప్రతిమలుయుంచి చిన్నంబాతిక వెండితోను చంద్రదేవునకు ప్రతిమలు

చేయించి పైడిగిన్ని, పచ్చని వస్త్రాలు నా సూర్యదేవున కలంకరించి, వెండిగిన్నెలు తెల్లవస్త్రాలు చంద్రదేవున కలంకరించి, వేగిందాకా ఆటాపాటా, ఏదోవిధాన జాగరంచేసి వేగంగానే తానులేచి, అలికిపూచి ముగ్గులుపెట్టి, ఆవునేతి దీపంపెట్టి ఆవునేతి బూరెలువండి, చిరగకపూయిన అరటాకులలో మరువబోయిన బెల్లంపెట్టి, మోసుకుపోయేకుండా పెట్టి, అల్లంపెట్టి, బెల్లంపెట్టి, తేనెపెట్టి టెంకాయపెట్టి, అరటిపండ్ల అత్తంపెట్టి, ఆదినారాయణున కారగింపుబెట్టి, ఉమాదేవి పేరుజెప్పి, రోహిణిదేవి పేరుజెప్పి, పన్నిద్దరు బ్రాహ్మణులతోను, ఇద్దరైన ముత్తయిదువులకు ఇష్టాన్నములు పుష్టిగా బెట్టి భక్తితోడ తాంబూలమిచ్చి, భక్తితోడను నమస్కరించి, 'ఈ నోము నోచినవారికి యేమిఫలం గలదమ్మా!' అంటే ఇష్టాన్నములు తుష్టిమాయె. దృష్టాంతరమే మోక్షమాయె, చావనిసంబాయె, సంతానమభివృద్ధాయే చెడ్డా అర్థం చేరీవచ్చె, పడ్డా అర్థం ప్రార్థిల్లె, రివ్వున చుట్టాలు కూడానువచ్చిరి, పట్టిగోవుల పాలు పితికిరి, మున్నూరు కొటేండ్ల అయిదో తనం వేసిరి, గొడ్రాలునోస్తే కొడుకులగనేనూ, కోమటినోస్తే కోటికి పడగలెత్తె, రాజునోస్తే లక్షపడాయె, పునిస్త్రీనోస్తే పువ్వులుముడిచె, పుత్రపుత్రిక పనెత్తి, వితంతువులనోస్తే వేయివేలేళ్ళను విధవరికము లేదు, శివలోకం, విష్ణులోకం గద్దమంటే ఎక్కిన గద్దెలు పైడగద్దెలాయె అత్తిన నల్లపూసల భరణాలాయె, కట్టినవస్త్రాలు పట్టువస్త్రములాయె, పుణ్యముగల యీకథ వింటివి, ఆదినారాయణ మూర్తికి నమస్కరించవలెను, దివాకరుడా దివ్యమూర్తి ప్రభాకరుడా! బాలభాస్కరుడా అలంకారాల ఆదినారాయణా!' ఆదినారాయణునికి నమస్కరించి అక్షతలు తలలో వేసుకొనవలెను. భక్తితప్పకున్న ఫలము తప్పదు. అక్షతలు తప్పినా అయిదువేలేండ్లు అయిదవతనము తప్పదు.

## 20. బారవత్తుల మూరవత్తుల నోము కథ

ప్రతిదినము బారెడువత్తి పోగొకటి, మూరెడువత్తిపోగొకటి తీసుకొని, బారెడు పోగూ ముప్పదిచుట్లుచుట్టి, మూరెడువత్తిపోగూ ఆరుచుట్టులుచుట్టి శివరాత్రినాడు మొదలు మళ్ళా శివరాత్రిదాకా సంవత్సరమువరకూ ఈలాగువత్తులు చేసికొని శివరాత్రినాడు దేవాలయములో క్రొత్తమూకుడులో మానెడు సోలడు నూనెపోసి, ఆవత్తులు వెలిగించవలెను. తరువాత మానెడు సోలడు బియ్యము, క్రొత్త వస్త్రము, దక్షణ తాంబూలములతో బ్రాహ్మణులకు భోజనముపెట్టి యియ్యవలెను. ఈనోము నోచినవారికి బ్రహ్మలోకాలు ప్రాప్తించును. ఈ కథ శివుని వలన విని పార్వతీదేవి భక్తురాలైన యొక కుంటి గ్రుడ్డిదానికి చెప్పగా ఆభక్తురాలు భక్తిశ్రద్ధలతో యీనోము నోచి అంగవైకల్యముపోయి బ్రహ్మజ్ఞానము గలిగి బ్రహ్మలోకముచూరగొన్నదట. భక్తితో నోచిన వారికి ఫలము తప్పదు. కథలోపమైనా వ్రతలోపము కారాదు. అఓతలు లోపమైనా లక్షవేలేండ్లు అయిదవతనము తప్పదు. వత్తులు చేయుట కెప్పుడైనా వీలులేకపోతే అన్నీ కలిపి మరొకనాడు చేసికొనవచ్చును.

## 21. అక్షయ బొండాల నోము కథ

అక్షయ బొండాల నోము నోచిన అతివకు అక్షయమైన అయిదవతనము, అక్షయమైన కడుపు చలువగలిగి అక్షయలోకాలు చూకూరును. ఈకథ చెప్పుకొని అక్షతలు వేసుకొని ఏడాది రోజుకైదుగురు ముత్తైయిదువులకు అయిదేసి చిన్న చిన్న పసుపుదండలు ఇచ్చుచు, ఏడాది అయిన తరువాత మంచిమంచి కొబ్బరి బొండాలు, తాంబూలములు, దక్షణలు, రవికెలగుడ్డలు, పసుపు కుంకుమలు వాయన మియ్యవలెను. కథలోపమైనా వ్రతలోపము కాకూడదు. భక్తి తప్పినా ఫలము తప్పదు.

## 22. లింగదానము నోము కథ

'కార్తీకమాసాన కలిగినదిగాన, కరుణలింగమూర్తిని ఘనభక్తి గొలిచి, పండిత బ్రాహ్మణుని భక్తితో బిలిచి, తమశక్తి కొలది దక్షణలుంచి, పచ్చి పోకలతోను పండుటాకులతోను, పచ్చికర్పూరముతోను, బహుదినుసులతోను, తగిన రీతిని భక్తి తాంబూలము సమర్పించి, బంగారు ప్రమిదలోన పదివత్తులుంచి, వెండి ప్రమిదలోన పదివత్తులువేసి దీపాలు దీపాలు వెలుగుచూ తేజరిల్లగను, అవియన్ని బ్రాహ్మణుడు కందీయవలెను. బ్రాహ్మణునకు సాష్టాంగ ప్రమణాముచేసి, భూదేవు దీవనల్ పొందుగావలెను, లింగదానము నోచిన యంగసకెల్ల, భవబంధములెల్ల బాసిపోవంగ, పార్వతీపరమేశ్వర్లు బహూకరుణతోను, శివలోక సాయుజ్య సిద్ధినిచ్చెదరు' ఉద్యాపనముపై పాటలోనేవున్నది కనుక వ్రాయలేదు.

## 23. గూనదీపాలు - బానదీపాలు నోము కథ

గూనదీపాలు బానదీపాలు నోచిన వారికి గూనెడు కుంకుమ బానెడు పసుపు గలిగి, గ్రహదోషాలు పోయి ఘనతేజము గలిగి కడుపు చల్లనగలిగి, కడవలాది సాడిగలిగి, యిరుగు చల్లనగలిగి పొరుగుచల్లనగలిగి, యెడతెగని పంటగలిగి, యెల్లభాగ్యాలు గలిగి, సుఖసంతోషాలు గలిగి, సుందరరూపముగలిగి, పార్వతి దయగలిగి, పరమేశ్వరునిదయ గలిగి, ఇమముగలిగి వరముగలిగి మోక్షముగలుగును. ఈ కథ చెప్పుకొని అక్షతలు వేసికొనవలెను.

**ఉద్యాపనము :** అయిదుకుంచముల నెయ్యి అయిదు కుంచముల నూనె, కొత్తగూనలోను, కొత్తబానలోను పోసుకొని కొత్తగుడ్డలతో మూటవలె రెండు పెద్ద పెద్ద వత్తులు వేసికొని అవి బానలోను నేతిలోను, నూనెలోను తడిపి కార్తీకమాసములో శివాలయములో విఘ్నేశ్వరపూజచేసి, శివాభిషేకము చేయించి దీపాలు వెలిగించి శక్తి కొలది బ్రాహ్మణులు మొదలగువారికి సమారాధనము చేయవలెను.

## 24. సహస్ర ఫలాల నోము కథ

సహస్ర ఫలాలు నోచిన చాలపుణ్యము. వర్ణించుటకు సహస్ర కరములు ఆదిశేషునకైనా అలవిగాదు. "ఎల్లకాలము చేసెడి నోము ఏమిటయ్యా!" అని పార్వతి శివునడుగుగా–"ఎల్ల కాలము చేసెడినోము సహస్ర ఫలాలనోమే పార్వతీ! ఈ నోము నోచిన భామలమీద నీకుదయ నాకుదయ, విష్ణునకుదయ, లక్ష్మికిదయ, బ్రహ్మకు దయ, సరస్వతికి దయ చంద్రునకుదయ, సూర్యునకుదయ, ముక్కోటి దేవతలకు దయ మూడులోకాలకుదయ ఈనోము నోచినవారి, కెల్లకోరికలుతీరి, ఇహపరము వారి దేయగునే పార్వతీ!" యని పరమేశ్వరుడు చెప్పినాడుట.

ఈ కథ చెప్పుకొని అక్షింతలు వేసుకొనవలెను.

**ఉద్యాపనము :** ఒక్కొక్క పండుదినుసుకు వేయి చెప్పున వేయిదినుసుల పండ్లు వానివానికి తగిన దక్షిణలతో బ్రాహ్మణ దంపతులకు దానమీయవలయును. ఏకాలములో దొరికేపండ్లా కాలములో చేసికోవచ్చును. ఇచ్చినవారి కీయకుండా వేయిదినుసులు వేయిమంది బ్రాహ్మణదంపతులకు ఈయవలెను భక్తితప్పకున్న ఫలము తప్పదు.

## 25. పెండ్లిగుమ్మడి గౌరీ నోము కథ

"పెండ్లిగుమ్మడి గౌరీ పేరక్కపట్టింది
ఇండ్లు వాకిండ్లలో నెపుడు కళ్యాణాలే
ఇండ్లు వాకిండ్లలో నెడతెగని పంటలే
ఇండ్లు వాకిండ్లలో నెడతెగని భాగ్యమే
గుమ్మడి పండువంటి కొడుకులూ అల్లుండ్రు
గుమ్మడి పండ్లువంటి కూతుండ్రు కోడండ్రు
మాణిక్యములవంటి మనుమలామందలు
పసుపులు కుంకుమలు పాయని భూషణములు
కలిగెనానందాలు కన్నుల పండుగలు
ఈనోము నోచిన యింతులకు కొదవే?"

ఈకథ చెప్పుకొని అక్షతలు వేసికొనవలెను.

**ఉద్యాపనము :** మూడు బూడిద గుమ్మడిపండ్లు తెచ్చి వుంచుకొనవలెను. అందులో నొకపండు, మానెడు బియ్యము దక్షిణ తాంబూలములనుంచి, అవి పట్టుకొని బ్రాహ్మణుని యింటికివెళ్ళి అవి ఆయనకిచ్చి నమస్కరించి "నోము నోచికొందును వాయన మందు కొనుటకు రావలెన"ని యా బ్రాహ్మణ వృద్ధుని బిలువవలెను. ఆయన మనయింటికి వచ్చిన తరువాత రెండవ గుమ్మడిపండు,

అడ్డెడు తవ్వెడు బియ్యము దక్షిన తాంబూలము ఆయనకిచ్చి నమస్కరించవలెను, ఆ తరువాత మూడవ గుమ్మడిపండును అయిదుశేర్ల బియ్యము, స్వయంపాకముతో పట్టుకొని బ్రాహ్మణుని యింటికివెళ్ళి, ఆయన భార్యకు వాయనమంతా అందించి, వారి యింటిలోనే ఆనాడు నోము చేసికొన్న యిల్లాలు భోజనము చేయవలెను.

## 26. మూసివాయనాల నోము కథ

మూసివాయనాలు నోచిన భామకు మోసుకుపోయిందాకా పసుపు కుంకుమ, మూసివాయనాలు, నోచినకాంతకు, మోసుకు పోయిందాకా పాడిపంట, మూసి వాయనాలు నోచిన యింతికి మోసుకుపోయిందాకా కడుపుచలువ, మూసివాయనాలు నోచిన వణలికి మోసుకుపోయిందాకా పెనిమిటి యనురాగం, మూసివాయనాలు నోచిన భామకు మోసుకు పోయిందాకా చుట్టాల ప్రేమ, మూసివాయనాలు నోచిన మోసుకు పోయిందాకా యిహం మోసుకుపోయిందాక పరం.

ఈ కథ చెప్పుకొని అక్షింతలు వేసుకొనవలెను.

**ఉద్యాపనము :** ఈ నోము ఆరు మూసివాయనాలు ఆరుగురు ముత్తయిదువులకు ఇయ్యవలెను, పెద్ద చేటలతో ఇచ్చినవి పెద్ద మూసివాయనాలు చిన్న చేటలతో ఇచ్చినవి చిన్న మూసివాయనాలు అందురు. ఎవరిశక్తి కొలది వారిచ్చెదరు. ఒక చేటనిండా కుంకుమపోసి పైని ఇంకొకచేట, బోర్లించి, రవికెలగుడ్డ, తాంబూలము, దక్షిణ నల్లపూసలు, లక్కజోళ్ళు పండ్లు పెట్టి యియ్యవలెను అట్లే ఒక చేట నిండా పసుపుపోసి పైనిచేట బోర్లించి తాంబూలము దక్షిణ మొదలగుదానితో రెండో మూసివాయనము ఇంకొక చేటనిండా నల్లపూసలుంచి రెండో చేట బోర్లించి తాంబూలము దక్షిణ మొదలైనవి వుంచి మూడోమూసి వాయనము, ఒకచేటనిండా పువ్వులు పోసి పైన చేట బోర్లించి తాంబూలము, దక్షణ మొదలైనవిపెట్టి నాలుగో మూసి వాయనము ఒకచేట నిండా పండ్లుపోసి పైన ఇంకొకచేట బోర్లించి తాంబూలము, దక్షిణ మొదలైనవి వుంచి అయిదో మూసివాయనము ఒకచేటనిండా గాజులు పెట్టి పైన మరియొక చేట బోర్లించి తాంబూలము, దక్షిణ మొదలైనవి వుంచి ఆరో మూసివాయనము నియ్యవలెను. ఈ మూసివాయనాలన్నియు ఒక్కమారైననుసరే, లేక ఒక్కొక్కటి చొప్పునైననుసరే రెండేసి మూడేసి చొప్పునైననుసరే వీలునుబట్టి యిచ్చు కొనవచ్చును.

## 27. భాగ్యాదివారాల నోము కథ

బ్రాహ్మణ బాలిక, రాజు బాలిక భాగ్యాదివారాల నోముపట్టిరి. బ్రాహ్మణ బాలిక భక్తి శ్రద్ధలతో నోచింది. రాజుబాలిక ప్రాలుమాలికచే నోము ఉల్లంఘన చేసింది. రాజు కూతురు భాగ్యముపోయి పరమ దరిద్రురాలై పార్వతీ పరమేశ్వరులను

ప్రార్థించుచు నట్టడవులపాలై పోయింది. బ్రాహ్మణ బాలిక సిరిసంపదలతో తుల తూగుచు నిండుకుండవలె చెక్కుచెదరకుండ ఆనందంతో కాలము గడుపు చుండెను. అడవులపాలై అల్లాడుచున్న రాజకూతురునిచూచి పార్వతీ పరమేశ్వరుల "భక్తురాలైంది కనుక పాలింతమ"ని యెంచి ముసలి దంపతుల వేషాలతో ఒకనాడామె దగ్గరకు వచ్చి ఆమెను పరామర్శించినారు. ఆ అడవిలో మాటాడే మనుష్యులులేక, పలుకాడే బంధువులులేక యేకాకియై యేడ్చు చున్నది. కనుక వారిని చూడగనే ప్రాణము లేచివచ్చి తన కష్టముతానే వెల్లబోసుకున్నది. అప్పుడు పార్వతీ పరమేశ్వరులు "చిన్నదానా! నీవు భాగ్యాదివారాల నోముపట్టి ఉల్లంఘన చేసితివి. జ్ఞప్తికి తెచ్చుకో" మన్నారు. అప్పుడావిడ అదంతా తలపోసుకొని, తన తప్పు తెలుసుకొని 'దీనికి పరిహారము చెప్పుడ'ని వారిని ప్రార్థించినది. అప్పుడా దంపతులకు–"బిడ్డా! భక్తి శ్రద్ధలతో మరల భాగ్యాదివారాల నోము నోచుకో, భాగ్యభోగ్యాలు, పాడిపంటలు, పోయినవన్నీ మళ్ళీ వస్తాయి కడుపుచలువతో, తరగనైదనవతనముతో కైలాసానికి వెళ్ళ గలవ"ని జెప్పినారు. ఆవిడ వెంటనే భక్తి శ్రద్ధలతో భాగ్యాదివారాల నోముపట్టి ఉద్యాపన చేసికొని పోయి భాగ్య భోగ్యాలు పొంది సకల సంపదలతో సౌభాగ్యంబుతో స్వర్గానికి కెళ్లింది. ఆమె నోచిన నోము భామలంతా నోచారు భక్తి తప్పకుంటె ఫలము తప్పదు.

**ఉద్యాపనము :** శక్తిగలవారు పట్టుదిగాని, లేనివారు వట్టిదిగాని సన్నని కుట్టుతో చక్కగా ఒక రవికకుట్టి దానికి చేతిక్రింద కూర్పులు మాత్రము కుట్టకుండా వదలివేయ వలెను. ఆ రవిక ఒకచేటలో పరచి ఆ రవిక చేతులలో ఒక చేతినిండా వస్తువులు రెండవ చేతినిండా కుంకుమపోసి, పండ్లు దక్షిణ తాంబూలము, మట్టెలు, మంగళ సూత్రములువుంచి చీర, రవిక వుంచి, పైనొక చేటమూసి "ఒక ముత్తయిదువకు" అవి వాయనమీయవలెను. ఏడాదివరకు ప్రతి ఆదివారము కథచెప్పి అక్షంతలు వేసికొనుచు, పార్వతీ పరమేశ్వరులను పూజించుచు ఒంటిపూట భోజనము, రెండవపూట ఫలహారము చేయవలెను.

## 28. మూలగౌరీ నోము కథ

భక్తి శ్రద్ధలతో మూలగౌరీ నోముపట్టి, ఉద్యాపనము చేసికొని పార్వతీ పరమేశ్వరులకు ప్రదక్షణము చేసికొని, భాగ్యవతియైన రాజు భార్య ఎవరికిలేని భాగ్య భోగ్యాలతోను ఎవరికిలేని సిరిసంపదలతోను ఎవ్వరికిలేని సుఖసంతోషాదు లతో పరమేవ్వరునివంటి హృదయేశ్వరునితోను, కుమారస్వామి వంటి కొమాళ్ళతోను ముక్కోటి దేవతలవంటి మునిమునుమలతోను, మహాగర్వము గలిగి మహిని పాలించుచున్నది. అప్పుడు పార్వతీ పరమేశ్వరులు–"దీనిశక్తి యెంతగలదో దీని ధైర్యమెంతగలదో చూడమ"ని మరియొక దేశపు రాజు హృదయములో ప్రవేశించి ఆ రాజు నీరాజుమీదికి యుద్ధానికి పంపిరి. దైవబలముతో ఆ రాజు ఈ రాజచక్రవర్తిపై

యుద్ధానికివచ్చి మహాబల సంపన్నుడైన రాజును బిడ్డలతోను, మనుమలతోను, మునిమనుమలతోను, సకల సైన్యముతోను పడగొట్టి వేసెను. అప్పుడా రాజు రాజ్యమంతా పరరాజు చూరగొని పోవుచుండగా, రాజుభార్య మహాధైర్యముతో యుద్ధభూమికి వెళ్ళి యమదూతలను తరుముచు, ఈలాగున్న-"పడక గదిలో పగడాలు వాయనమిచ్చాను. పండువంటి నా ఐదోతనము భంగము చేయలేరు, పారిపొండి యమదూతలారా! పారిపోండి మత్తయిదువ కోసం మూలనుండి ముత్యాల వాయన మిచ్చాను. ముట్టలేరు. నాపెనిమిటి ముట్టకండి యమదూతలారా! పారిపొండి భాగ్యభోగ్యాలకోసం పడమటింటిలో పట్టుచీర వాయనమిచ్చా, నాభాగ్యాలు పాడుచేయలేరు పారిపొండి యమదూతలారా! పారిపొండి-తోటలు దొడ్లు కావాలని తోటలలో తోపుచీరవాయనమిచ్చాను తొలగి పొండి యమదూతలారా! తొలగిపొండి- ఇల్లూవాకిళ్ళ కావాలని యిల్లాలికి తెల్లచీర వాయన మిచ్చాను వెళ్ళిపొండి యమదూత లారా! వెళ్ళిపొండి- చెడకుండా కడుపుతీపి చెరకుగడలు వాయనమిచ్చాను. కొడుకుల దరికి చేరలేరు. పారిపొండి యమదూతలారా! పారిపొండి-మనుమలు, మునిమనుమలు గలగాలని మరొక మారు చెరుకు ముక్కలు వాయనమిచ్చారు పారిపొండి యమదూతలారా! పారిపొండి ఎల్లవారు చల్లగా వుండాలని బెల్లపచ్చులు వాయనమిచ్చాను. నా ప్రజలదగ్గరకు రాకుండ పారిపొండి యమదూతలారా! పారిపొండి పేరు ప్రఖ్యాతులు పెంపెక్కాలని పెరట్లో పెరుగు ముంతలు వాయన మిచ్చాను పేరు చెరుపలేరు. పెంపూ చెరుపలేరు, పారిపొండి బాలపాపలతో ఓలలాడాలని పాకలలో పాలకాయలు వాయనమిచ్చాను నా పాపలందరికి పోలేరు పారిపొండి యదూతలారా పారిపొండి యమదూతలారా! పారిపొండి- సిరిసంపదలు చెదరకుండాలని చీకట్లో చిమ్మిలుండలు వాయనమిచ్చాను, సిరి సంపదలు చెరుపలేరు. పారిపొండి యమదూతలారా! పారిపొండి సుఖసంతోషాలు చూరగొనాలని సూర్యభగవానుని కెదురుగుండా సున్నుండలు వాయన మిచ్చాను. నా సుఖసంతోషాలజోలికి పోలేరు. పారిపొండి యమదూతలారా! పారిపొండి- అల్లుళ్ళతో కూతుళ్ళతో అందనాల దిగాలని అరుగుమీద అరిసెలు వాయనమిచ్చాను. అళ్ళుళ్ల కూతుళ్లజోలికి పోలేరు అవతలికి పొండి యమదూతలారా! అవతలకి పొండి. కలిగిన శుభాలు కలుగుతూనే ఉండాలని గాదెవద్ద గారెలు బూరెలు వాయనమిచ్చాను. కదలి పొండి యమదూతలారా! కదలిపొండి! వేసిన వింజామరల వీస్తూనే వుండాలని వేదికమీద విసినకర్రలు వాయనమిచ్చాను వెడలిపొండు యమదూతలారా! వెడలిపొండు చల్లగా రోజులు జరిగిపోవాలని చాపమీద చలిమిడుండలు వాయనమిచ్చాను. చక్కాపొండి యమదూతలారా! చక్కాపొండి చేసిన శుభాలు చేస్తూనే వుండాలని చేరువగా చేట వాయనమిచ్చాను. చేరకండి యమదూతలారా! చేరకండి-సర్వేశ్వరుని కరుణ సర్వకాలమూ ఉండాలని సందులో చక్కిలాలు వాయనమిచ్చాను. జంకిపొండి యమదూతలారా! జంకిపొండి అందరి కంటె అధికముగా ఉండాలని హరునియెదుట అరటిపండ్లు వాయన మిచ్చాను అవతలికిపొండి యమదూతలారా! అవతలికిపొండి కొదవలు లేకుండా కోటివేలేండ్లు కాపురము చెయ్యాలని గొబ్బరిబొండాలుగోడ దగ్గర వాయనమిచ్చాను. గొబ్బున పొండి యమదూతలారా! గొబ్బున

పొండి- ఏగొడవలూ లేకుండా బతకాలని కాగుదగ్గర చేగోడీలు వాయనమిచ్చాను. సాగిపొండి యమదూతలారా! సాగిపొండి నిండిన కుండలాగు తొణకకుండా కాపురముండాలని నీలాటిరేవున నిండుకుండలు వాయనమిచ్చాను. నిలవకుండా పొండి యమదూతలారా నిలవకుండా పొండి- అమలమైనా కీర్తి వ్యాపించడానికి అటుకక్రింద అద్దాలు వాయనమిచ్చాను. అవతలకి పొండు యమదూతలారా! ఆవలికి పొండి-ఎల్లవారు నాయాజ్ఞ శిరసావహించాలని మల్లెపువ్వు దండలు మధురక్రింద వాయనమిచ్చాను. మాటాడకుండా పొండి యమదూతలారా మాటలాడకుండా పొండి-తనివి లేకుండా దానధార్మలు చెయ్యాలని తలుపుదగ్గర ధనము వాయనమిచ్చాను తరలిపొండి యమదూతలారా తరలిపొండి! అని యా యిల్లాలు మహాధైర్యంతో దేవీ దేవవర్లనునమ్మి యమదూతలను తరుమ జొచ్చింది. "భక్తి పాతివ్రత్యంగల పడతుల పల్కులు యమదూతలు మాత్రము దాటగలరా బాబూ! అని యా యమదూతలు ప్రాణాలు చేతబట్టుకొని అందరిని వదలిపెట్టి పారిపోయారు. అప్పుడు యుద్ధంలో పడిపోయిన వారందరూ పార్వతీ పరమేశ్వరుల కృపచేత నిద్రపోయి లేచినట్లు లేచివచ్చారు. ఆ ఇల్లాలు భక్తితో పార్వతీ పరమేశ్వరులకు మ్రొక్కుచూ, పట్టిన నోములు పట్టకుండా మున్నూటరవై రోజుల నోములతోనూ వ్రతాలతోనూ, పెనిమిటితోనూ, బిడ్డలతోను, భోగభాగ్యాలతోను కలకాలం గడిపి కైలాసం చూరగొన్నది. ఆమె నోచిన నోము అందరు నోచారు భక్తి తప్పకుంటే ఫలంతప్పదు. ఈకథ చెప్పుకొని అక్షతలు వేసుకోవాలి.

**ఉద్యాపనము :** కథలో జెప్పిన యిరవైయైదు దినుసులు శక్తి గలిగినప్పుడు ముత్తయిదువున కిచ్చు కోవలెను. పట్టుచీరతోపుచీర తెల్లచీర మాత్రము ఒక్కొక్కటి చొప్పున ముత్తయిదువులకు ఇయ్యవలెను. నీళ్ళు కడవలు అయిదు మాత్రమే ఐదుగురు ముత్తయిదువులకు దక్షణ తాంబూలములతో పసుపుపూసి బొట్టుంచి వాయనమీయ వలెను. తక్కిన దినుసులన్నీ యిరవైయైదు చొప్పున జతపరచుకొని అయిదుగురు ముత్తయిదువుల కైదేసి పంచి యిచ్చు చుండవలెను. ధనము వారిశక్తి కొలది అయిదుగురు ముత్తయిదువుల కైదేసి కాసులో, రూకలో, కానులో యియ్యవలెను.

## 29. కృత్తిక దీపాలనోము కథ

ఈ నోము కృత్తికా నక్షత్రము కార్తీక పున్నమినాడెప్పుడు వచ్చునో అప్పుడు పట్టవలెను. నిండుపున్నమి కావలెను. పట్టినియేడు నూట ఇరువది దీపములు శివాలయములో వెలిగించి విఘ్నేశ్వరపూజ శివాభిషేకము చేయించి, బ్రాహ్మణునికి మానెడు సోలెడు బియ్యమూ దక్షిణ తాంబూలములుయిచ్చి పాడ్యమినాడుదయమున పదిమందికి తక్కువ కాకుండా బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. ఇలాగేఖండ తిథిగాకుండా కృత్తిక నక్షత్రముతో కూడిన కార్తీక పున్నమినాడే గాని, యీ నోము నోచకూడదు. మూడేండ్లు నోచవలెను. రెండో యేడు రెండు వందల నలభై దీపాలు, మూడోయేడు మూడువందల అరవై దీపాలు అదేవిధముగా వెలిగించవలెను. కృత్తిక దీపాలనోము నోచినవారికి శివసాయుజ్యము తప్పకుండా లభించును.

## 30. గండాల గౌరీ నోము కథ

రాజు కూతురు, ప్రధానికూతురు గండాల గౌరీ నోము పట్టి రాజు కూతురుల్లం ఘనచేస్తే, ప్రధాని కూతురు భక్తి శ్రద్ధలతో నోచి ఉద్యాపనచేసింది. ప్రధాని కూతురుకి మగనికి బిడ్డలకు, ధనానికి ధాన్యానికి దాసదాసీజనానికి, ఇండ్లకు వాకిండ్లకు, దూతలకు, దుడకలకు, కార్యాలకు, కథలకు, శుభాలకు వైభావాలకు అన్నిటికీ కూడా దీనికి యేగండం లేకుండా తీగతీసినట్టొక్కలాగు జరిగిపోతూ, ఇరుక్కి, పొరుక్కి చుట్టాలకీ, బంధువులకీ అందరికి కన్నుల పండుగగా కాపురము చేస్తూందట. రాజు కూతురుకి అడుగడుగున గండాలే కదిలితే గండం. బ్రతుకంతా గండాలై పోతూందట అలావుంటే ఆ చిన్నది పార్వతీ పరమేశ్వరులను గూర్చి తపస్సు చేసిందట అప్పుడు వారు ప్రత్యక్షమై బిడ్డా గండాల గౌరీదేవి నోముపట్టి ఉల్లంఘన చేసితివని చెప్పగా అప్పుడావిడ వారి కాళ్ళకు మ్రొక్కి, వారి యాజ్ఞ ప్రకారముగా మళ్ళీ నోముపట్టి యధావిధిగా ఉద్యాపనము చేసికొని యే గండాలు లేకుండా ప్రధానికూతురులాగు పెనిమిటితోను, బిడ్డలతోను, భాగ్యంతోను, భోగ్యంతోను వేయేండ్లు వర్ధిల్లి పార్వతీ సన్నిధానము కేగినదట. ఆమె పట్టిన నోమందరూ పట్టారు భక్తి తప్పినా ఫలము తప్పదు. ఏడాది అక్షతలు వేసికొనవలెను.

**ఉద్యాపనము :** అయిదుశేర్ల బియ్యము చలిమిడి, అయిదు శేర్ల పప్పు చిమ్మిలి చేసికొని పదమూడేసి ఉండలు క్రిందచేసి పదునిద్దరు బ్రాహ్మణులకైనా, ముత్తయిదుల కైనా వాయనమియ్యవలెను. దక్షణ కానీయుంచి తాంబూలాలు ఇవ్వలెను. పదమూడు జోడాలు తక్కెడ చిప్పలు చేయించి, ఒకచిప్పలో ఒక చిమ్ములుండా, ఒక చలిమి డుండా వుంచి ఇంకో తక్కినచిప్ప పైన మూసి, ఆ వరుసను పండ్రెండు వాయనా లియ్యవలెను. పదమూడోది నైవేద్యము పెట్టి తాను తన వాళ్ళు భుజింపవలెను.

## 31. లక్షపసుపు నోము కథ

లక్షపసుపునోము నోచిన భామకు లక్షవేలేండ్లయిదవతనము. లక్షవేలేండ్లు కడుపుచలువ లక్షవేలేండ్లు అక్షయభాగము అక్షయలోకప్రాప్తి కలుగును. ఈ కథ చెప్పుకొని అక్షతలు వేసికొనవలెను.

**ఉద్యాపనము :** పసుపుకొమ్ములు బస్తాదగ్గర నడుము విరుగని పసుపు కొమ్ములు జతపడినపుడెల్ల వందలో వేలో దొరికినవన్ని ఏరుకొని ఆ కొమ్ములు పట్టించుకొనివెళ్ళి ఇంటివద్ద దోసెడు తక్కువ కాకుండా తోచినన్ని పంచిపెట్టుచుండ వలెను. అలా లక్షకొమ్ములయ్యే పర్యంతము పంచి పెట్టవలెను. పసుపు కొమ్ములతో తోచినరీతి కుంకుమకూడా యియ్యవలెను. కొందరు ముందుగా గౌరీదేవికో, లక్ష్మీదేవికో లక్షనామాలతో కుంకుమపూజచేయించి ఆ కుంకుమ జాగ్రత్తచేసికొని అది పసుపుకొమ్ములతో కలిపి పంచిపెట్టుచుందురు.

## 32. గడప గౌరీ నోము కథ

గడపగౌరీ నోము నోచినదానకు గడపరాని గండాలుండవు. గౌరీ శంకరుల కరుణకు కొదవవుండదు. ఈ కథ చెప్పుకొని అక్షతలు వేసికోవలెను. యొక ఏడాది యొక ఇంటి గడపకు పసుపురాసి మూడు కుంకుమబొట్లు ప్రతి దినము పెట్టుచుండవలెను.

**ఉద్యాపనము :** ఏడాదిలోగాని, తరువాతగాని, గారెలు పదిమూడు జోడాలు యొక పళ్ళెములో వుంచి చీర, రవిక, కుంకుమ మట్టెలు, మంగళసూత్రమునుంచి యొక ముత్తయిదువునకు వాయనమీయవలెను.

## 33. కళ్యాణగౌరీ నోము కథ

"కల్యాణ గౌరీ నోము పట్టిన కాంతకు నిత్యకళ్యాణం పచ్చ తోరణమని" చెప్పుకొని అక్షతలు వేసుకొనవలెను. ప్రతిదినము నొక పేరంటాలికి "నీవే నా పాలిట పార్వతీదేవివని చెప్పి తలదువ్వి బొట్టుపెట్టి పంపుచూ యొక యేడాది యిట్లు నోచవలెను. యేడాది లోపుగాని, తరువాత గాని ఉద్యాపనము చేసుకోవలెను.

**ఉద్యాపనము :** పెండ్లి యగుచున్న పిల్లలకు మంగళసూత్రధారణమై పెండ్లి కూతురు పీటమీద నుండి లేచినవెంటనే ఈ క్రింది చెప్పిన రీతిని వాయన మీయవలెను. ఒక పళ్ళెరములోచీర, రవిక, మట్టెలు, మంగళసూత్రములు, (బొడ్డిపుస్తెలు పెట్టెదరు) పువ్వుల దండలు, అత్తరువు, పన్నీరు, గంధము, కుంకుమ, పసుపు, ఉంచుకొని ఆ పళ్ళెరము సహితముగా పెండ్లికూతురుకు వాయన మీయ వలెను. కథలోపమైనా వ్రతలోపము కాకూడదు. భక్తి తప్పినా ఫలము తప్పదు.





## ఇతిహాసములు - వచన పురాణములు

| | | | |
|---|---|---|---|
| స్త్రీలవ్రతకథలు | 25-00 | కార్తీక మాహాత్మ్యం | 36-00 |
| గోవిందనామాల భగవద్గీత | 15-00 | గరుడపురాణం | 25-00 |
| శివపురాణం | 108-00 | పద్మపురాణం | 108-00 |
| దేవీభాగవతం | 108-00 | తులసీరామాయణం | 108-00 |
| రామాంజనేయులయుద్ధం | | సీతారామాంజనేయ | |
| (-బదిరెడ్డి కోటేశ్వరరావు) | 30-00 | సంవాదం | 108-00 |
| గృహవాస్తు మర్మములు | 30-00 | మహాభక్త విజయం | 180-00 |
| గృహవాస్తు చింతామణి | 54-00 | శ్రీమద్రామాయణం | |
| విష్ణుపురాణం | 108-00 | (బైండ్ 360పేజీలు) | 360-00 |
| బ్రహ్మపురాణం | 108-00 | మహాభారతం | |
| మార్కండేయ పురాణం | 108-00 | (18ప॥ 3,000పేజీలు) | 900-00 |
| బసవపురాణం | 108-00 | శ్రీమదాంధ్ర భాగవతం | 360-00 |
| శివరహస్యఖండము | 180-00 | భగవద్గీత బైబిల్ ఖురాన్ | 180-00 |
| అష్టాదశ పురాణం | 108-00 | హిందూయుగం | 75-00 |
| స్కాంధపురాణం | 108-00 | బౌద్ధయుగము 1వభాగం | 75-00 |
| చెన్నబసవపురాణం | 108-00 | బౌద్ధయుగము 2వభాగం | 75-00 |
| బ్రహ్మోత్తరఖండము | 108-00 | భారత అర్థశాస్త్రం | 75-00 |
| కార్తీక పురాణం | 25-00 | గాంధీ చరిత్ర | 54-00 |
| మాఘపురాణం | 25-00 | బాలకాశీమజిలీకథలు | |
| సానందోపాఖ్యానం | 54-00 | | |
| వైశాఖ పురాణం | 25-00 | (12భాగాలుసెట్టు) | 180-00 |


**కాళహస్తి పబ్లికేషన్స్**

కాళహస్తి పార్వతీశం సన్

కె.వి.ఆర్. స్వామిరోడ్, రాజమహేంద్రవరము.